# సప్తర్షులు

## మొదటిభాగము

చక్రావధానుల మాణిక్యశర్మ



పబ్లిషర్సు:
వేంకట్రామ అండ్ కో.,
హెడ్డాఫీసు:—ఏలూరు.
3993 మార్కెట్టువీధి, సికింద్రాబాదు.
1937.



వెల 0—12—0.

# భూమిక.



మహాశయులారా! రత్నాకరంబున నెన్ని రత్నములు కలవో నిర్ణయింప లేనట్లు పురాణంబులలో మహాత్ముల యితివృత్తములయందలి గుణమణుల నన్నిటిని దెలిసికొనుట నాబోటి యల్పమతికి దుర్లభము. నే నీ సప్తర్షుల చరిత్రమును వ్రాయుటకు బ్రహ్మపురాణము, బ్రహ్మవైవర్తము, స్కాందము, శివరహస్యఖండము, మార్కండేయము, శివపురాణము గారుడము, మహాభారతము, భాగవతము, నారదసంహిత, ధర్మఖండ సూత్రములు, నుపనిషత్తులును వాసిష్ఠమునం దేవఱకు దెలిసికొని వ్రాసితి. ఇందు సప్తర్షుల ప్రభావంబులు కొన్ని యుండక పోవచ్చును. పురాణజ్ఞులు తెలిపినచో సవరించుకొందును. ఇందు బ్రమాదజనితములు గాని, నాయజ్ఞానకల్పితములుగాని దోషములుండిన మన్నింపఁ బ్రార్థితులు.

ఇట్లు విబుధవిధేయుఁడు,

చక్రావధానుల మాణిక్యశర్మ



# సప్తర్షులు.

## మొదటిభాగము.

### 1. కశ్యపుఁడు.



శ్లో. కశ్యపోఽత్రి భరద్వాజౌ।
విశ్వామిత్రోఽథ గౌతమః।
జమదగ్ని ర్వసిష్ఠశ్చ
సప్తైతే ఋషిసత్తమాః.

ఉ. ప్రళయ పయోధిఁదేలు వట ♦
పత్రమునం బవళించి కాలి యం
గుళిసుధ గ్రోలుచున్ భువన ♦
గోళములన్ సృజియింప నాభిప
ల్వాలమున నొప్పు పద్మముకు
ళంబున బ్రహ్మను గన్నయట్టి మం
గళకరమూర్తి విష్ణువు జ ♦
గన్నుత పాదము లాశ్రయించెదన్.

సృష్ట్యాదియందు శ్రీమన్నారాయణుని నాభీస్వర్ణ కమలంబున బొడమిన చతురాననుండగు బ్రహ్మ శ్రీహరి యను గ్రహంబున దొలుత బ్రహ్మాండమును సృజించి యుదకంబుల నుదయింపంజేసి యాబ్రహ్మాండమును రెండుభాగములఁ జేసి,

పై భాగమును స్వర్గముగను క్రిందిభాగంబును భూమిగను, ఆరెండింటికి మధ్యభాగము నాకాశముగను నిర్ణయించి, దశదిశలను, వృక్షాది, కాలంబును, మనంబును, వాక్యంబును, కామక్రోధములను మొదలగు వానిని సృష్టించి పిదపఁ బ్రజాపతిగణంబును సృష్టి సేయందలంచి సనకసనందన సనత్సుజాత సనత్కుమారులను, ధర్ముని, నారదుని మొదలగు వారిని సృజించెను. కాని వారు ప్రజాసృష్టి సేయుట కంగీకరింపక తపంబు సేయుటకై యరిగిరి.

అనంతరమున బ్రహ్మ భృగువును, పులస్త్యుని, పులహుని, క్రతువును, అంగిరసుని, మరీచిని, దక్షుని, అత్రిని, వసిష్ఠుని సృజించి యంతటితోఁ దృప్తిఁగనక తన దక్షిణాంగుష్ఠము నుండి యొక సుందరాకారుని వామాంగుష్ఠమునుండి సౌందర్యశాలిని యైన శతరూపయను కన్యకను సృజించి, ప్రజాసృష్టి సేయ నాజ్ఞ యొసంగెను. ఆసుందర పురుషుఁడే స్వాయంభువ మను వని ప్రసిద్ధికెక్కెను. పైనుదహరించిన నవబ్రహ్మలలో మరీచియనువాఁడు కళాస్వరూపిణియగు కళయను నామెను పరిణయంబై యామెయందుఁ గశ్యపుని, బూర్ణిమ యను బాలికను నుదయింపం జేసెను. కళామరీచుల కుదయించిన కశ్యపుఁడు సర్వమును జూచువాఁ డగుటచే "పశ్యకః" అను నామమేర్పడినది. "కశ్యపః పశ్యకోభవతి" అను న్యాయముచే నాపశ్యక శబ్దము వినిమయత్వమును బొంది "పశ్యకః" అని నిర్ణయింపబడినది; అందువలన నతని నామము కశ్యపుఁ డనియే ప్రసిద్ధమైనది.

కశ్యపునకు జన్మతోడనే సకల వేదశాస్త్రార్థ వైశద్యము కలిగియుండుటం జేసి వేఱె విద్యాభ్యాస మనవసరమయ్యెను. కాని ప్రజాసృష్టి సేయుటకుఁగాని తాను తరించి మోక్ష సుఖంబు నందుటకుఁగాని విజ్ఞానదృష్టి వైభవంబును బడయుటకుఁగాని తపంబు మహనీయ సాధనంబనియుఁ దండ్రియైన మరీచి వలెను బితామహుండైన చతురాననుని కరణిని సంకల్ప మాత్రంబున నాత్మశక్తి వలనను సృష్టికార్యము నొనర్చుటకుఁ దగినంత సామర్థ్యములేక, పుణ్యతరంగిణీ తీరమున కరిగి నియమవ్రతుండై నిరాహారుఁడై చిరకాలము తపంబాచరించి, తాను లోకముల కుపకారము సేయుట కనువైన వరంబులంబడసి, సఫల మనోరథుండనైతినని సంతసించుచు నిజాశ్రమమున కరుదెంచెను. కశ్యపుం డప్పుడు తండ్రియనుజ్ఞను వడసి, ప్రజాసృష్టిసేయఁ దగిన కార్యభారమును శిరమున వహించి దక్షప్రజాపతి పుత్త్రికలలో సురూపసద్గుణసంపన్నలైన అదితి, దితి, దనువు, అరిష్ట, సురస, ఖస, సురభి, వినత, తామ్ర, క్రోధవశ, ఇల, కద్రు, ముని అను పదుమువ్వుర కన్యకలను పరిణయంబై సంసార నిబద్ధచేతస్కుండై యుండెను.

సకల ఫలభరితమైన యారామమునఁ బ్రవేశించినవానికి స్వాదుఫలాభిలాష మెట్లుండునో, సంసార గ్రథితుఁడైనవానికి సత్సంతానవాంఛ యట్లుండుట సహజము. కనుక, తన మనంబున లోకపూజ్యులైన కుమారులఁ బడయవలయునను

నభీష్టముతోఁ బ్రశాంత మనస్కుండై పవిత్రమార్గాను సారియై అదితియను సాధ్వియందు శుభ ముహూర్తంబుల ఇంద్రుని, విష్ణువును, అర్యముని, ధాతను, త్వష్టను, పూషుని, వివస్వంతుని, సవితృని, మిత్రుని, వరుణుని, అంశుని, భగుని నీద్వాదశాదిత్యులను బుట్టించెను.

ఈ ద్వాదశాదిత్యులను మహాయోగ్యులనియు, స్వర్గ సామ్రాజ్యమును బరిపాలింప సమర్థులనియుఁ దలపోసి బ్రహ్మ వారలకు స్వారాజ్యమును బరిపాలింప నధికార మొసంగెను.

కశ్యపుండును తన సంతతియైన ఆదిత్యులు స్వారాజ్య పదంబు నధిష్ఠించి పరిపాలించుచున్నారని యమితానంద మున నోలలాడుచుండు నవసరంబున దితియను నామెవచ్చి తనసవతి యప్పుడే సంతతింగాంచి సుఖించుచున్నదనియు, దనకింకను సంతు కలుగలేదనియు, విచారింపఁ దొడంగెను. కశ్యపుండును నామె యసూయాభావమును గనిపెట్టి, కళ్యాణీ! దితీ! పుత్రులుదయింపలేదను నంతకంటె నీ సోదరి పుత్ర వతియైనదను విచారము నీకెక్కుడుగ నున్నట్లు తోఁచెడిని. పరుల యానందమును మన యానందముగ భావించువారికి సర్వాభీష్టములును కరగతంబులగును. నీవు సర్వజనగర్హ్య మైన యోర్వలేనితనంబును వహించి నీకుక్షిని ఖిలము జేసితివి. అట్టి యపవిత్రగర్భమున జనించినవారు "అపవిత్రులే" యగు దురు. అంతియెకాక యీ సంధ్యాసమయమున జనిం చినవారు లోకకంటకు లగుదురు. అట్టి సుతులు జగత్కంటకో

భంబును జేయుచుండఁ దండ్రి కేమి యానందము ? తల్లి కేమి సమ్మోదము ? నీవు తొలుత నీయాత్మనుండి ద్వేషమును బాఱ ద్రోలుము. "పరహితరాగ" మను పరిశుద్ధజలంబులచే నీ జఠర సీమను బవిత్రముగఁ జేయుము. అనంతరమున నీ సోదరి యదితివలె దివ్యులఁ గాంచఁగలవు.

గీ. పరుల యుచ్ఛస్థితినిగాంచి ♦ పరమముదముఁ
గాంచువారి కభీష్టముల్ ♦ కరగతములు
శోకకారణమైన య ♦ సూయ యెట్టి
వారికిని నింద్యమగుఁ జూవె ♦ వారిజాక్షి!

కావునఁ దొలుత నీవుపరిశుద్ధురాలవగుమని యెన్నియో బోధించెను. కాని, యామె తన మాటలయందు విశ్వాసమును జూపకపోవుటయే కాక అదితియందుఁ దాను పక్షపాతమవలంబించి యట్లు చెప్పుచున్నట్లు తన మాటలవలన సూచన జేయుటయు, నన్నిప్పుడనుగ్రహింపక తప్పదని నిర్బంధించుటయుఁ గశ్యపునకు మితిలేని చింత కలిగి, దితీ !

గీ. ఎట్టివారు సుపుత్రులు ♦ పుట్టుకొఱకు
నభిలషింతురుగాని దు ♦ రాత్ములైన
కొడుకులే కావలయునని ♦ కోరుకొందె ?
కాన నిపు డట్టి యభిలాష ♦ మాను మబల!

అని దితికిఁ బలువిధముల బోధించెను. అయిన నేమి ? ఆ బోధనములన్నియు బూదిలోని హోమమువలె వ్యర్థములయ్యెను. అంతియెకాక, భర్త భార్యలనందరిని సమాన

భావముతో జూడకుండుట పడఁతుల దురదృష్టమని కన్నుల నీరు గార్చుచుండెను. ఆ దితియొక్క యవివేకమునకు, నుదాసీనత్వమునకును మనంబున విచారించి యుపాధినిర్గుణంబలం దెఱు నొక విధమైన సత్స్వభావమును బూనియుండుట గడు దుర్లభము. అందువలననే, కొందఱు అయోగ్యులుదయించు చుందురు. విజ్ఞానులెంత ప్రయత్నించినను, శరీరధారులయందలి దుస్స్వభావములను దొలఁగింపఁ జాలరుకదా? అని తలంచి,

సీ. పవలునకు వెనువెంట శ ♦ ర్వరులవలెనె
సత్స్వభావులవెంట దు ♦ ష్టజనులుంట
సహజముగునదియే కదా ♦ స్రష్ట సృష్టి
చిత్రమైనఖరి దీని భం ♦ జింపఁ దరమె ?

అని దివ్యదృష్టితో భవిష్యదర్థంబునుగ్రహించి స్మితాననుండై ఈ కథ యిట్లే జరుగవలసి యున్నది. కాని, పుత్రులను సన్మార్గగాములఁగాఁ జేయు భారము తన తలమీఁదఁ బడినదని నిశ్చయించుకొని యాదితికిఁ బుత్రదానముం జేసెను.

అప్పుడే సద్యోగర్భంబున దితికి హిరణ్యాక్ష హిరణ్యకశిపులను నిరువురు సుతులు పాలవెల్లి కడుపున హాలాహలముద్భవించిన ట్లుదితులైరి. అట్టి సమయమున నుల్కాపాతములుకాఁగా, జగంబంతయు వడంకెను. వెంటనే దితికి సింహిక యను తనయయు నుదయించెను.

హిరణ్యాక్షుండు హరివిద్వేషియై జగత్కంటకుండై పరివర్తించుచుండ, నారాయణుండు యజ్ఞవరాహామూర్తియై వానిని వధించెను.

హిరణ్యకశిపుండును హరిపయిం బగఁబూని వాని వధింపఁ ద్రిజగంబుల నన్వేషించి విఫలమనోరథుండై నిరంతర హరిస్మరణం బొనరించు తన కుమారుఁ బ్రహ్లాదుని బాధింపఁ గుమారుని ప్రార్థనంబునం జేసి కమలామనోహరుండు నృసింహావతారమునెత్తి కనకకశిపుని వధించెను.

సింహిక యను తనయ నవగ్రహములలో రాహువును బ్రసవించెను. అందువలననే రాహువునకు సైంహికేయనామ మేర్పడినది.

గీ. ఎట్టి బల్లిదులైన ధ ♦ ర్మేతరముగఁ
గ్రూరులై జగములను సం ♦ క్షోభపఱుప
వారి క్రౌర్యంబె వారి సం ♦ హారమునకుఁ
గారణంబందుచే నది ♦ గర్హ్యమయ్యె.

అనంతరమునఁ గశ్యపునకుఁ దామ్రి యను భార్య యందుఁ గ్రౌంచి, శ్యేని మొదలగు పక్షివిశేషంబు లుదయించెను. ఆ విహంగ సంపదయే యులూకగృధ్రముఖజంతు జాలమై జగంబంతయు నావరించెను.

సురసయందు బహుశిరస్సమంచితంబులైన సర్పములును, వినతయందు రెండండంబులును, కద్రువకు సహస్ర సంఖ్యాతీతంబులైన నాగగణంబులును, క్రోధవశకుఁ గ్రూర ప్రకృతులును, ధరకు ననంత సంఖ్యంబులగు జలవిహంగములును, సురభికి గోమహిషీసమూహంబులును, ఇలకు వివిధంబులగు తరుగుల్మలతాదులును, ఖసకు యక్షరక్షోగణంబులును,

ముని యను పత్నికి నప్సరోగణంబులును, అరిష్టకు మహా సత్త్వసంపన్నులైన గంధర్వ గణంబులును నుదయించిరి. ఈ విధంబుగ స్వర్గ మర్త్యపాతాళ లోకముల నెందుఁజూచి నను గశ్యపుని సంతతియే యభివృద్ధిఁ జెందెను.

అపుడు బ్రహ్మాండభాండమంతయుఁ గశ్యపునకు గర్భ కోశమయ్యెను. సమస్త జీవరాసులను బోషించు భారము వహింపవలసియున్నది. ఎందుఁజూచిన దానే ప్రవర్తించు నవసరము కలిగెను. త్రిభువనములలోని జీవకోటులకు దానే ధర్మాధర్మములఁ దెలుపవలసిన వాఁడయ్యెను. తన వలన జనించిన జీవకోటుల సంఖ్య యెంతో తానే యెఱుంగకుం డెను. ఆనందము, బ్రహ్మానందమున గశ్యపుండు తేలియాడు చుండెను. అప్పటి యతని యామోద మిదమిత్థమని వర్ణింప నలవికాక యుండెను.

ఇంతలో,

చ. సవతులభీష్టముల్వరల ♦ సంతతి గాంచి సుఖించిరన్నచో
నువిదకుఁ జూడఁజూడఁగడు♦పుబ్బుటనైజము కావునన్విచా
రవికలచిత్తయై వినత ♦ క్రన్ననఁదాఁ గనిపెట్టియొక్క గుడ్డు
ప్పవియగఁజేయఁ నందునొక ♦ యర్ధశరీరుఁడులేచి యిట్లనున్

తల్లీ! తక్కిన యైదువందల వత్సరములును సంపూర్తి కాకుండ, నీ సవతులు సంతానవతులైనారను నసూయచే నేనున్న యండంబు నవియంజేసితివి. కావున, నీవు నీ సవతికి

దాసివయ్యెదవని శపించెను. వినత యాకుమారుని గౌఁగిలించుకొని విలపించు నవసరంబునఁ గశ్యపుఁడరుదెంచి, వినతా!

చ. మతినినవజ్ఞతన్ గలుగు ♦ మానిసి కేక్రియనో పరాభవ
స్థితిఘటియిల్లకుండినను ♦ క్షేమమునిసంపదఁగాంచుటెట్లు? దు
ష్కృతజనితవ్రణంబును జి ♦ కిత్సకు డందలి దుష్టరక్త సం
తతి వెడలింపకున్నఁ గల ♦ దా? సుఖసిద్ధి శరీరధారికిన్.

కావున, నీకుఁ దగిన ప్రాయశ్చిత్తమైనది. నీవనుభవింపక తప్పదు. నీవిఁకనైన రెండవ యండంబు నవియఁజేయక యందున్న కుమారుఁ డరుదెంచువఱకు భద్రముగఁ గాపాడుచుండుము. వానివలన నీవు దాస్యమునుండి విముక్తిఁజెంది సుఖించెదవు. వత్సా! నీ "వరుణ" నామంబుతోఁ బ్రవర్తిల్లుచు సూర్యునకు సారథివై యుండుమని చెప్పి కుమారు నంపివైచెను.

అంతలో మఱల నాదిత్యుల యౌన్నత్యదశను జూచి సహింపలేక దైత్యులును, దనుజులును గలిసి యింద్రాదులపై సమరము నొనర్పఁ బ్రారంభింపఁ గశ్యపుం డచ్చటికరిగి, దైత్యదానవులారా! మీరు నా మాట లాలకింపుడు. మీరును, శక్రాదులును నాకాత్మజులు. అందువలన మీ రన్యోన్యమైత్రిచే మెలంగుట ధర్మము. ఆదిత్యుల యోగ్యప్రవర్తనమునకును, ధర్మనిబద్ధులగుటకును సంతసించి, బ్రహ్మ వారికి దవ్యపదంబొసంగినాఁడు. మీ మీ ప్రవృత్తులును, ధర్మనిబద్ధములైనచో మీకును నట్టిపదవి

లభింపఁగలవని యెంతో బోధించెను. కాని, యా దైత్యులబుద్ధి మచ్ఛరంబునుండి తొలంగదయ్యెను. అట్టియెడ నాహవంబు మహాలోకసముగఁ బ్రవర్తిల్లెను. సురలకే విజయము సంభవించెను. అసురులు హతులయిరి. అట్టియెడఁగశ్యపుఁడు దైత్యవినాశనమునకుఁ బరితపింపనా? ఆదిత్యవిజయమున కామోదింపనా? సర్వజ్ఞుండును ధర్మాధర్మవివేచనా సహితుండును నగు నాతని కా రెండుపక్షములు రెండును దుల్యములే. భవితవ్యము నెఱింగిన వాఁడయ్యును నాత్మసంతతి విషయమై ధర్మపరిబోధ మావశ్యకమగుటచే వారికి హితవులఁ దెల్పుచుండునే కాని యామహాత్మునకు సంసార జంఝాటము పయఃకణంబునకు కమలపత్రసంపర్కము వంటిదై యంటియు నంటని యట్లుండును.

ఇట్లుండ నాత్మపుత్రుల వినాశనమునకుఁ దల్లడిల్లుచు దితివచ్చి మహాత్మా! మీరు మహానుభావులు. జ్ఞానస్వరూపులు. పుత్రుల దుర్గతివలనఁ దమకావంతయు విచారములేదు. నే నాఁడుదాన నగుటచేతను, గడుపునఁ గన్నదాన నగుటచేతను నేను దుఃఖమును చల్లార్చుకొనఁజాలను. నాపుత్రులను నాసవతి పుత్రులు రూపుమాప నేను దుఃఖమును దిగమ్రింగఁజాలను. ఆదిత్యుల రణముననోర్చి జయింపఁగల యొక్క బలపరాక్రమ సంపన్నుని గుమారు ననుగ్రహించి నావెతఁదీర్పుఁడు. మీరు నాసవతియగు నదితియందుఁ జూపుచున్న కరుణలోసహస్రాంశమైన నాయందుఁ బ్రసరింపఁజేయుఁడు. సర్వసమభావులైన

తమచెట్టి పక్షపాతంబు నవలంబించుట భావ్యముకాదు. నాకు మనఃప్రియంబును సేయుఁడని పెవిధములఁ బ్రార్థించెను. కశ్యపుఁడును, ఓరమణీ! తపఃప్రభావ సంపన్నులును బలప్రతాపనిధులునైన నీకుమారులు క్రోధభూయిష్ఠులై యాదిత్యులఁ జెనకి నశించినారన్న తత్త్వార్థమును నీవిప్పటికిని దెలిసికొనవైతివి. కాలవశంబుచేతను దుష్కర్మరతు లగుటచేతను వారు నశించిరి. వారి నాశనమునకుఁ గారణభూతురాలవు నీవే. సందియము లేదు. ఏమందువా? నీ హృదయము మాత్సర్యముతో నిండియుండుటచే నీకుఁజనించెడు నపత్యంబులును మాతృదోషంబునం జేసి మత్సరగ్రస్తములై శత్రువులచే హరింపబడినవి. నీ వాయర్థమును బూర్తిగ నెఱింగి ప్రవర్తించుచు శుచివై వేయివర్షంబులు గర్భధారణముం జేసితివేని యాయుదయించెడు పుత్రుండు దివ్యనివహమునకు సేవ్యుఁడై దిగంత విశ్రాంత యశోధనుండై మాతా పితరుల కానందజనకుండై ప్రవర్తిల్లఁగలఁడు. నీ వతనివలన వంతఁబాసి నిరంత రామోదంబున నుండంగలవని చెప్పి, యొకమహామంత్రము నుపదేశించెను.

దితియు నామంత్రమును బునశ్చరణము సేయుచు భర్త చెప్పినట్లు బ్రహ్మచారిణియై గర్భమును ధరించి శుచివ్రతయై యుండెను. కాని తన్ను జంపఁగలవాఁ డుదయించునని మచ్ఛరంబున నింద్రుండు సూక్ష్మరూపియై యామె గర్భంబునఁ బ్రవేశించి యాపిండమును నలువదితొమ్మిది శకలములుగ ఖండింప నాశకలములు మరుద్గణంబులై జన్మించి శక్రుని యాజ్ఞకు బద్ధులై యాతని సేవించుచుండిరి.

మఱికొన్ని దినంబులకు వినత కనిన రెండవయండంబవిసి యందుండి గరుత్మంతుం డుదయించి తల్లిదాస్యంబును మాన్ప నింద్రలోకమునకు నమృతార్థమై యరుగుచు గశ్యపుని దన కాహారముఁ జూపుఁడనివేఁడ నాతనికి సరోవర విపినంబులఁ బోరాడు గజకచ్ఛపముల భక్షించుమని యానతిచ్చి తాను గంధమాదనంబునఁ దపోనిష్ఠనుండెను. అంతలో మఱల సుపర్ణుం డొకచేత గజమును మఱొక కరంబునఁ గచ్ఛపమును నోట నొక మహీరుహశాఖను గఱచికొనిరా నాతని కరుణా స్వభావమున కానందించి యా శాఖనున్న వాలఖిల్యాదుల స్తుతించి వారి నన్యస్థలమున కరుగ నియమించి గరుత్మంతున కాజ్ఞయొసంగి యంపెను.

అనంతరమున నదితి యాత్మీయసంతతియగు దివ్యుల యజ్ఞహవిర్భాగములను దైత్యులు హరించుటయు నందువలన రాక్షస మారణమునకై సంకల్పించి కశ్యపు నారాధించి మార్తాండుని బ్రసవించెను.

ఆ మార్తాండుఁడును దన దుర్వారకిరణజ్వాలలచే రాక్షసుల హతము గావించెను. అందువలన దితి మఱల శోకాక్రాంతచిత్తయై కశ్యపుని దన మనోవ్యథ తీరునట్లు చేయుఁడని ప్రార్థింపఁజొచ్చెను. కద్రువయను భార్య వచ్చి గరుత్మంతునివలనఁ దన బిడ్డలు హతులగుచున్నారనియు బాధింపకుండఁ జేయుఁడనియు వేఁడఁదొడంగెను.

ఇట్లు కశ్యపుండు భార్యల దీనాలాపముల మధ్య కంటక గుల్మంబులోఁ దగుల్కొనిన హరిణంబు కరణి జిగురుగండెకు జిక్కిన శుకరాజంబు పగిదిఁ జిక్కుకొని దతికిని కద్రువకును మీ మీ మచ్చరములవలన మీసంతతి కిట్టి యిక్కట్టులు వాటిల్లుచున్నవనియు గద్రువను దన సంతతితో బాతాళమున నుండుమనియు నందువలన భయము కలుగదనియు జెప్పి యంపించెను.

అనంతరమున నాత్మవిచారణము గావించుచు సంసారము మహామహీధరమువలె భరింపరానిది. మహాత్ము లింములకే సనకసనందనాదులు ప్రజాస్సృష్టి నొనర్పజాలమని గర్హించి దీనిని బరిత్యజించి తపఃఫలసామ్రాజ్యము నందుటకై చనినారు. నేను నాతండ్రివలన నిట్టి దుర్భరకార్య భారమును శిరమున వహించినాఁడను. పితాజ్ఞ అనుల్లంఘ్యము. అట్టి జనకాజ్ఞ నుల్లంఘించుటచేతనే నారదుండు శపింపంబడి పునర్భవ నరకంబునకు బాల్పడినాఁడు. నే నెందులకు సృజింపబడితినో ఆ కార్యము దుదముట్టువఱకు నే నాచరించుచుండవలయును. జగంబులన్నియు నా సంతానమయములగుటచే జగద్భరణంబు నాకు ముఖ్యాచరణీయమని తలంచి సర్వలోకముల సంచరించుచు విజ్ఞానులైన వారలచే యజ్ఞాదుల నొనరింపంజేసి వారికి ననంత ఫలంబుల సమకూర్చుచుఁ దాన జగన్నాథుండై ప్రవర్తించుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు తన భార్య దితి తపముజేసి మహిషాసురుని గనినట్లును, ఆతండు ముష్కరుండై యమరుల

జక్కఁడంపఁ దలంప, వానిని గౌరి చండకౌశిక్యవతారమెత్తి సంహరింపనున్నదనియు దెలిసి తత్క్షణ మా మహిషాసురుని చెంత కరుదెంచి వత్సా! నీవు ప్రశాంతహృదయుఁడవై నా వాక్యంబుల నాలకించుము. నీవు నా పుత్రుండవు. దేవతా సంహారమునకై నా భార్య దితి మహిషరూపంబును దాల్చి తపంబు సేయుటచే నీవు జన్మించితివి. నీవు నాయాత్మజుండ వగుట నీకు జ్ఞానోపదేశముంజేయ నాకు విధియగుటచేఁ జెప్పుచున్నాను. నీవు క్రౌర్యభావము నుడిగి తపంబుఁజేసి సర్వ లోకక్షేమంకరములైన వరంబులఁ బడయుము. అందువలన నీ కిహముం బరముం గూడఁ గలదు. అంతియే కాని యాదిత్యుల మచ్చమూప వలయును, జగంబుల హతమార్పవలయు నను దుర్బుద్ధిని మానుమని బోధించెను. అట్లే సేయుదును మహాత్మా! యని మహిషాసురుండు సమ్మతించెను. అంతలో దితి యరుదెంచి కుమారా! నీతండ్రి సురల యెడలఁ బక్షపాతబుద్ధి లేకయున్నవాఁడైన నీకిట్లు బోధించునా? సురల స్వారాజ్యమును నీవు చేకొందువేమో? అందువలన [illegible] కలుగుననియు నాకారణంబున నామె [illegible] భంగమగుననియుఁ దలపోసి యిట్లు బోధించినాఁడని మహిషాసురునకు బోధించుటయు నామె మాటలవిని యాతఁడమరులపై దాడివెడలి చండకౌశికిచే బంచత్వము నందెను. కశ్యపుని యాత్మ కదియంతయు గోచరమయ్యెను. అస్మృత వాక్యమునందున్న మధురిమ సత్యమునందదు కప్పు. కొండకాలువ నీటివెల్లువకుఁ గలిగిన వేగము సమాన

భూమింగూలుచున్న పాపినియుఁ దుండడు. అధర్మ కార్యముల యందున్న చోరన ధర్మకార్యవిషయములఁ బొడసూపదు. అట్టి కశ్యపుని హితవు తల్లి చెప్పిన దుర్బోధవలన మహిషాసురునకుఁ దలకెక్కక మృతుండయ్యెను.

ఉ. ఎన్నటికైన ధర్మమున • కే జయసిద్ధి ఘటిల్లుగాని, క్రౌ
ర్యోన్నతులైన మూఢులక•నొందగ సానని మోహితాత్ములై
మున్నరికంబుచే నడరుగు • మూఢులు ధార్మికభావశక్తిసం
పన్నతఁగాంచలేక తమ•ప్రాణముల్ ద్రుంచుచుందురు ధాత్రిలోన్

అని యాలోచించుచుఁ గశ్యపుండాత్మీయపుత్రులైన దైత్యదానవుల క్రోధోన్మాదమును వారింపజాలకున్నను క్రమముగ నిరజోగుణమే సర్వజగంబుల నాక్రమించి ధర్మశూన్యముగునని తలపోసి యుపేక్ష సేయక కశ్యప సంతతినాకే రజోగుణ భూయిష్ఠులై ప్రవర్తించుచున్నారని యపయశంబు వ్యాపింపకుండ వేదములలో బుక్కులను శిష్యులకు బోధించి యర్థములఁ జెప్పుచు, నా శిష్యులచే సర్వలోకంబుల శ్రుత్యర్థబీజంబుల నాటించుచు నాయాగములపై విధులేవో నిషేధములేవో విస్పష్టముగ లోకములఁ బ్రకాశింపజేయుచును హితకరముగఁ బ్రవర్తిల్లుచుండెను.

కాని, దైత్యదానవ క్రోధాగ్ని మాత్రము చల్లారలేదు. అయ్యది యాదిత్యకాంతారములపై నప్పుడప్పుడు విజృంభించుచునే యున్నది. లోకోద్ధారణపరాయణుండగు కశ్యపుండు తన సుబోధనాజలవృష్టిని గురిపించుచునే యుండెను. సర్వ

జనోపయోగమైన చూతలత త్వరగా విస్తరిల్లుట దుర్లభము. కాని ముండ్లపొద లేదోహదము నందకయే విస్తరిల్లుట సహజమగునట్లె దైత్య దానవులలోఁ జచ్చినవారు చావఁగా, మిగిలినవారి సంతతివారందఱును చంద్రులను మించిన దురాత్ములు బయలువెడలి యమరలోకసామ్రాజ్యఫలంబును యజ్ఞహవిర్భాగంబులను గైకొనుటకై తమ క్రౌర్యమును బ్రయోగించుచునేయున్నారు. అట్టి యధర్మ క్రౌర్యప్రవాహము నరికట్టుటకుఁ గశ్యపుం డనేకసేతువులను గట్టుచునే యుండెను. కాని యవన్నియు విచ్ఛిన్నములై పోవుచునేయున్నవి. అట్టి సమయంబున గశ్యపునకుఁ దపంబునకై యనుక్షణ మవకాశము లేకయున్నది. ఇట్లనేకవిధముల శ్రమనందుచుఁ దుదకెట్లో కొంతకాల మా దౌర్జన్యవిప్లవము నుపశమింపఁజేసెను.

దితిమాత్రము అదితి యందును ఆదిత్యుల యందును మాత్సర్యమును మానదయ్యెను. ఏవేవో ప్రయత్నములుఁ జేయుచునే యుండెను.

కశ్యపునకు సుంత విశ్రాంతి కలిగినది. ఒకసారి నిట్టూరుపు విడిచి అక్కటా! బహుకాంతావల్లభత్వము కడుదుర్భరము. నా తపంబంతయు నందువలన దగ్ధమగుచున్నదని విసిగి గంగాతీరమున కరిగి యందొక్క యాశ్రమము నేర్పఱచికొని తపంబు సేయుచునుండెను.

దితియు దన ప్రయత్నమును మానకుండెను.

కశ్యపుం డొకనాఁటి ప్రాతఃకాలమునఁ దపోనిష్ఠలో నుండి కనులఁ దెఱచిచూడ నెదుట నొక తపస్విని దర్శనీయ యయ్యెను. అతండును ఆ పరివ్రాజికను గాంచి నీ వెవ్వతె? వని ప్రశ్నించెను.

మహాత్మా! నేనొక తాపసిని. లోకపూజ్యులైన మీ చరణసేవ జేయుచు సుజ్ఞానబోధనంబునఁ దరింపఁ దలఁచి వచ్చితినని ముకుళితకరకమలయై సవినయంబుగఁ బ్రార్థించెను.

కశ్యపుఁడును సుశీలవు, అభీష్టంబుల నందఁగలవు. అట్లే సేవింపవచ్చునని చెప్పి, తన యనుష్ఠానంబునకు మఱలఁ బ్రారంభించెను. ఆ తపస్వినియుఁ గొన్ని దినంబులు బిల్వపత్ర పుష్పాదులఁ దెచ్చి కశ్యపునకొసంగుచు సేవించి ఎందువలననో ఆ మహాత్మునకుఁ దెలుపకయే ఎటకో వెడలిపోయెను.

అంత నొక్కనాఁడు కశ్యపుండు నిర్వర్తితకర్మానుష్ఠానుండై తత్సమీపవనంబునకుఁ బుష్పంబులకై యేగెను. ఆ స్థలమున నొక యపూర్వరమణీయమైన నానారత్న విరాజితమైన సౌవర్ణసౌధంబును గాంచి దాని యపూర్వశోభ తన యాత్మ నాకర్షింప నచ్చటి కేగెను.

కశ్యపుం డా సౌధమునఁ బ్రవేశింపఁగనే యందొక్క మోహనాంగి విధిప్రేరితయై కనులకు మిఱుమిట్లు గొలుపఁ గశ్యపుని హృదయము వికారమునకుఁ దావలమయ్యెను.

మహేశ్వరుండొక్కఁడు వినా హరి హర బ్రహ్మ ప్రముఖ దివ్యగణములును, మహర్షికోటులును, సర్వజగంబులును

ప్రకృతితత్త్వమును గాంచి మగ్నులు కానివారందఱు మహా త్ముండైన కశ్యపుండు విధినిర్ణయ తంత్ర మహాత్మ్యంబునం జేసి యా మాయాదేవీబద్ధచేతస్కుండై యామెయందు శూర పద్మ సింహవక్త్ర తారకప్రముఖ దానవగణంబుల రెండులక్షల తనయులను అజముఖి యను నొక తనయను సద్యోగర్భజనితులంబడసి యా సంతతినందఱిని జూచి యాశ్చర్య మంది దివ్యదృష్టితో వర్తమాన భవిష్య దర్థంబుల గ్రహించి, యిదియంతయు దితికృత్యమనియుఁ బరమేశ్వరుం డామెపైఁ గృపారసము జిల్కి యీవిధంబుగఁ గటాక్షించె ననియుఁ దలంచి పరమేశ్వరుని లీలలఁదెలిసికొన బ్రహ్మాదులకు గూడ వశముకాదు. నేనా తెలిసికొనువాఁడ ?నని మందస్మిత వదనారవిందుండై మఱలఁ దపంబునకై చనెను.

విమలగంగానదీప్రవాహమునఁ గొట్టుకొనిపోవు కాష్ఠ ములు మధ్యమధ్య సుడిలోబడి మునిఁగి యంతరించినట్లే కాల ప్రవాహమున నీదులాడు జీవులును దైవోపహతులై నశిం చుట స్వభావమగుటచే శూరపద్మాది రాక్షసులందఱును దివ్యుల బాధించుటచే సురప్రార్థితుండైన శివుండు కుమార స్వామిని బుట్టించి వారిని నామావశేషులఁ గావించెను.

ఇది యంతయుఁగాంచి మహానుభావుఁడైన కశ్యపుండు పుత్రమోహమను నంశమును దలంపక నవ్వుచు భగవంతుఁ డిట్టి లీలఁ జూపించుటకుఁ గారణమేమి ?బీజములనాటి మొలకెత్తిం పించి పెంచి కొన్నిటిని జిఱుతతనంబునను, మఱికొన్నిటిని

షలాంతమునను హాలికుండు వృక్షముల ఛేదించునట్లు చేయు చున్నాఁడు. దీనియర్థమేమి? అందున్నజీవుఁడు ప్రకృతికళకు లుబ్ధుండై దుష్కర్మలఁ జేయకయుండునంతవఱకు వారి వారి కర్మలననుసరించి యిట్లే పుట్టించుచుఁ గిట్టించుచు మార్చు చుండును. పరమేశ్వరున కిదియంతయు నొకక్రీడ. ఈసమ యంబున నామనఃపరిశోధనము జేయుటకై యత్నించి మాయను నాకడకంపినాఁడు.నాకిప్పుడీ మాయాతత్వమునుబోధ జేసినాఁడు. ధన్యుఁడనైతినని తలంచి, పరమేశ్వరునిచేతి క్రీడాభంజిక లలో నేనొక్క బొమ్మనైతినని యానందించు చుండెను. కళాదుండు కనకమును వన్నె దెలిసికొన ఘర్షోపలమున నొఱయునట్లే భగవంతుఁడును తన భక్తుని నున్నత పదవిని బ్రతిష్ఠింపఁ దలఁచి యనేక విధముల వాని మనఃపరిశీలనముఁ జేయుట స్వభావగుణమగుటచేఁ గశ్యపుని యాత్మకాందో ళనము గలిగింప బలిప్రముఖులైన క్రవ్యాదులకు మనో వికారమును గలుఁగఁజేసి, యింద్రాదుల నధిగమించునట్లు చేసెను. బలియు మహేంద్రుని స్వారాజ్యమును గ్రహించి వాని నడవులపాలుసేయ నదితి తన కుమారుల దుస్థితికి సహింపజాలక శోకించుచుఁ గశ్యపునిఁ బ్రార్థించి యొట్లైన నాయలమటతీరునట్లు బలినడంచి నాకుమారులకు స్వారాజ్య పదవి నొసంగఁగల కుమారు ననుగ్రహింపుమని పేవిధముల బ్రార్థించెను. కశ్యపుండును ధర్మసంరక్షణ మవశ్యాచరణీ యము గనుక యాయదితికి, మహోత్కృష్టమైన నారా

యణమంత్రము నుపదేశించి తపముఁ జేయుము నీయభీష్టంబు దీరును నీకన్నిటి ధారకట్టునని చెప్పి యంపించెను.

ఆ యదితియుఁ దపంబుఁ జేయ లక్ష్మీపతి ప్రత్యక్షమై, నీ గర్భంబున నేను జన్మించి నీకుమారుల బాధలఁదీర్చి రక్షించెదనని చెప్పి యంతర్హితుండయ్యెను.

అంతఁ గొన్ని దినముల కదితి గర్భంబున భగవంతుం డగు నారాయణుండు వామనుఁడై యవతరించెను.

కశ్యపుఁ డాబాలుని సద్గుణంబుల కలరుచు భగవంతుఁడు లక్ష్మీపతితనకుఁ బుత్రుఁడై యుదయించినాఁడని సంతోషముతోఁ బుత్రప్రేమను విడచి శ్రుతిసూక్తి విధానంబునఁ బొగడి యంతలోననే భగప్ప్రీతుఁడై పుత్రవ్యామోహముతోఁ గౌఁగిలించుకొని యాచిన్నకుమారుని బాలలీలల కలరుచుండెను.

ఇంతకుమున్న కశ్యపుని కుమారుఁడెవ్వండును తండ్రికి దనబాలలీలలంజూపి యానందింపఁ జేసినవాఁడెవ్వఁడును లేడు. సద్యోగర్భంబున జనించినవారు బ్రహ్మ నిర్ణయాధికారముల స్వీకరించి ప్రవర్తించుచున్నవారే ? యీ వామనుం డుపనీతుఁడు కాకమున్నే సమస్తవిద్యారహస్యములఁ దండ్రినడుగుచు సర్వజ్ఞుండయ్యును అజ్ఞానుని భంగిఁ దెలిసికొనుచుండెను.

కశ్యపుం డా వామనున కుపనయనముం గావించి బ్రహ్మోపదేశముంజేసి తన ముచ్చటను దీర్చికొనెను. తొలుత నదితికిఁ బ్రత్యక్షమైనప్పుడు విష్ణువు “నే నీ గర్భమున నుద

యించెద" నని చెప్పినమాటఁ గశ్యపుఁ డెఱింగియుండెను. జన్మించిన పిమ్మట నొక్క క్షణమాత్ర మా కుమారుని శ్రీహరిగా భావించి స్తుతించి యుండెను. వెంటనే తన కుమారుఁడని పుత్రప్రేమతో నాతని లాలించు చుండెను. అనేక కోట్ల జీవరాసులను ఆదిత్యులను గన్న కశ్యపునంతటి మహానుభావుఁడు సైతము విష్ణుమాయలో మునిఁగి సంసారమోహపాశంబునం జిక్కువడి యెట్లు ముగ్ధునిపోల్కి బ్రవర్తించు చుండెనో తెలిసికొనుఁడు ? ఇదియే "విష్ణుమాయ" యని పెద్దలు సెప్పెదురు. ఈ మాయయం దొకప్పుడు జితేంద్రియుఁడైన శంకరుఁడే తగుల్కొని పరిహాసపాత్రుఁడయ్యెను.

వామనుం డుపనీతుఁడైన వెంటనే, యా వటువు వేషముతోడనే యేఁగి, బలిచక్రవర్తిని త్రిపాద ధరణిని యాచించి కైకొని విశ్వరూపముందాల్చి జగముల నాక్రమించి బలిని పాతాళమున నా చంద్రార్కముఁ జిరంజీవివై యుండుమని చెప్పి యింద్రునకు స్వారాజ్యము నొసంగెను.

ఈ యానంద వార్తాశ్రవణంబునఁ గశ్యపుని హృదయము పార్వణచంద్రుఁ డుదితుండైన సమయమున బయోధి యెట్లుండునో అట్లానందరసతరంగ విజృంభణ వృత్తి నవలంబించినది.

దేవదానవ కలహము లంతరించినవి. ఆదిత్యులు సుఖంబున స్వర్గ పరిపాలనముఁ గావించు చుండిరి. కాని, యొక్క యాదిత్యు లానందము ననుభవించుచున్నా రన్నంత

మాత్రమునఁ గశ్యపునకు సంపూర్ణానందము కలుగునా ? జగంబులన్నియుఁ గశ్యపుని సంతతి వారితోడనే వెలయుచుండు టచేఁ దనకు భగవంతుండు రెండు నేత్రములే యొసంగినను సహస్ర నేత్రములతో జగంబంతయుఁ బరిశీలనము జేయు చుండెను. నిక్కముగఁ దాఁ గన్నవారలనే కాక "ఆత్మ వత్సర్వభూతాని"యను న్యాయముచే సందఱిని దనబిడ్డలవలెనే ప్రేమించు కరుణాస్వభావుఁడగుటచేఁ దనమనోదృష్టి నొకసారి వసుంధరపై నిగిడించి చూచెను.

ఆసమయమునఁ గార్తవీర్యార్జుననిపై నాగ్రహించి భార్గవరాముండు ముయ్యేడుమారులు ధరిత్రియంతయు నిక్ష త్రియముగావించి రక్తపుమడువులచే వెలయింపఁజేసియుండెను. అప్పుడు రాజవంశజులెల్లరును నామావశేషముగఁ జేయబడిరి. ఆ భార్గవునకు భయపడి కొందఱు పర్వతగుహాలలో నడంగి యుండిరి. ఎందుఁజూచినను నరపాలకపాలాస్థిపుంజంబుల గుట్టలే. యేపర్వతగుహాల నిరీక్షించినను రాజరమణీరోదన ధ్వనులే. చూడ దుస్సహమై కేవల శ్మశానముపగిది భీభత్సమైయొప్పు చుండెను. అట్టి దుస్థితితోనున్న వసుంధరఁదిలకించి కను దమ్ముల నీరొలికించి కరుణారసతరంగిత హృదయుండై శోకించి ఈసమయమున రాజకులము నుద్ధరింపకున్న సూర్యచంద్ర వంశము లంతరించునని యెంచి బిఱబిఱ భార్గవరాముని సన్నిధి కరుదెంచి భార్గవా! ఏమి ఈ రక్తపు మడువుచెంతఁ గూరు చుంటివని ప్రశ్నించెను.

భార్గవుండును కశ్యపునిగాంచి మహాత్మా! నా తండ్రి సధర్మమునఁ గూల్చిన క్షుద్రరాజకులముల సంహరించి వారి శోణితంబునఁ బితృతర్పణము సేయుచున్నానని బదులు సెప్పెను.

అట్లయిన భూదానము సేయకుండ నీ తండ్రికి సంప్రాప్తి కాదే? దాని విషయమై యేమని యాలోచించితివి? బహు కుటుంబీకుఁడను, బ్రాహ్మణుఁడను. నాకంటె నీ కుత్తము ప్రతిగృహీత లభించునా? అని కశ్యపుండు పలికెను.

రాముండా కశ్యపునిమాటల కానందించి మహాత్మా! నీవు కేవల బ్రహ్మవు. నీవంటి ప్రతిగృహీత నాకు లభింపని మాట సత్యము. నేనీ భూమినిగల రాజుల నందఱ సంహరించి యీ వసుంధర సర్వమును నావశము జేసికొంటిని. మీ కీ ధాత్రినంతయు దానమొసంగెద స్వీకరింపుఁడు. నాతండ్రియు నేనునుగూడ ధన్యులమయ్యెద మని చెప్పి కశ్యపునకు సమస్త ధారుణీచక్రమును భూదానము జేసెను.

కశ్యపుండపుడు రాముని బొగడి, ఓయీ! నీవు దాన మొసంగిన భూమియందు నీవడుగువెట్టి నిలువరాదు. నీవిప్పుడు దక్షిణసముద్రతీరమున కరిగి మహోదధిని బ్రార్థించి కొంత ప్రదేశము నీకొఱకు విడిచిపెట్టుమనియడిగి స్వీకరించియచ్చోటఁ దపంబుఁ జేసికొనుచుండుమని చెప్పి, రాముని దక్షిణ దిశ కనిపి భార్గవభీతిచే హతావశేషులైన రాజకుమారు లెందెం దడఁగియున్నవారో వారినందఱ రావించి యాయా రాజస్థానములఁ బ్రతిష్ఠింపఁజేసి రాజవంశముల సముద్ధరించెను.

కశ్యపునిచే నీధాత్రి గ్రహింపబడిన కారణముననే దీనికి "గాశ్యపి" యని నామమేర్పడినది.

అది మొదలు లోకరక్షణమునకై యే తన జీవయాత్రను నడిపించుచుఁ దనపుత్రుల క్షేమము నరయుకార్యమును విరమించి ప్రజలు నిరంతరమును దామనుష్ఠింపవలసిన ధర్మముల నిర్ణయించి కశ్యప సంహిత యను నామముతోఁ గొన్ని సూత్రముల రచించెను. శిష్యులకుఁ బఠనీయ గ్రంథముగాఁ జేసి జగంబున వ్యాపింపఁ జేసెను.

వాల్మీకిమహర్షి మొదలుకొని ఛందస్సనియు గణములనియు వృత్తములనియుఁ గవిత్వమనియు నిర్ణయింపఁబడినవి కాని, ఆకాలమునకు మహర్షి ప్రణీతము లన్నియు సూత్రములుగనే రచింపఁ బడినవి.

కశ్యపుఁడు మిక్కిలి సౌందర్యశాలి బలశాలియనియు అచ్యుతయశావనుఁడనియుఁ గొన్ని గ్రంథములవలనఁ దెలియనగును. పుణ్యచరిత్రుఁడనుటకు నా మహాత్ముఁడు తన సంతతిచే జగంబుల నిండింపఁజేయుటయే తార్కాణము. అతఁడెట్టి ప్రభావసంపన్నుఁడును గాకున్న శ్రీహరిని మార్తాండుని ద్వాదశాదిత్యులను గని యుండునా! సర్వజగన్నుతుండు. నిఖిల జగద్గర్భుఁడు. విశ్వంబునఁ గశ్యపుని సంతతికాని జీవకోటియే లేదు. ఎచ్చోటఁ జూచినను గాశ్యపసగోత్రోద్భవులే. అట్టి కశ్యపునకుఁ ద్రిమూర్తులును జిరస్థాయిగా వెలుంగుచునుండుటకై సప్తర్షి మండల స్థానమున నివసింప నియమించి

నందువలన నాఁడు మొదలు నేఁటివఱకు నా స్థానముననే పరం
జ్యోతి వలె నదితీసహితుండై వెలుఁగుచు స్మరణ మాత్రం
బున భక్తులపాపముల సంహరించుచుండెను. జగంబంతయు
గాశ్యపమయంబగుటచేఁ దమగోత్రముల మఱచిన వారంద
ఱును గాశ్యపసగోత్రుల మనియే సంకల్పముల జేసికొను
చుందురు.

ఇప్పుడు మనము పురాణముల ననుసరించి సప్తర్షి
మండలమెందున్నదో తెలిసికొన నవసరమై యున్నది. కావున
నిందు వివరించుచున్నాను.

పృథ్వికి లక్షయోజనములమీఁద జంద్రమండలమును,
దానికిలక్షయోజనములమీఁదఁ సూర్యమండలమును, దానికి
లక్షయోజనముల దూరమున నక్షత్రమండలమును, దానికి లక్ష
యోజనములపైన శుక్రగ్రహమండలమును, దానిపై నంతియె
దూరమున మంగళగ్రహమండలమును, దాని కూర్ధ్వంబున
నంతియెదూరంబున బృహస్పతిగ్రహంబును, దానికి రెండులక్షల
యోజనముల దూరమున శనిగ్రహ మండలంబును, ఆ శని
గ్రహమునకు లక్షయోజనముల దూరమున సప్తర్షి మండలం
బును గలదు. అట్టి పుణ్యస్థానమున వెలుంగు కశ్యపుని
చరిత్రము జగత్పావనమైనది.

---

# అత్రి.

ఈ యత్రి తొలుత బ్రహ్మకు జనించిన నవబ్రహ్మలలో నొకఁడు. అకారము విష్ణువునందును, త్రి శబ్దము త్రిగుణాత్మక మగు ప్రకృతియందును వర్తించుటం జేసి విష్ణుప్రకృతుల యందు సమంబగు భక్తిగలవాఁడగుటచే నీతనికి 'నత్రి' యను నామంబు సార్థకమైనది.

ఈతఁడును కశ్యపాదులవలెనే దండము, కమండలువును బ్రహ్మసూత్రమును గలిగి జటామకుటముతో జనించి వేద స్వరూపుఁడైన బ్రహ్మయొక్క దక్షిణనేత్రమువలనఁ బ్రభవించినవాఁడగుటచే సమస్త వేదశాస్త్రార్థముల నెఱింగి పితామహుని యాజ్ఞచే సృష్టినొనర్పఁ గుతూహలము కలవాఁడై, తపంబు సేయు జిజ్ఞాసఁగలవాఁడై ఒక నిర్మల ప్రవాహతీరమున కరిగి చిరకాలము తపంబునలిపి శ్రీమన్నారాయణుని యనుగ్రహమున వరములఁ బడసి మఱలివచ్చెను.

అట్లు కృతకృత్యుఁడై వచ్చిన అత్రిమహర్షికి స్వాయంభువమను పుత్రికయైన దేవహూతియందు కర్దమప్రజాపతి కాంచిన ప్రసూతియందు దక్షప్రజాపతి వడసిన యరువది కన్యకలలో ననసూయ యను కన్య నొసంగి బ్రహ్మదులు పరిణయముఁ గావించిరి.

అత్రిమహర్షి కేవలకామాసక్తుఁడు గాకపోయినను పరమేష్ఠియాజ్ఞ బలీయమై తనకు నవిలంఘ్యమైన దగుటచే

సృష్టిచేయుటకు నవలంబింపవలసివచ్చి తనలోఁ దా నిట్లు వితర్కింపఁగడఁగెను.

గీ. క్లేశమైనను గురుల సూ ♦ క్తిని గమించి
తనయు లకార్య మొనరింప ♦ ధర్మమతము
సేయకున్న బిత్రృణ వి ♦ శేషభరము
గొడుకు తలనుండి ధరదించు ♦ కొనుటదెట్లు?

కావున సంసారబంధము దుర్భరమైనను పితౄజ్ఞను పాలించు టుత్తమధర్మము. అయినను నాయాత్మయెట్టి పవిత్ర మార్గము నవలంబింపవలయునని కోరుచుంటినో నాభార్య యంతరాత్మయునట్టి సన్మార్గమునునుండిన నేనుధన్యతముఁడనగుదును. కావున, నాయర్ధాంగివిషయమై యించుకతఱచి యామె మనోధర్మమును బరిశీలించెదనుగాక ! అని తలంచెను.

ఇంతలో ననసూయవచ్చి అత్రిమహర్షి వామభాగంబునఁ గరకమలముల ముకుళించుకొని నిలిచెను.

దేవీ! వచ్చితివా, ఇటుగూరుచుండుమని పలికెను. అనసూయయు భర్తకు నమస్కరించి చెంతనిలిచెను. అత్రిమహర్షి మందహాసయుక్తుఁ డై ప్రియురాలా ! నీవువచ్చి చాలసేపై యుండవచ్చును. అప్పటి కిప్పుడా యభివందన మాచరించుట? యని పలికెను.

ఆర్యుల మనోవ్యాపకమున కంతరాయము కలుగునని యింతవఱకును వేచియుండినది అపరాధమైన క్షమింపుఁడు అనెను. బళి బళీ నీయూహ ప్రశంసనీయము. అనసూయ

అట్లు భర్త మనోధర్మమున కంతరాయమును గలిగింపక సమయమునరసి ప్రవర్తించు పడఁతియే పరమసాధ్వీమణి. అట్టి యోషిన్మణికి లభ్యములుకాని యర్థంబులుండవు. ఆ మహిళామణికిఁ బంచభూతములును బరబ్రహ్మయుఁ గూడఁ గాందిశీకు లగుదురు. నీకిట్టి విజ్ఞానరత్నమును మాళ్యాలంకారముగ ధరించుటయే నాయభిమతము. నేను బ్రహ్మచేసృష్టింపఁ బడినది జగత్సృష్టికిఁ గాని యూరక తపోభిరతిచేఁ గాలము గడుపుటకుఁ గాదు. తద్విషయమున సర్వవిధముల నీవు నాకు సహకారిణివి కావలయును. భార్యా భర్తల యొక్క హృదయములు పవిత్రములై ధర్మమయంబులు కాకున్న దుష్ట సంతానము కలుగును. అట్టి దుష్టసంతానముం గాంచిన వధూవరుల హృదయకుహరంబుల నిరంతరమును విచారాగ్ని రగులుచుండునందువలనఁ బితరులు జీవన్మృతులుగఁబరిగణింపఁ బడుదురు. తత్సంతతియు నిస్సారక్షేత్రంబున నంకురించిన వనస్పతి వెఱ్ఱి మొఱ్ఱి యాకుల విడచి క్షీణించునట్లు చిరకాలమున నాశనముఁ జెందును. కావునఁ బ్రథమమున మన మిరువురమునుపరిశుద్ధాంతఃకరణములుగలవారముకావలయును. నే నిప్పుడట్టి యాన్నత్యస్థితి నందుటకై ప్రయత్నించుచుంటిని. మనమిరువురమును వికార గుణవిదూరులమైయుంట ముఖ్యావసరము.

చ. జనకుఁడుఁదల్లియున్‌సుగుణ ♦ సంపద సంతత ధర్మవర్తనం
బునఁ గరుణాంతరంగులయి ♦ పొల్చినగాని తదీయపుత్రసత్

ఘనతరసద్యశోమహిమఁ ♦ గాంతురె పుణ్యపదంబుసూతు రే
వనితరో! తాదృశాఘములబాధలగాంచి సహింపనేర్తు మే.

కావున మన మనోవిగ్రహములకు సత్కారుణారసముచే నార్ద్రీభూతములుగఁ జేయఁబడిన ధర్మకవచములఁ దొడిగికొని ప్రవర్తింపవలయును.

జీవితేశ్వరా! నా యభీష్టము నదియే.

తే. గీ. ధర్మతత్త్వరుఁడైన పు ♦ త్రకుఁడొకండు
చాలఁడా! వేయిమంది నృ ♦ శంసులేల
ననుపమమరీచులీను స ♦ న్మణియొకండు
కలుగ గ్రుడ్డివి గులకరా ♦ ల్గంపెఁడేల.

అందుచే మిమ్ముల నిప్పుడాయంశమును గూర్చి తెలిసికొనుటకై వచ్చితి. మీరే తద్విషయమై నాకు బ్రబోధించుటచే సర్వజ్ఞులైన మీరు నాయభిమతమును దెలిసికొని సంశయనివృత్తి జేసినారు.

"దేవీ! మన యాత్మలు వినిర్మలములై మనకు స్వాధీనములైనచోఁ బరభావములఁ దెలిసికొనుట గడు సులభము. అందులకుఁ గారణమేమో యెఱుంగుదువా?" "నాథా! సకలోపాధులయం దున్న ఆత్మలును పరమేశ్వరుని కళాలేశములే యగుటచే నవ్వానిని స్వాధీన పఱచుకొనిన వారలకు సర్వమును వేద్యమని తొల్లి మీరే యొకనాఁడు చెప్పియున్నారు."

ఔనదియే దివ్యజ్ఞానమని యందురు. వినినయంశమును మఱువక స్మృతియం దుంచికొనినవారు స్త్రీపురుషులు.

గురుశిష్యులు నభివృద్ధిని జెందినట్లై నీవును నీయభీప్సితములం బడయం గలవు.

ప్రాణేశ్వరా! నాసహోదరిఅదితి కశ్యపునను గ్రహంబునం నద్భుత తేజోరూపుండగు నాదిత్యుని (సూర్యుని) బ్రసవించినది. ఆతనికి దిననాథత్వ మొసంగి నారు. ఆయమ్మ పుణ్యమేమందును? అని అనసూయ పలికెను. అత్రియు జీవితేశ్వరీ! ఆమె కట్టి పద్మబాంధవుండును త్రిమూర్త్యాత్మకుండు నగు సుపుత్రుం డుదయించినాండని యసూయ కలిగినదానవై తివా? నీకు లేదని విచారించుచుంటివా? అనెను నాకట్టియసూయ లేదు. తమ యనుగ్రహముకలిగిన నాకుమాత్ర మట్టి పుత్రరత్న మేల యుదయింపండని ధైర్య మవలంబించియే యున్నదానను.

అట్లయిన నీవు తప్పక అనసూయవే. పరుల యుచ్ఛస్థితినిగాంచి సంతోషించుటయే ఆత్మానందము. అట్లుకాక అసూయ వహించినవారి నకారణదుఃఖము లావరించును. కాంచిన నట్టి సుపుత్రునే కాంచవలయును.

మ. అలరుందీవకుం దావి బాలురకు వి ♦ ద్యాసక్తి కాంతామత
ల్లులకున్ సత్సుతవై భవంబును దపో♦లోలత్వ మస్మాదృశా
వళికిన్ బోధనశక్తి గుర్వులకు సం♦ప్రాప్తంబుగాకున్న నిష్ఫల
ముల్ కావె తదీయజన్మములు భ♦ స్మక్షిప్తహోమక్రియన్.

కావున నీయక్కకు దిననాథుం డుదయించినట్లే నీకును శర్వరీ నాథుం డుదయింపం గలండు. నీవిఁకం బ్రశాంత చిత్తవై

యుండుము. కాని యీ సత్పుత్రుండు నీ గర్భసంజనితుఁడు కాఁడే దని నీవు సంశయింపకుము. ప్రాణేశ్వరునానతి కెన్నఁడును వ్యతిరేకింపను. మీరు నా దక్షిణభాగశరీరులుకారా? ఇష్టుఁ డనుగ్రహించిన వరము నచిరకాలమునఁ జెల్లింపఁగలందులకుఁ బ్రార్థించుచున్నదాన నని అనసూయ పలికెను.

అట్టిసమయమున భగవన్నిర్ణయమునం జేసి కాముండు ప్రసవాశుగంబుల నత్రిమహర్షిపైఁ బుంఖానుపుంఖములుగఁ బఱగించెను. అత్రిమహర్షి శరీరమున బులకలు తలచూపెను. విరహమగ్గలమయ్యె. అందుల కనుగుణముగ ననసూయ సమక్షముననే యున్నది. కాని యీజితేంద్రియుఁడామె కరకమలమును గ్రహించుట కిచ్ఛగింపలేదు. ఎట్లైన నయోనిసంభవునిగాంచు తలంపు గలిగియుండుటచే మిక్కిలి మనోద్రఢిమగలవాఁడై యీసాధ్విని స్పృశింపలేదు. కొయ్యబొమ్మవలె తలంచెను. కాని కాముఁ డూరుకొనలేదు. తన సమ్మోహనాస్త్రమును బ్రయోగించెను. అత్రి శరీరమంతయుఁ విరహాగ్నిచేఁ దపించుచుండెను. మేధస్సులోనున్న తేజస్సురసికి ఉప్పెన ప్రారంభమయ్యెను.

అట్టి దుర్భరసమయంబునను భార్యను తలంపఁడయ్యెను. ఆసమయమునఁ బాలసంద్రముపై దుర్వార కామోద్దీపనము గల తన దృష్టిప్రసారమును బఱగించెను. ఆ యత్రిమహర్షి యొక్క దృష్టిప్రసారము,

మ. తొలుతన్ దెల్లనిమల్లెమొగ్గ యట్లు, తో
డ్తో వెన్నముద్దంతయై,

కళలన్ మించు హిమాద్రి సామ్యమయి, యా
కాశస్థలిన్నిండు ని
శ్చల విద్యున్మయ గోళమై, నిఖిల ది
క్చక్రంబు లన్నిండి, శీ
తలకాంతు ల్విలసిల్లఁ బొల్కడలి భ
ద్రం బొప్పఁగా వ్రాలెడున్.

ఆ శీతలమైన యత్రి నిరీక్షణ తేజంబును దశదిగంగనామణులును తమ గర్భంబునం గొంతసేపు ధరించి యెట్టకేలకు భరింపలేక వసుంధరపై విసర్జించిరి.

అప్పుడు ధరాస్థలంబునంగల్గు మహీరుహలతాబీజంబు లంకురించి తమకు నేటికి రక్షకుఁ డుదయించినాఁడని హర్షోత్కర్షంబుఁ దెలుపుచున్నవో యనునట్లు ప్రసవవర్షముఁలఁ గురిసెను.

ఆ తేజస్సముత్పన్నుఁడే సోముఁడు. అనగాఁ జంద్రుఁడు. ఈ సమయమున మన మొక నీతిని నేర్చుకొన వలసియున్న దదేదియన?

చం. విరహాభవానలంబునఁ ద
పించెడు నత్రిమహర్షి యర్ధదే
హరమణి చెంతనుండినను
హాత్మ నయోనిభవున్గుమారుఁగాఁ
చ రహినిజూడఁడయ్యె నిజ
సాధ్విని వాని కదెంతశాంతమో

వరమును లెన్నఁడున్ వ్రతవి
భంగమునై పరుకావె యుక్తిలోన్.

ఆ సమయమున నత్రిని విరహావస్థలు తపింపఁజేయు చుండ నర్థాంగియైన అనసూయాదేవి లావణ్యా మరీచికలు మేము ప్రశాంతిఁజేసెదమని మనంబున కుటివోసి వెనుకకు లాగుచుండ సత్సంతానవ్రతదీక్ష జగదుపకారియైనకుమారునిఁ బడయుట యుత్తమమని ముందునకు నాకర్షించుచుండ నట్టి సమయంబున భార్యపై సుంతయు మోహమునుజూపని నిర్వికారుఁడత్రిమహర్షి సమస్త జగంబులకు నాదర్శమై యనంత ధర్మములఁ జూపించుఁగాక!

మఱియు నొక్కవిశేష మిచ్చటనే నుడువవలసియున్నది. జగంబుల శరీరధారులు కొందఱూర్ధ్వ తేజస్కులును, గొంద ఱధో తేజస్కులునై యుందురు. కామోద్రేకము కలిగినప్పు డూర్ధ్వ తేజస్కుల తేజము నయనములనావరించి దృష్టిప్రసార మార్గంబున బహిర్గతమగుచుండును. వారు పంచత్వము నందు నప్పుడు వారి ప్రాణవాయువులు కపాలమును భేదించుకొనియో, కన్నులనుండియో, పోవుచుండును. సాధారణముగఁ దపోధనులలో నూర్ధ్వ తేజస్కులు తఱచుగ నుందురు. అత్రి మహర్షి చంద్రుని యావిర్భావమున కానందించుచుండ నచ్చటికి బ్రహ్మర్షి గణంబులతో బ్రహ్మ యరుదెంచి యా సోముని స్తుతించి యాతనికి శర్వరీపతిత్వ మొసంగి తన రథమున గూరుచుండఁ బెట్టుకొని కొంపోయెను.

అత్రియుఁ గశ్యపుఁడు దిననాథునిఁగాంచినట్లు తాను నిశానాథుని గనినందులకు నానందించుచున్నను మహాత్ముండును లోకరక్షణ పరాయణుండగుటచేతను స్వజనంబు వలన గలిగిన యానంద మొక యానందముకాదనియుఁ దాననుభవించి కాంచిన సంతుష్టి యొక సంతుష్టికాదనియుఁ బరులకు నామోదముగూర్చి తానందువలన నానందించుటయే యానందమనియుఁ బరులకు సంతుష్టిజేసి తాను సంతుష్టినందుటయె సంతుష్టియనియుఁ దలపోసి అట్టి సమయమున ధర్మ సంస్థాపనమునఁ బరమేష్ఠిచేఁ బ్రతిష్ఠింపఁబడిన మహేంద్రాదులు దైత్యుల వలనఁ బీడింపఁబడుటఁగాంచి ధర్మరక్షణ పరాయణుఁడై దానవకార్యమును నిర్మూలముఁజేయఁగల త్రిమూర్త్యంశ కలితునొక్క కుమారవర్యుఁగాంచు తలంపున హరిహరబ్రహ్మల నాధ్యాత్మిక శక్తిచేఁ దలంచుచు నొకమంత్రము ననసూయాదేవి కుపదేశించి తపంబుఁజేయుమని యాజ్ఞాపించెను. అనసూయయు భర్త్రాజ్ఞచే నట్లు జపించి కొలఁదిదినములకు శుభముహూర్తమున మహేశ్వర సంకల్ప జనితమైన యండంబునుండి త్రిమూర్తు లుదయించినట్లు తన గర్భంబునుండి మూఁడు మొగంబులు కలిగిన యొక బాలకుని బ్రసవించెను. ఆ కుమారుఁడే దత్తాత్రేయుండను మహానుభావుఁడు. అనంతరమున నాదత్తాత్రేయుఁడు రాక్షస సంహారమును తన యోగబలంబునం గావించి తండ్రికిని, దివ్యులకునుమనఃప్రియంబుఁ గలిగించెను.

అనంతరమున నత్రిమహర్షికి నంగుండను ప్రజాపతియు సర్వసద్గుణసంపన్నయగు విశ్వావర యను తనయయు ననేకు లైన మహానుభావులు నుదయించిరి.

ఇట్లు ప్రజాసృష్టి వ్యాసంగమునను లోకరక్షణపరత్వ మునను న్నను శశభక్షణబుద్ధికలిగిన జంబుకము శశాంకుని జూచి యరచుచు ద్వేషించినట్లు అత్రిమహర్షి యెడల నా కాల మునను న్న హైహాయవంశజులైన నరపాలకులు మత్సరగ్రస్తులై యామహాత్ముని వంచింపఁ బ్రయత్నించుచుండిరి.

గీ. పరులయాన్నత్యదశకు నో ♦ ర్వని చెనఁటులు
తమకు నోరు లపకృతి సేయఁ ♦ దలఁపకున్న
నెట్టిటో వారి హింసింప ♦ నెంచుచుంద్రు
దుష్టులకు ధార్మికపు వృత్తి ♦ దూరముకద!

ఇట్లుండ నొకనాఁడనసూయ గర్భమందున దుర్వార తాపముచే బాధపడుచుండ నత్రిమహర్షి దివ్యజ్ఞానసంపన్నుఁడగు టచే నామె జఠరప్రదేశమును నిరీక్షించెను.

అనసూయ గర్భకుహరంబున నీశ్వర తేజంబు బ్రవేశించి యానాటి కేడుదినంబు లైనది. దానిని విధ్వంసముం జేయు తలంపున హైహాయుండొక శస్త్రమును బ్రయోగింప నాశరముతో గర్భస్థపిండము పోరుచున్నట్లు స్పష్టపడియె. అట్టి యుపద్రవమునుగాంచి యద్భుత ప్రభావముగల యత్రి రుద్రానువాకములఁ బఠించుచు నాపిండమునకు శత్రు

మారణ శక్తిని గలిగించెను. అందువలన నాపిండము శాత్రవ ప్రయుక్తాస్త్రమును విధ్వంసము గావించి గర్భమునుండి యాక్షణముననే వెలువడివచ్చి ప్రళయకాల రుద్రుని భంగిఁ గ్రోధనిరీక్షణముల నింగలములఁ బ్రసరింపఁజేసి యాహైహాయ సంహారముంగావించెను. అత్రిమహర్షియు బాలసుధాకరమౌళి తనకుఁ గుమారుఁడై యుదయించి నందుల కానందించుచు నా బాలునకు దూర్వాసుఁడని నామకరణముం గావించెను.

నిరంతర పవిత్రమార్గ సంచారుల యమోఘ తేజంబులఁ జల్లార్ప వర్షములు లేవు. సత్పురుషుల యశశ్చంద్రికల మాయింపఁ దమఃపటలంబులు లేవు. దుష్ప్రవర్తకు లెట్లు క్రౌర్యమును బ్రయోగించినను మహానుభావుఁడైన యత్రి మహర్షి యమిత ప్రభావ మచ్యుతమై యఖిలలోక స్తుత్యమై పరంజ్యోతివలె స్వయంప్రకాశమై స్మరణమాత్రంబునఁ బాప బంధ పటలంబుల బటాపంచలు సేయుచు సర్వదా వెలుఁగుచునే యున్నది.

ఇట్లుండ నొకనాటి రేయి దీర్ఘతమంబై యత్రిమహర్షికి విసుగు జెందించె. ఎంతకును దెల్లవారదయ్యెనని దివ్యదృష్టితోఁ జూడ నొక పతివ్రతా శాపకారణంబునంజేసి యహర్పతి యుదయింపకుండెనని తెలిసికొని ఈ దీర్ఘతమంబైన శర్వరి యెన్నిదినంబులుండునో అంతవఱకు దివాభాగకాలమును నిర్ణయింపలేకున్న నిత్యకర్మలకు భంగమగునని తలంచి స్వరము ననుసరించి కాలపరిమితిని దెలిసికొనుచు సంధ్యాది కృత్యముల నెరవేర్చికొనుచుండెను.

ఇట్లు పేడు దినంబులు కడచినవి. సూర్యోదయము కాలేదు. జగమంతయు వ్యాకుల పడుచున్నది. బ్రహ్మాది దేవత లందఱు నత్ర్యాశ్రమమున కరుదెంచి యత్రిని ప్రార్థించి నీ భార్య అనుగ్రహించిన సూర్యోదయ మగునని చెప్పి యనసూయాదేవిని గొనిపోయిరి.

ఆనాఁ డనసూయ మహిమవలన మఱల సూర్యుఁ డుదయించెను. ఇట్టి విపరీతము లుత్పన్నము లైనప్పుడు గ్రహ సంచారములు దృశ్యములుకానిసమయమున స్వరకాల నిర్ణయ మావశ్యకమని తలంచి కర్మలకు భంగము కలుగ కుండ నాఁడు మొదలు స్వరశాస్త్రము ముఖ్యముగ గణింపఁ బడుచున్నది. ఇప్పటికిని నా శాస్త్రపరిచయముం గలవారు ఏనాటి యుదయమున నేస్వరము ప్రవర్తిల్లుచుండునో ఏనాఁడి కెన్ని గడియల పరిమితికాలమో తెలిసి వేళఁబ్రొద్దును నిర్ణ యించువార నేకులు కలరు.

అచ్చట ననసూయాదేవి మాహాత్మ్యము వలన నా నాఁడే సూర్యోదయ మయ్యెను. జగత్సంక్షోభముడిగెను. అత్రిమహర్షి భార్య పాతివ్రత్య ప్రభావ మనవద్యమని యెల్లరును సంస్తుతించిరి. ఇట్లుండ ద్వాదశవర్ష క్షామ మారంభమయ్యెను. వసుంధరపై తరుగుల్మలతావృక్షము లన్నియు నశించిపోయి నవి. ఆశ్రమవాసులంద అన్నపానములు లేక సంక్షోభింపఁ దొడంగి యత్రిమహర్షి పాదంబులంబడి మహాత్మా! రక్షింపు మని ప్రార్థించిరి. అప్పు డత్రి దీర్ఘాలోచనముం గావించెను.

అన్నపానాతురులై తన్ను శరణంబు వేడినవారిని రక్షింపకుండుట మహాదోషము. వారి నాదరించుట కేదియు నాధారము లభింప దయ్యె. ఏమి సేయుటకును దోఁచక హా యీశ్వరా! ఈయన్నాతురుల రక్షింపని నాజన్మ మేల? యని పొక్కుచుఁ గన్నులనుండి యశ్రుకణముల రాల్చుచుండెను.

అట్టి విచార సమయమున ననసూయవచ్చి యాయత్రి కన్నీళ్లను తన యంజలిచే గ్రహించి యొక్క ఖాతమును ద్రవ్వించి యాయంజలి జలంబుల నందక్షయంబగునట్లు తలంచి విడువ నానీరంబక్షయమయ్యె. ఆ యమృతోపమ జలంబులచే నాక్షుత్పిపాసాతురుల యారాటమును మాన్పెను. వారును దమ ప్రాణములు నిలిచెనని సంతసించిరి.

అనంతరమున నత్రిమహర్షి క్షుధార్తుల కన్నంబుఁ గల్పింపఁ బ్రయత్నించి పరమేశ్వరుని మనంబున ధ్యానించి యనసూయను బిలిచి భద్రా! ఈ యార్తుల కిప్పట్టున నా శరీర మాంసమునైనఁ గోసియిచ్చి వీరియాఁకలిఁ దీర్పవలయునన్న కుతూహలము నాకుఁ గలిగియున్నది. నాయాత్మ కేదియో సుంత సంతుష్టి భగవత్కృపవలనఁ గలిగినది. ఇప్పుడు నీవడవి కేగి జలాధారము లేక క్షీణించి నశించిన వనస్పతులుండు ప్రదేశముల నెఱిఁగియుంటివి కావునఁ దత్తత్ప్రదేశముల నీవొక కొయ్యతో ద్రవ్వుము. నీకప్పుడు దుంపలు వలసినన్ని లభింపఁగలవు. వాటిని బచనముచేసి యాయార్తులకుఁ బెట్టి వారి క్షుధమాన్పుమని యాజ్ఞయిచ్చి నీవును మూలము లందు

జిక్కనను త్రికరణశుద్ధియైన మనంబుతోఁ ద్రవ్యమని చెప్పి యంపించెను.

అనసూయయు మహాప్రసాదమని భర్తయాజ్ఞను శిరసావహించి యల్లే పసముండెడు ప్రదేశమున కేఁగి యాయా ప్రదేశములఁ ద్రవ్య నందామెకు వలసినన్ని దుంపలు లభించెను. మహానందముతో నామె వాటిని దెచ్చి భర్తకుఁ జూపి పచనముచేసిపెట్టి యా క్షుధాతురుల యాఁకలినిగూడ బోఁక డచెను. అప్పుడు మునులందఱును అత్రిమహర్షి సృష్టికర్తయు ననుకంపాయుక్తుఁడు లోకరక్షణ బిరుదాంకితుఁడునని వేనోళ్ళ సంస్తుతించిరి.

"ఆత్మవ త్సర్వభూతాని" యను సూక్తి యత్రి మహర్షిచే సార్థకముగఁ జేయఁబడినదని దివ్యులును సంతోషించి యత్ర్యనసూయల దయారసమును మాహాత్మ్యమును సంస్తుతించిరి.

ఈ కరణి వర్షము కుఱిసి క్షామము వదలి యవనియందన్నముద్భవించు వఱకు నత్రిమహర్షి యాత్మతపంబున నన్నపానంబులఁ గల్పించి యనసూయచేత మునికోటులను బోషించుచునే యుండెను.

ఈ యన్నపానంబులఁ గల్పించిన శక్తి యనసూయదని కొందఱు నుడువుటకుఁ గారణము: భర్త్రాజ్ఞ ననుసరించి చేయుటచేత నామెయే కల్పించినదనుటకు హేతువేర్పడినది. అంతియేకాని, ఈ ప్రభావమంతయుఁ బ్రజాపతియైన అత్రి

మహర్షి దనవలయునే కాని యన్యముకాదు. ఎవరెట్లువ్రాసినను అత్రియందీశ్వరశక్తియు ననసూయ యందు ప్రకృతికళయు నుండుటచేతను, ఈశ్వరుండు ప్రకృతిసహాయముననే సర్వసృష్టిని నెరవేర్చుచుండుటచేతను ఎవరుచేసినను తత్ఫల మిరువురును జెందుటకు సంశయ మావంతయు లేదు.

ఆ. ఆమహేశులీల ♦ యాత్మరూపై యుండంగ
నాత్మశక్తిగలుగు ♦ నట్టివారు
బ్రహ్మవోలె సర్వ ♦ వస్తు సంచయమును
సృష్టిసేయుటరుదె ♦ క్షితితలమున.

తరువాతఁ గొన్ని దినంబులకు వర్షించి వసుంధర యన్నంబును కనుచుండుటచే క్షామము నివారింపఁబడినది.

అది మొదలత్రిమహర్షి యాపన్నివారణకర్తయనియు నిజతపోమహిమంబునఁ బంచభూతములనైన సృజింపఁగల డనియుఁ బ్రఖ్యాతి వడసెను. ఇట్లుండఁ గొన్ని దినంబులకు భరింపరాని యెండలు కాచుటచే బ్రజావర్గమంతయు సంక్షోభించి యత్రి నాశ్రయింప నామహాత్ముఁడనసూయ కాజ్ఞ నొసంగ నామె తనపాతివ్రత్యప్రభావంబునంజేసి ఏడుదినంబులు సూర్యుఁడుదయింపకున్నట్లు చేసి పతికి మనశ్శాంతిని బ్రజకు సంతాపశాంతిని గలుగఁజేసెను. వరపతివ్రతలు పతియాజ్ఞ లేకుండఁ దా మెట్టికార్యముల నొనరించుటకును బూనుకొనరు. అట్టి సాధ్వులెట్టి యుత్కృష్టములైన కార్యములొనరించినను భర్త మనశ్శక్తి నొసంగుట ప్రధానమగుటచేఁ దత్కీర్తి పతి

యనుగ్రహము నంబడంతులకుఁ గలిగినదనియే ప్రజలూహింపఁ దగియుండును.

ఇట్లుండ మఱికొన్ని వాసరంబుల కత్రిమహర్షి సన్నిధికి ముగ్గురు బ్రాహ్మణు లరుదెంచి వందనముఁ జేసిరి. అత్రియు నామహాత్ముల నతిథిసత్కారము జేసి యీపూట మాయాశ్రమమున భుజించుఁడని చెప్పి భార్యను బిలిచి వీరికి వలసినట్లు భోజనము బెట్టుము. నేను నదీతీరమునకుఁ బోయి యపరాహ్ణమునకు వచ్చెదనని చెప్పి తాను నదీతీరమున కరిగి యనుష్ఠానముల నిర్వర్తించుకొని కతిపయకాలమున కరుదెంచెను.

అనసూయయు నాశ్రమమున ముగ్గురబాలుర కన్నము దినిపించుచుండఁ జూచి భద్రా! ఆ బ్రాహ్మణుల భోజన మైనదా? యీ బాలు రెవ్వరని యత్రిమహర్షి యడిగెను.

అనసూయయుఁ బ్రాణేశ్వరా! ఆ విప్రులే యీ బాలురు. కారణాంతరమున మన యొడిలోని శిశువులైనారు. వీరికి బువ్వము పెట్టుచున్నానని ప్రత్యుత్తర మొసంగెను.

అత్రి యా మాటలయర్థమును విస్పష్టముగఁ దెలిసికొనఁగోరి వేరే సంభాషణము జేయక తన దివ్యదృష్టితోఁ బరికించి వారిని త్రిమూర్తులఁగాఁ దెలిసికొని,

మ. తరుణీ! యెంతటి భాగ్యశాలినివి
శస్తంబయ్యె నీ హస్త పం
కరుహం బీ త్రిగుణాత్ములర్భకుల
కౌత్కంఠ్యంబు సంధిల్ల నో

గిరమున్ గుజ్జుగఁజేసి పెట్టుటను నీ
కీర్తి ప్రజంబుల్ రమా
గిరిజావాణులు వేఁడి వాల్చెదరు
భక్తి స్నిగ్ధ గుణంబడఁగన్.

అని పలికి యత్రి నిజభోజనానంతరమున నా ముగ్గుర బాలకుల నెత్తుకొని నాకెంతటి భాగ్యమబ్బెనని యానందించుచు నాడించుచు వారి బాల లీలకు మురిసియుండెను.

అంతఁ గొన్ని దినంబులకు రమాగిరిజావాణు లరుదెంచి యనసూయను దర్శించి అత్తా! అనసూయాదేవీ!

ఆ. పరులఁ దరచునట్టి ♦ భావంబు గలవారు
తామె పరిభవమునఁ ♦ దగులుకొనుట
నిక్కమనెడు మాట ♦ నేఁడె సార్థకమయ్యె
బెట్టుమమ్మ భర్తృ ♦ భిక్షమాకు.

అని కొంగులు సాచి వేడికొన నత్రిమహర్షి యాజ్ఞ చే నా బాలుర యథాప్రకారము యువకులఁజేసి యొసంగి వారి ననిపివైచెను.

కావున ననసామాన్యుఁడును ప్రతిభాశాలియునైన యత్రిమహర్షి త్రిమూర్తులను గెంచిన మహానుభావుఁడు. అట్టివాఁడు నిరంతర దివ్యమునిగణసంస్తూయమానచరితుఁడై తన కుమారుఁడైన చంద్రుండొనరించు యజ్ఞమునకేగి యా యధ్వరమునకు బ్రహ్మర్షుల రావించి వారి యనుమతిని నాతని జన్నమును బరిసమాప్తిఁ జేయించెను.

అనంతరమున నొకనాఁడు తన మామయైన దక్షుండు శివబాహ్యముగ జన్నము సేయందలంప నాతని చెంతకేఁగి కూఁతునిచ్చిన పూజ్యుఁడని పక్షపాతము నెంచక శివుండే యజ్ఞ పురుషుఁడనియు శివశూన్యమైన యజ్ఞంబు వ్యాధకర్మంబనియు నందువలన మోక్షప్రాప్తి లేకపోవుటయేకాక మహాదోషంబు సంభవించి యస్తంగత తేజునిగఁ జేయుననియు ననేక విధంబుల సద్బోధన మొనరించెను. అప్పుడు దధీచిప్రభృతులు అత్రిమహర్షి వంటి నిష్పక్షపాతియు నంతటి ధర్మచింత కలవాఁడును లేఁడని స్తుతించిరి. కానియాతని నీతిసారమంతయునూషర క్షేత్రమున వెదజల్లిన బీజములవలె నిస్సారమై వ్యర్థమయ్యెను. అనంతరమున శివబాహ్యయజ్ఞముం జేయుటచే శివపుత్త్రుఁడైన వీరభద్రునిచే దక్షుం డుత్తమాంగమును గోలుపోయినప్పుడు శివునిఁ బ్రార్థించి మఱల దక్షునకుఁ బ్రాణదానం బొసంగఁ జేసెను. పిమ్మట సప్తర్షులఁ దోడ్కొని హిమవంతుని కడకేఁగి పార్వతిని శివునకొసంగి పరిణయము సేయుమని బోధించి శంకరుని వివాహితునిగా జేసెను.

అనంతరమున నొకనాఁడు గౌతముండు గంగావతరణమును జేసి నిజకిల్బిషమును వాపికొనఁ దన యాశ్రమమునకు గంగాదేవిని దెచ్చు చున్నాఁడని విని, బ్రహ్మగిరి కరుదెంచి గౌతమానీతయైన గంగయం దొక శాఖను సప్తర్షులతోఁ బాటు తీసికొనిపోయి సముద్రమున సంగమింపఁ జేసి యా సాగర సంగమ స్థానమునఁ గొంతకాల మత్రిమహర్షి భార్యతో వసించి సమస్త

లోకములకు ధర్మములను బోధించు సంహిత నొకదానిని సూత్రరూపముగ రచించి, తనశిష్యులచేఁ జదివించి, జగంబున బ్రచురము జేయించెను. ఆసంహిత నాఁడు మొదలు నేటి వఱకును విద్వాంసులయొక్కయు, ధర్మశాస్త్రపారంగతులయొక్కయురస నాగ్రముల నాట్యమాడుచుఁ బ్రజల ననాచారవిముఖులఁగాఁ జేసి ధర్మమును బోధించుచుండెను.

ఇట్లు సర్వజన ధర్మబోధనా వ్యాపారము నవలంబించి సమస్తతీర్థపుణ్యక్షేత్రంబుల సంచరించుచుఁ దన సూత్ర ధర్మముల నందందుగల మునికుమారులకు బోధించుచుఁ గ్రమ క్రమమున శ్రీమన్నారాయణుండు దశరథ మహీపాలున కుదయింపఁ గలఁడని విని తా నయోధ్యకుఁ గొంతసమీపమున నాశ్రమము నేర్పఱచుకొని యందు వసించుచు గంగాతీరమున దపోవ్యాజంబున బ్రొద్దుపుచ్చుచుండెను.

ఇట్లుండ నొకనాటి సాయంకాలమున శ్రీరాముండు లక్ష్మణునితోడను, జానకితోడనురాగా, నత్రిమహర్షి శ్రీరాము నితో వత్సా! రామభద్ర! నిను నీవెఱుంగవుకాని, నిన్ను నే నెఱుంగుదును. నీవెంతటి సర్వజ్ఞుఁడవైనను క్షత్రియాన్వయ సంభూతుండ వగుటచే మా యొనరించిన ధర్మసూత్రముల ననుగమించి మహీపాలనంబు నొనరింప నర్హుఁడవు. గనుక నీ కించుక బోధించుట సర్వలోకశ్రేయమును గోరు మా బోంట్ల కుచిత ధర్మము. కావున శ్రద్ధాన్వితుఁడవై వినుము. నభంబునందు ప్రతిహత తేజంబుతో భాసిల్లు మార్తాండ

మండల మొక్కొకసారి కాలమేఘచ్ఛన్నమై కాంతిని బాయుటయు దుస్సహుండైన వహ్నిదేవుఁడు పాంసుపటలావృతుండై కుంఠిత తేజుండగుటయు సహజము. అయ్యవి కాల వైపరీత్యమునంజేసి కలుగుచుండును. నిరంతర స్వారాజ్యసౌఖ్యంబుల దులదూగుబృందారకేంద్రుండు మందరకందరంబుల మందుఁడై పడియుండుట తటస్థించును. ప్రాజ్ఞులైనవారు సౌఖ్యముల నెట్లామోదంబున ననుభవించెదరో అట్లే కష్టములను గూడ మహాభాగ్యమని చేతులసాచి యందుకొని యనుభవించెదరు. పూలకావడిమోయు కూలివాఁడు రాళ్ళకావడిబరువునుగూడఁ గూలికాసించి మోయును. శరీరధారులమైన మనము సుఖము ననుభవించి కష్టము ననుభవింపమని వలదనరాదు. అహములు కడచినవెంటనే రాత్రులరుదెంచుట సహజము. కావున నిఖిలధారుణీసామ్రాజ్యలక్ష్మిని వహింపంగల నీవు ఘోరకాంతారసంచారమునకుఁ బాల్పడుట మాబోఁటి సంయముల ధర్మము లంతరాయముల హరింపకుండ రక్షించుటకని తలంపుము. సాధుచిత్తములకు శాంతి యెప్పుడు కలుగునో అప్పుడే పర్జన్యుండు వర్షించును. దానంజేసి ధరణి సంపూర్ణ ఫలప్రదానంబు సేయును. అద్దానివలన దేశము సుభిక్షముగ నుండు నందువలన రాజు సద్యశోవంతుఁడనం బఱగును. మఱియు నీవిధంబుగ జరుగుటకును జరుపుటకును మనము కర్తలము కాము. ఆయాకార్యంబు లేవిధానమున జరుగ వలయునని బ్రహ్మనిర్ణయ ముండెనో మన బుద్ధులును మనకు సంబంధించిన వారి బుద్ధులును నట్లు పరిణ

మించును. అందువలన నజ్ఞానులైన వారు వారట్లు చేసిరనియు, వీరట్లు చేసిరనియు, నితరులపై దోషారోపణము సేయుచుందురు. అది కేవలము మౌఢ్యము. ప్రస్తుతమున నరణ్యారాజ్యము నీచేఁ బరిపాలింపఁబడవలసియున్నది. ఇయ్యది మహాభారమగుటచే నోరు లీ దుర్భరకార్యము నాచరింపఁజాలరని కైకవ్యాజమున భగవంతుండు నిన్నీకార్యమునకు నియోగించినాఁడు. సర్వలోకానంద కరుఁడైన చంద్రుఁడును నొక్కొక్కమారొకనిచేత నిందకుఁ బాల్పడవలసివచ్చును. అంతమాత్రమున నింద్యుఁడుకాఁజాలడు. అయిననీవుతథావిధముగాక నీయఱచేతి సామ్రాజ్యమును గైకొనిన సవతితల్లియైన కైకమాంబపై మిపులభక్తితో స్వార్థత్యాగివై నీపరిశుభ్రగుణమణుల బ్రకాశింపఁజేసి రాజ్యభారముఁ దమ్మునక ర్పించివచ్చితివి. నీగుణంబులు శ్లాఘాపాత్రంబులు. సర్వజగద్రక్షణములు. రామా! నీవిది మొదలీయరణ్యంబున బహుభద్రముగాఁ బ్రవర్తింపవలయును. ఈ కాంతారమంతయుఁ గ్రూరరాక్షసపరిచారమైనది. అందును జానకితోఁగూడ నరుదెంచితివి. ఈ రాత్రి నాయాశ్రమంబున భుజించి శయనించి రేపకడ నరుగవచ్చునని చెప్పి, యారాత్రి తన యాశ్రమమున రామాదులనిలిపివైచెను. అనసూయయు జానకి కెన్నియో పతివ్రతాధర్మముల నెఱింగించి వారలకు వన్యఫలంబుల భుజింపఁబెట్టె. తెల్లవారఁగనే యత్రిమహర్షి శ్రీరామాదులఁ గొంతదూరము సాగనంపి వచ్చెను.

పిమ్మట నాశ్రమమునుండి రామునకు రాఁబోవు భవిష్యదాపన్నివహంబులం దలంచి యెఱింగినవాఁడై యవన్నియు

దైవప్రేరణము లనియు, వారింపరానివనియు, నాత్మనెఱింగి యుపేక్ష జేసి తాను తపోదీక్షలో నుండెను.

అప్పుడయోధ్యాపురమున భరతుఁడు శ్రీరామపాదుక లను సింహాసనమున నునిచి నందిగ్రామమునఁ దాను నివసించి హృదయకమలమున శ్రీరామచంద్రుని నిక్షేపించి నిరంతర భ్రాతృభక్తి పరాయణుండై రాజ్యపరిపాలనము గావించు చుండెను. కాని భరతుఁ డతిశ్రద్ధగాఁ బరిపాలనంబొనరింప కుండుటచే, నందంద దౌర్జన్యములు విస్తరిల్ల నారంభించెను. భరతుండు తద్వృత్తాంతముల వినియు రామపదపద్మభక్తి తత్పరుండై ప్రజాక్షేమములను బరిశీలించి దండ్యుల దండిం చుట లేదు.

ఇట్లుండ నొకనాఁడత్రిమహర్షి తపోనిరతుఁడై యున్న సమయమున నొక విప్రవటు వరుదెంచి యత్రిమున్యనుష్ఠా నానంతరము వఱకును వేచియుండెను. అత్రియుఁ గన్నుల దెఱచి కృత్యమును సాంతముగ నిర్వర్తించుకొనఁగనే యా భూసురబాలకుండు మహాత్మా! నమస్కారమని ప్రణుతి గావించి బ[illegible]ను. అత్రియు వాని జూచి ఓయీ! నీ వెవ్వండ వెందులకై నా సన్నిధి కరుదెంచితివని ప్రశ్నించెను.

మహాత్మా! నేను చ్యవనవంశ[illegible]లోని వాఁడను. మీ సన్నిధిని విద్యాభ్యాసముం జేయఁదలఁచి వచ్చితి. నన్నను

గ్రహించి కృతార్థునిఁ జేయ వేఁడుచున్నానని యతిభక్తిని సూచించెను.

అత్రియు వాని యత్యంతభక్తి కానందించి, యట్లే చదువుకొనుము. కడుశ్రద్ధవహించితివేని, నీకు విద్యలు త్వరలో నలవడునని చెప్పి వాని యునికికి సమ్మతించెను.

మహర్షు లందఱును దండము, కమండలువు, నక్షసూత్రమును ధరించి వానప్రస్థులై భార్యలుకూడఁ జెంతవసింపఁ దపంబుల నొనరించుచు, సంతతిఁ గాంచుచు, నతిథ్యభ్యాగతుల నాదరము సేయుచు, ధర్మాచరణశీలురై వర్తించుట యాచారమైయున్నది. ఇట్లుండ నేడో రేపో మంచి ముహూర్తమున నా విప్రకుమారునకు ([redacted] వానినామము మాఘుఁడు) విద్యనారంభింపవలయునని యత్రిమహర్షి యాలోచించుచుండెను.

ఆనాటిరాత్రి నందఱు శయనించి నిదురించుచుండ నా మాఘుఁ డత్రిమహర్షి సమీపమున నునిచికొనిన దండమును దస్కరించుకొని పాఱిపోయెను.

ప్రభాతమైనది. కమండలువు చేతఁ బట్టుకొని దండమునకై వెదుక నారంభించెను. అదియదృశ్యమయ్యె. ఎందైన మఱచితినేమోయని యాశ్రమప్రాంతము నంతయు వెదకెను; కానరాదు. శిష్యులందఱును లేచి సర్వస్థలములను బరీక్షించినను కనుపడదయ్యె.

అత్రిమహర్షికి జ్ఞప్తివచ్చి మాఘుఁ డెందు శయనించి నాఁడో కనుఁగొనుఁడని శిష్యుల కాజ్ఞ నొసంగెను. వారును వాని

నాశ్రమప్రాంతముల యందంతటను వెదకి కానరాలేదని చెప్పిరి. అప్పుడు దురాగ్రహాగ్రస్తుండై ఈచౌర్యము తప్పక మాఖుఁడేయొనరించినాడని నిశ్చయించుకొనితనమనోదృష్టితోఁ బరకించెను. అప్పుడా మాఖుఁడు చ్యవనుఁడు కాడనియు వాఁడొక రాక్షసుఁడనియుఁ దన దండము నపహరించుటకై యట్టి కపట వేషముతో వచ్చినాఁడనియుఁ దెలిసికొని మితి మించిన కోపమున వాని శపించి సంహరింతు నని జలములను గ్రహించెను. అత్రిమహర్షి తన జీవితములో నింతవఱకట్టి దురాగ్రహము నెన్నఁడును వహింపలేదు.

అట్టి సమయమున శిష్యు లత్రిముని కరంబులఁ బట్టుకొని మహాత్మా! దురాగ్రహమునుండి విముక్తులు కండు; మీరెన్న డిట్టి కోపమును వహింపలేదు. మీకు హితవుఁ దెలిపెడువారి వారము కాము. అందువలన మీ తపోధనము క్షీణించును. కావునఁ బ్రశాంతి వహింపుఁడని ప్రార్థించిరి.

అత్రియు శిష్యుల వాక్యములయందలి యాథార్థ్యము నెఱింగినవాఁడగుటచే శాంతించి యామాఖుండు తనంతదానా దండముం దెచ్చి తనకొసంగునట్లు వానికి హృదయమునఁ దీవ్రమైన తాపమును గలుగజేసెను.

అచ్చట నా మాఖుఁడొక కొండగుహలో దండము చెంతనిడుకొని పరుండి హఠాత్తుగఁ దనగర్భమున దాపము బయలువెడలి యొడలంతయు దహించుచుండుటచే నిల్వలేక దండమును బ్రముచ్చిలించి తెచ్చుటచే నత్రి యావిధంబుగఁ

ప్రయోగము జేసెనని నిశ్చయించుకొని యామహాత్ముని శరణుఁజొచ్చినఁగాని తనకీబాధ నివారణము కాదని యాదండమును బట్టుకొని పరుగున నత్త్ర్యాశ్రమమున కరుదెంచి యామహామహుని చరణంబుల దండము నునిచి శరణుమహాత్మా! రక్షించుమని వేడుకొనెను.

అత్రియు నీవెన్నఁడిట్టి మాయావేషములఁ దాల్చి యితరుల వస్తువులఁ దస్కరింపనని ప్రమాణముఁజేసిన నీబాధ తొలఁగునని పలికెను.

మాఘుఁడు చిత్త మటులె, నేనెన్నఁడిట్టి చౌర్యము నొనరింపను. ఈశ్వరసాక్షియని ప్రమాణముం జేసెను.

అప్పు డత్రిమహర్షి వాని బాధను దొలంగించి యంపించెను. ఇట్టి చౌర్యములు వ్యాపించుటకు రాజపరిపాలనాదోషమని యెఱింగి తన శిష్యులను భరతునిచెంత కనిపి బాగుగఁ బరిపాలించునట్లు నియోగించెను.

అత్రిమహర్షి యొక్క దయారసము, తపశ్శక్తి, ప్రశాంతభావము, నాగ్రహబహిష్కార సామర్థ్యము, లోకహిత కాంక్ష, విద్యాప్రబోధనాశక్తియు జగంబులకు సంస్తవనీయములై సర్వజనాదరణీయములై ప్రకాశించుటచేత నీమహాత్ముని సప్తర్షి మండల స్థానమున వైవస్వతమన్వంతరాంతము వఱకు నుండి యనంతరమున నంతకంటె నుచ్చస్థానమున వసింపుమని బ్రహ్మ యానతిచ్చి ఋషిమండలమున నునిచెను. ఈ మహాత్ముని చరిత్రము సర్వపాపహారమగుటచే నెల్లరకుఁ బఠనీయమగుఁగాక !

---

# సప్తర్షులు.

## రెండవ భాగము.

### భరద్వాజుఁడు.



తొల్లి పరబ్రహ్మ కుదయించిన నవబ్రహ్మలలో నంగిర సుండను బ్రహ్మజ్ఞాన సంపన్నునకు స్మృతియను దక్షపుత్త్రిక యందు బృహస్పతియు, ఉతథ్యుఁడు, సంవర్తుఁడు నను మువ్వురు కుమారులు మమ్మూర్తులవలె నుదయించిరి.

అందగ్రజన్ముఁడైన బృహస్పతి దేవరన్యాయమున సంవర్తక్షేత్త్రమున బయోరాశి పర్వచంద్రునిఁ గన్నయట్లు భరద్వాజునిఁ గాంచెను. భరద్వాజుండును సకలవిద్యా సాగరుం డైన గీష్పతిచెంత వేదశాస్త్రాధ్యయనముం గావించి విజ్ఞాన పరిపూర్ణుఁడై, యనంతరమున గురుప్రేరితుండై, సుశీలయను సాధ్వీమణిని బరిణయంబై, యామె నాశ్రమమున విడిచి యొంటిగఁ దపంబు సేయ గంగాతరంగిణీతీరమున కరుదెంచి వివిధ కుసుమలతావేల్లితంబును పరిశుద్ధసికతామయంబును స్వాదు ఫలమనోహరవిటపివాటికాసముదంచితంబును నగు నొక్క ప్రదేశంబున నాశ్రమమును గావించుకొని హంసను బంధించి మూలాధార స్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞాచక్రములఁ గ్రమ క్రమముగ వాయువును సంచరింపఁ

జేయుచు, దృష్టి విభవంబును భ్రూమధ్యమున సంస్థాపించి త్రిమూర్త్యాత్మకమైన ప్రణవమును నాకర్ణించుచు నచ్యుతంబును ననాదియును నగు పరబ్రహ్మయొక్క దివ్య తేజమును విలోకించుచు, నానందపరవశదేహుండై, నయనశుక్తి సంపుటములనుండి హర్షబాష్పకణ ముక్తాఫలంబుల రాల్చుచు దదేకదృష్టితో దేహంబును మఱచి, వికారగుణలాలసత్వమును విస్మరించి, సోహంబ్రహ్మేతిన్యాయమున బ్రహ్మాసన సంస్థితుండై యుండెను.

ఆ భరద్వాజుని తపంబు లోకోపకార తత్వంబును, ప్రశాంతి భూయిష్ఠంబును, పరబ్రహ్మావలోకన లాలసంబు నగుటచే, నన్యోన్యవైర స్వభావములు కలిగిన మృగశార్దూల సర్పమయూరంబులు గలిసిమెలసి మైత్రితోఁ జెలంగుచు నా మహాత్ముని శరీరమును నాకుచు నాఘ్రాణించుచు బెనవైచికొనుచు భుజాస్కంధంబుల నటనము గావించుచుండెను.

ఆ యంతర్ముఖుని శిరోజములు జటలుగ నల్లుకొని యుండుటచే నా జటాటవియందు గొన్ని ఖంజరీటంబులు గూళ్ళు పెట్టుకొని పెంటులతో క్రీడించు చుండెను. సాధారణముగ ఖంజరీటంబులు క్రీడకు నుద్యమించు ప్రదేశముక్రింద వసునిక్షేపముండుట సహజము. కావునఁ బ్రస్తుతము మన భరద్వాజుని హృదయము స్వర్ణనిక్షేపమయమై యున్నదని తలంపవలసి యున్నది. అట్లగుటచేతనే యా ఖంజనములట్లు క్రీడింపఁ గలిగినవి.

"ఖంజరీటస్తుఖంజన" మ్మని యమరనిఘంటువు. వీటినే యాంధ్రమునఁ గాటుకపిట్టలనియు, నేత్రింతలనియు వాడుదురు. వసుచరిత్రమున నిట్లు చెప్పఁబడియున్నది.

క. కంజనయనావిలోకన
ఖంజనయుగ మెదకుఁబ్రాల ♦ గని వసు వాలో
రంజిలుటఁ దెలిసి శంబర
భంజనుఁడును నిశితవిశిఖ ♦ పఙ్క్తి నగల్చెన్.

అని నిక్షేపనిదర్శన శాస్త్రమున వ్రాసినట్లున్నది. కావున భరద్వాజుని హృదయప్రదేశము హిరణ్మయమై యున్నదనుట కావంతయు సందేహము లేదు.

అట్టి పక్షులు భరద్వాజుని జటా కుహరంబునఁ బిల్లలను పెట్టుకొని తామా మహర్షి యుత్సంగసీమను నివసించుచు నామహాపురుషుని యానందబాష్పధారల నోళ్ళు దెఱచి పానముసేయుచు నందే తృప్తిని గనుచు శయనించు చుండుటచే నావిహంగములకు నాటఁగోలె భరద్వాజములని నామముకలిగినది.

గీ. ఇక్షురసపారణమున సం ♦ తృప్తిఁ జెందు
వారలకు సలిలంబుపై ♦ భ్రాంతియుండ
నట్టులానందపరవశుఁ ♦ డైనమునికిఁ
బులుఁగులకు నన్యకాంక్షలు ♦ గలుగకొన్కె.

భరద్వాజుని యమృతమయానందబాష్పసలిలాహారంబున ఖంజరీటములు సంతృప్తిని గాంచి యామహాత్ముని

యంకజటాస్థలంబుల విడువకుండ నాశ్రయించి యుండెను. పర బ్రహ్మానందసుధారసమును మనశ్చకోరముచేఁ బారణమును చేయించుచు సంతృప్తిని గాంచుచున్న భరద్వాజుండును తపో దీక్షను మానకుండ నామహనీయవ్రతమునే యాశ్రయించి యుండెను.

ఇట్లనేక శతసహస్రవర్షంబులు క్షణకాలగర్భితములై యతిక్రమించెను.

భరద్వాజ తపోబీజము మొలిచి ననలెత్తి ఛదముల ధరించి జీర్ణచ్ఛదముల సడలించి నవీనపత్రపటంబుల ధరించి ఫలోన్ముఖమైనది.

అటఁ బరమేశ్వరుని విశ్వప్రపూర్ణమైన గర్భకుహరేందు కాంతకలశమంతయు భరద్వాజ ప్రశాంతతపోమిహిరాంశు దీధితులచే ద్రవీభూతమై యనురాగ రస తరంగ సంఘంబులచే వెల్లివిరియ నారంభించెను.

కడుపునిండి వెక్కసమైనప్పు డెట్టివాఁడును మహానంద మునుగాని యాగ్రహముఁగాని వెలిబుచ్చికొనినఁగాని తద్భా రమును వహింపఁ జాలఁడు. కావునఁ బరమేష్ఠి మహర్షుల తోడను, మహేంద్రప్రముఖ దివ్యులతోడను చనుదెంచెను.

భరద్వాజుని ప్రశాంతాశ్రమ మప్పట్టున బ్రహ్మాదు లకుఁ గూడ నత్యాశ్చర్యమును గలిగించినది. ఆతనిని దపో నిష్ఠనుండి మరలించిన నాథునునాశ్రయించిన జీవకోటికాశ్రయ భంగమును గలిగింతుమేమో యని సందేహము తోఁచు

చుండెను. తపోనిష్ఠయన నిట్లుండవలయు నని సురసంయ ములు సంస్తుతించిరి. అందఱును దమతమ వాహనంబులనుండి యవతీర్ణులై భరద్వాజుని సమీపించిరి.

అప్పుడు బ్రహ్మ భరద్వాజుని శిరమునకెదురుగ బాహు వల్లరినిజాచి భరద్వాజమునిచంద్రా ! నీయమేయతపం బున కానందించితి నింక నీదీక్షను విడచి కనుదమ్ములఁ దెఱు వుము. నీయభీష్టంబుల వేఁడుమని పలికెను.

దివ్యతేజో మహితులైన యాదిత్యులను మునులను జూచి యాభరద్వాజు నాశ్రయించిన జీవకోటి యంతయుఁ దోలంగెను.

భరద్వాజుండు నయనములఁ దెఱచి బ్రహ్మాదులకు నమస్కరించి మహాత్మా! పరబ్రహ్మ! భవదీయ ప్రత్యక్ష దివ్యరూపసందర్శనమున ధన్యుఁడనైతి. ఇంతవఱకును దమ జగ న్నాటకరంగభూమికలఁ గాంచుచు నాశ్చర్యానంద రసతరంగి ణిలో నోలలాడుచుంటిని.

చం. తృణముననీవె కాంచనమ ♦ హీధరమందుననీవె వార్ధి జీ
వనముల నీవె జంతువులఁ ♦ బక్షికులంబున నీవె సర్వ ది
వ్య నివహమందు నీవె జగ♦ మంతయు నీవె పురాణియంకపీ
ఠిని దమరూపమేయగప♦ డెన్గదమీమహిమంబనంతమా.

మహాత్మా! మనశ్శక్తిలేనివానికి బహిరంగ ప్రదేశ ములుగూడ దుర్గమారణ్యములై కనుపడునట్లు విజ్ఞాన సంపద లేనివానికి నీవగోచరుఁడవు. సంవిత్సంపదగలవాని కెందుఁ

జూచిన నీదివ్యమంగళ రూపమేయగపడును. కృతార్థుండ నైతిని. నాజన్మ పావనంబైనది, మహాప్రభూ ! అని మఱి యుచు సంతృప్తిదీఱక వేదోక్తసూక్తులచే స్తవముఁ జేసెను.

బ్రహ్మయు నాతని నభినందించి వత్సా ! భరద్వాజ ! నీ మనోధర్మము మిక్కిలి శ్రేష్ఠతమ మైనది. నీకు గావలసిన వరంబుల వేఁడుమని పలికెను.

భరద్వాజుం డంజలిఁ జేర్చి విశ్వగర్భ ! నామనోదృష్టి నిరంతరమును మీయందును సర్వలోకములయందును నంత రాయము లేకుండఁ బ్రసరించు నట్లనుగ్రహింపుము. మఱియు నుపాధియుక్తుఁడనగు నాకుఁగావలసిన ధర్మములఁ దెలిపెద. వాటి నన్నింటిని నాకొసంగుము.

సీ. అనవరతంబు బ్ర • హ్మానంద సామ్రాజ్య
మనుభవించెడువాఁడె • యధికుఁడగును
సంతతంబస్వర • క్షణముసేయుచు జీవ
యాత్రజేసెడువాఁడె • పాత్రుఁడగును
పరులమర్గతులను • బాపఁ బ్రయత్నించి
చరియించువాఁడె స • చ్చరితుఁడగును
క్షమయు శాంతియు దాంతి • సత్యవ్రతంబును
విడువకుండెడువాఁడె • విజ్ఞుఁడగును
కావనాకట్టి సుగుణభా • గ్యములనొసఁగి
యుద్ధరింపవె కోటివి • ద్యుత్ప్రభావ !

నిఖిలదేవాదిదేవ ! ము ♦ నిస్తుతాంఘ్రి
కమల! నీభక్తుఁడను నను ♦ గావుమయ్య !

అని భరద్వాజుండు బ్రహ్మకు సాష్టాంగనమస్కారము లాచరించెను.

బ్రహ్మయు నాతని శిరంబునఁ దన హస్తరాజీవము నునిచి భరద్వాజ! నీమహోద్యమ మనవద్యమైనది. నీయభీప్సితంబు లన్నియు నెరవేఱునట్లు వరంబు లొసంగితి. అంతియేకాక నీ వభ్యర్థింపకున్నను యజ్ఞాదికర్మలకును సర్వభోగము లనుభవించుటకును ముఖ్యాధారమైన కామధేనువునుగూడ నొసంగితిఁ జేకొనుమని చెప్పి, దివ్యులతో తిరోహితుండయ్యెను.

భరద్వాజమహర్షియు సఫలీకృత మనోరథుండనైతినని ప్రమోదసాగరంబునం దేలుచు నిజాశ్రమాభిముఖుండై చనుదెంచెను.

అట నాశ్రమమున సుశీల భర్త తపంబు సేయుటకై చనిన దినముననే తానును తపంబాచరించి బ్రహ్మానందపదవి ననుభవింపవలయునని యెంచి తత్సమీప సరోవరప్రాంతమున నొక యాశ్రమమును గల్పించుకొని తపోనిష్ఠలో నుండెను. భరద్వాజుండు నిజాశ్రమమున కరుదెంచి తత్ప్రాంతవాసులచే దన యరాంగి తపముఁ జేయుచున్నదని తెలిసికొని యచ్చటి కరిగెను.

సాంద్రముగ నల్లుకొనిన యొక మల్లెపొదలో,

సీ. వెండిమైపూతపసిండిబొమ్మయసంగ
మైదీవనిండ భస్మము నలంది
ప్రకృతిరాగావృతబ్రహ్మరూపంబ నా
బాలార్కరుచిమించు పటముఁ దాల్చి
బ్రహ్మాండగోళసంవహనశక్తివిధాన
లీల రుద్రాక్షమాలిక ధరించి
జలదంబుపైఁ గొన్న శంపాలతికరీతి
గళలీను మేన వేనలి విదర్చి

గీ. మూఁడు మూర్తులఁ దోఁపించు ♦ మూఁడువన్నె
యలమృగాజిన పీఠిపై ♦ నధివసించి
హంసఁ బంధించి బ్రహ్మపై ♦ నాత్మనిలిపి
చేయుచుండెఁ దపంబు సు ♦ శీలసాధ్వి.

భరద్వాజుం డా సాధ్వి తపోనిష్ఠఁ దిలకించి యాశ్చర్యము నంది,

మ. పతిధర్మంబును వృద్ధిసేయుటకుఁ ద♦ద్భావం బనుష్ఠించు యో
షితయే యోషిత, యట్టిసాధ్విసతిగా♦ జేకొన్న ధన్యుండె ధ
న్యతముండట్టులుగాక చిత్తములు వే♦రైనన్ వృషేంద్రంబుతోఁ
జతగా దున్ననుగట్టి దున్నుగతి వై♦షమ్యస్థితిన్ బొందెడున్.

అని తలపోసి యీసమయమునఁ దానచ్చట నుండుట భావ్యము కాదని యెంచి యా సరస్సున సంధ్యాదికృత్యముల నెరవేర్చికొన నేగెను.

అప్పటికి సుశీలాదేవితపంబు ఫలోన్ముఖమైనది. బ్రహ్మ యరుదెంచి బిడ్డా! భరద్వాజపత్నీ! నీవిఁకఁ దపమును జాలించి నయనపద్మముల విప్పి వరంబులఁ గోరుమని పలికెను. సుశీల కనుల విప్పిచూచి బ్రహ్మకు సాగిలి మహాత్మా! జగన్నాథా! నీ కివే వందనసహస్రముల నర్పించుచున్నానని స్తుతించెను.

బ్రహ్మయు సాధ్వీమణీ! నీవు సంకల్పసంభవవు; మహాపతివ్రతవు; నీయభీష్టవరంబులఁ గోరుమని పలికెను.

సుశీలయు, దేవదేవా! నేను పెక్కువరంబులఁ గోరుదానను గాను. అమోఘవచస్కుఁడవైన నీవునన్ను సంబోధించిన విధముగ నాకు సంకల్పసిద్ధియను వరంబు నొక్కటినే యనుగ్రహించుమని సవినయంబుగఁ బలికెను.

బ్రహ్మయు నటులే నీకు సంకల్పసిద్ధియను వరంబు నొసంగితినని పలికి యంతర్హితుండయ్యెను.

భరద్వాజుం డావాక్యములాలకించి ఆహా! నాభార్య నాకంటె మిక్కిలి తెలివికలది. పంచాక్షరీమంత్రమున సకల లోకములును, సర్వదేవతలును గర్భీభూతములై యున్న తెఱంగున "సంకల్పసిద్ధి" యను వరంబున సర్వాభీష్టములును నిమిడి యున్నవని హర్షించి తీరమున కఱుదెంచెను.

వరలాభసంతోషమున దొప్పదోఁగియున్న సమయమున భర్తయైన భరద్వాజునిరూపము కన్పట్టుట చూచఁగనే సుశీల హృదయమున సంతోషసముద్రమున కప్పుసతగిలి యపారమై

తలముస్కలై హా ప్రాణేశ్వరా! యని నమస్కరించి యానంద పరవశురాలయ్యెను.

అప్పుడా పుణ్యదంపతుల యానంద మిదమిత్థమని వర్ణింప శేషాహికైనఁ దరముకాదు.

కొంతసేపటికిఁ గనువిచ్చి సుశీల మగనితో నిజాశ్రమంబునకుఁ జనుదెంచి యన్యోన్యవరప్రదానవిషయముల ముచ్చటించు కొనుచుండిరి.

మల్లెపొదలో సుశీల తపమాచరించు చున్నదని యిదివఱకుఁ జెప్పియుంటిని. తపములు రెండు విధములు; శత్రునాశనము జేసి దిగ్విజయమును జేయు తలంపుఁ గలిగినవారు గ్రీష్మకాలమునఁ బంచాగ్నిమధ్యమునను, వార్షికమునను, హేమంతమునను, సలిలమధ్యమునను దపంబుఁ జేసెదరు. అది ఘోరతపంబనం బఱగును.

మోక్షము కొఱకును విజ్ఞానము కొఱకును జేయునది. ప్రశాంత తపము. అట్టిది యేలతోదరంబులఁ జేసినను కామ్యంబులఁ బడయఁగలరు. కావున మల్లికానికుంజమునఁ దప మాచరించినదని చెప్పఁబడినది.

భరద్వాజుఁడును సుశీలయు నత్యంత మైత్రితో మెలంగుచు సత్సంతానమును బడసి తపోనిష్ఠతోఁ గాలము గడుపు చుండిరి.

తలముస్కలై హా ప్రాణేశ్వరా! యని నమస్కరించి యానంద పరవశురాలయ్యెను.

అప్పుడా పుణ్యదంపతుల యానంద మిదమిత్థమని వర్ణింప శేషాహికైనఁ దరముకాదు.

కొంతసేపటికిఁ గనువిచ్చి సుశీల మగనితో నిజాశ్రమంబు నకుఁ జనుదెంచి యన్యోన్యవరప్రదానవిషయముల ముచ్చ టించు కొనుచుండిరి.

మల్లెపొదలో సుశీల తపమాచరించు చున్నదని యిది వఱకుఁ జెప్పియుంటిని. తపములు రెండు విధములు; శత్రు నాశనము జేసి దిగ్విజయమును జేయు తలంపుఁ గలిగినవారు గ్రీష్మకాలమునఁ బంచాగ్నిమధ్యమునను, వార్షికమునను, హేమంతమునను, సలిలమధ్యమునను దపంబుఁ జేసెదరు. అది ఘోరతపంబనం బఱగును.

మోక్షము కొఱకును విజ్ఞానము కొఱకును జేయునది. ప్రశాంత తపము. అట్టిది యేలతోదరంబులఁ జేసినను కామ్యంబులఁ బడయఁగలరు. కావున మల్లికానికుంజమునఁ దప మాచరించినదని చెప్పఁబడినది.

భరద్వాజుఁడును సుశీలయు నత్యంత మైత్రితో మెలంగుచు సత్సంతానమును బడసి తపోనిష్ఠతోఁ గాలము గడుపు చుండిరి.

వచ్చిన యమునకు సుశీలాభరద్వాజు లర్ఘ్యపాద్యాదు లొసంగి పూజించి మహాత్మా వైవస్వత! నీ రాకకు గారణ మేమని ప్రశ్నించిరి.

పుణ్యాదంపతులారా! మీరిరువురును దపంబుల నొన రించి వరంబులఁ బడసి యున్నారు. మీరా వరప్రసాదములకు మోదించుచు స్వమోక్షములకుఁ బ్రయత్నింపవలయునే కాని విధివిధానముల కంతరాయములఁ గల్పింపరాదు. అల్పాయు ష్కుల కేవో విపత్తులఁ గల్పించి వారల జంపి తత్కర్మఫలం బుల నరకలోకముల ననుభవింపఁ జేసెదను. ఈ మహా సాధ్వి సుశీలాదేవి సంకల్పసిద్ధి యను వరమును బడసియుండు టచే తానేవో యున్నత విభవంబులనో మహోన్నత సుఖంబులనో సంకల్పించుకొని యనుభవింప వలయునే కాని మృతజీవులఁ దన సంకల్పముల బ్రతికించు చుండిన నేనును రుద్రుఁడును సంహార కార్యముల నొనర్పఁ బనియే లేదు. సత్కర్మ యనియు, దుష్కర్మయనియుఁ దత్ఫలాఫల విధి నిషేధములనియు నవసరమే లేదు. వేద ధర్మముల వ్యర్థ ముగఁ జేయునట్టి సంకల్పములను మీరు సంకల్పింపరాదు. ఇంత వఱకు సుశీలాదేవి యందలి గౌరవముచే బ్రహ్మయాజ్ఞ ననుసరించి వారి వారి ప్రాణముల విడిచితి నికముందట్లు విడు చుట కవకాశము లేదు. కావున నిది మొదలు మీరెద్దానిని సంకల్పించినను మనోరథము సఫలమగుఁగాని, మరణించిన వారల బ్రతికించుటమాత్రము మానవలయునని విన్నవింప వచ్చితినని యముండు పలికెను.

మహాత్మా! సమవర్తీ! నీవు వచించిన వాక్యము సత్యము. ఆబాలుఁరు మరణించుటయు, దల్లిదండ్రులు శోకించుటయుఁ జూచి సహింపలేక కరుణామయస్వాంత యగుటచే నాభార్య యట్లుచేసినదని భరద్వాజుఁడు ప్రత్యుత్తర మొసంగెను.

మునిపుంగవా! ఇక్కడి వీరి యేడ్పులకే మీరింతవగచుచుంటిరే; ఆప్రాణిని యాతనాశరీరమునఁబెట్టి శిలాకంటకమయ దుర్గమమార్గమున నీడ్చికొనిపోయి రౌరవ, సౌకర, రోధక, తాల, విశసన, మహాజ్వాల, తప్తకుడ్య, మహాలోభ, విమోహన, రుధిరాంధ, వసాతప్త, క్రిమీశ, క్రిమిభోజన, అసిపత్రవన, కృష్ణ, లాలాభక్షణ, దారుణ, పూయవహ, పాపవహ్నిజ్వాల, అధశ్శిర, సందంశ, కృష్ణసూత్ర, తమ, అవీచి, శ్వభోజన, అప్రతిష్ఠ, మరీచి, ప్రభృతిదారుణ నరకంబుల మేము బాధించునప్పుడా జీవియెంత ఘోషిల్లునో? అందు సహస్రాంశమైన మీరు వినఁజాలరు కావునఁ దద్విషయమై మీరిఁక జాలిఁ జెందనవసరములేదు. అయ్యది కాలతంత్రము; దానికి విఘాతమును దలంచుట బ్రహ్మకు విఘాతము దలంచుట వంటిది. ఇఁక యీ సాధ్వి నామాటలను బాటించును గాక! మఱియు మీకు భూతకోటియందు దయారసముండెనచో ఆయాజీవులకట్టి నరకబాధలు తొలంగునట్లు ప్రశాంతి క్రియారూపములైన కర్మసూత్రములను రచించి మరణానంతరమునఁ గలుగు బాధలకు నివృత్తికొఱకై బ్రతికియుండఁగనే తానే కొన్ని కర్మలు చేసికొనునట్లును మరణించిన పిదప

నా యపగత జీవికి బాధా విముక్తి కొఱకు వాని పుత్రాదులు కర్మలు చేసి ధారపోయునట్లును గ్రంథముల రచించి లోకోపకార మొనర్పుడని కాలుండు వచించి తాను దక్షిణ దిశాభిముఖుఁడై యరిగెను.

సుశీల తానొనర్చిన కార్యము విధివిధానమునకు విరోధమని తలంచెను. కాని యముని యుపన్యాసము వినుటతోడనే శోకసముద్రమున మునిఁగెను. భరద్వాజుండును వేడి నిట్టూరుపు విడిచి మృతులైన దుష్కర్ము లనుభవించు నరకబాధలఁ దలంచి వాపోవుచుఁ గన్నుల నీరుఁగార్చుచుండెను.

గీ. నరకమునఁ క్షోభఁజెందు పా ♦ మరులయార్తి
కూరిరహృదయంబులను నైన ♦ నీరుజేయ
నాత్మసములుగ నన్యుల ♦ నరయునట్టి
వరకృపాపూర్ణ హృదయముల్ ♦ కరుగుటరుదె ?

భర్తయొక్క విచారమును జూచి సుశీల, ప్రాణేశ్వర! ఊరక విచారించిన నేమిప్రయోజనము ? శాస్త్రములఁ బరిశీలించి వారిదుర్గతులకు నిష్కృతి గలుగునట్లు కర్మసూత్రముల రచించి లోకోపకారము నొనర్పుఁడని ప్రబోధించెను.

భరద్వాజుండును నట్లే యని తన మనోదృష్టిని నరకమార్గంబునకుఁ బఱపెను.

ఆ నరకలోకమున నసత్యవాదులు, భ్రూణహంతకులు, పురధ్వంసకులు, విప్రహంతకులు, గురుహంతకులు, గోహంతకులు, రాజస్వాపహారులు, శ్వశ్రూగమనులు మొదలగు

వారు తప్తకుంభ నరకంబునం బడి క్షోభించుటయు, పిదాహ పీడితులై మూర్ఛిల్లుటయు, నగ్ని వ్రణబాధితులై విలపించు టయుఁ గని యిఁక జూడఁజాలక దన దృష్టిని మఁగుడ్చి, ఈ పాపులకుఁ దరణోపాయ మేదియని యూహించి, శాస్త్రములఁ జర్చించి పిపాసాపీడితులకు వాసోదకములను, వహ్నివ్రణబాధితులకు దిలోదకములను, క్షుధాతురులకుఁ బిండప్రదానమనియు వైతరణీనదీతరణోపాయమునకు గోదానములనియు, నిర్ణయించి కర్మకాండలోఁ దగిన ధర్మసూత్రముల నిర్ణయించి వ్రాసి మృతులైన వారలకొఱకుఁ గర్మలఁ జేయించి తత్తదుప ద్రవప్రశాంతి నంది జీవులు ప్రవర్తిల్లుచుండిరో లేదో యని దివ్యదృష్టిచేఁ బరిశీలించి యా శాస్త్రమును దక్కిన బ్రహ్మర్షులకుఁ జూపి స్థిరపఱచి యది మొదలా ధర్మసూత్రములను శిష్యులచేఁ జదివించి భరతఖండమునం దెల్లెడను వ్యాపింపజేసెను.

సుశీలయు నది మొదలు మరణించినవారిని బ్రతికించుట మాని తనకును దనభర్తకును ననుభవయోగ్యములైన వస్తువులను సంకల్పించి పొంది వానివలన సౌఖ్యము ననుభవించుచుండెను. ఇట్లు కొన్ని వర్షము లతిక్రమింప ననంతరమునఁ ద్రేతాయుగము ప్రారంభమయ్యెను. అప్పుడు సమస్తధారుణీ చక్రమును దశరథ మహారాజు పరిపాలించుచుండెను.

దీర్ఘదర్శియైన భరద్వాజ మహర్షి దశరథ మహీపాలునకు శ్రీహరి రాముఁడై యవతరించినాడని తెలిసికొని గంగానదీ సమీపముననున్న ప్రయాగవనమ్మున నాశ్రమము నేర్ప

రచుకొని సుశీలతోఁగూడి తపంబు సల్పుచు నివసించి యుండెను.

ఇట్లుండ నొక నాటి సాయంకాలమున రామానుజుఁడైన భరతుఁడు వసిష్ఠునితోవచ్చి భరద్వాజునకు నమస్కరించెను.

భరద్వాజుండు వసిష్ఠునాహ్వానముఁజేసి భరతు నాశీర్వదించి కూరుచుండ నియోగించి యందరి సేమమునరసి వత్సా! కైకేయీకుమార! రవివంశ సంభవుండవు, దశరథ మహీపాలుని పుత్రుఁడవయ్యును, మహానుభావుని శ్రీరాముని భార్యతోఁగూడ వనములపాలు చేసి రాజ్యంబు ననుభవించుచుంటివే? పాపార్జిత ధనంబు నీకెంత తీపిగనున్నదోయీ! యని యుపాలంభించెను.

భరతుండా ముని వాక్య ప్రఘాతమునకు దుఃఖించుచు మహాత్మా భరద్వాజ మునీంద్ర! నీవంటి త్రికాలవేదిచే నిట్టి ఘోరవాక్యాలపుం బోటుదిని, నేనేమని ప్రత్యుత్తరంబీయఁగలను? కైక పుత్రుఁడనను నిందయొక్కఁడువినా నాయందే దోషమునులేదు. నేను లేనిసమయమున నిష్ఠురచిత్తయై, నా తల్లిచేసిన చెట్టచేతవలన నాయన్నకట్టి వనవాసశ్రమయు, నా తండ్రికిట్టి పరలోక ప్రాప్తియు, నాకుమితిలేని నిందయు, దుఃఖమును గలిగినదనెను. భరద్వాజుండా భరతుని పశ్చాత్తాపమునకు సంతసించి భరతకుమార! నీసుమనస్థితినంతయు నెఱుంగుదును. నీకీర్తి విస్తరిల్లుటకును నీబుద్ధిని దృఢీకరించుకొనుటకు నట్లంటినని యాశ్వాసించెను.

భరతుఁడును, మహాత్మా! నాయగ్రజుండు రాముండరిగిన మార్గము నరయుచు వచ్చితి, నామహాత్ముని బ్రార్థించి మఱల రాజ్యమునందుఁ బ్రతిష్ఠింపఁదలంచితి. తాము రాముఁడిప్పుడెందుండెనో తెలిపెదరేని వేగి పార్థించెద ; కావున వచింపఁ గోరెదనని యడిగెను.

భరద్వాజుండును భరతా ! త్వరపడవలదు. రేపటిదినమున మధ్యాహ్నము మాయాశ్రమమున విందారగించి వెంటనే పోవచ్చును. రాముఁడును నిన్నాదరింపఁ గలఁడు. ఈరేయి నిందు నిదురించుము. అని చెప్పెను.

స్వామీ ! నే ననేక సేనలతోడను, పరివారముతోడను, మాతల్లుల తోడను నరుదెంచితిని కావునఁ బ్రభాతముననే మా యన్నను గలిసికొనునట్లు మార్గము నెఱింగింపుఁడని ప్రార్థించెను.

భరద్వాజుం డాభరతుని మాటల నాదరింపక నేను మీ వసిష్ఠతుల్యుఁడను, పితృసముండను, నా మాటఁ ద్రోసివేయరాదు. నీ యపరిమిత పరివారమునకు విందు సేయుటకు నాకు శ్రమమని సుంతయుఁ దలంపవలదని నిర్బంధపఱచెను.

వసిష్ఠుండును భరద్వాజుని యానతి నతిక్రమింపవలదని భరతునకు బోధించి సమ్మతిపఱచెను.

ఆ నాఁ డందఱును శయనించిరి. ప్రభాతమైనది. భరద్వాజుండును సుశీలయు లేచి స్నానాదికముల నిర్వర్తించుకొని భర్తయొకవైపునను భార్యయొకవైపునను గూరుచుండి

క్షణకాలము యథావిధిగ జపంబు ననుష్ఠించి తమ హృదయ ములనే వేవో సంకల్పములం జేసిరి.

ఇంతలో వసిష్ఠభరతాదులును, తక్కినవారును లేచిరి; భరద్వాజుని యాశ్రమసీమయంతయు మారిపోయెను. ఏవైపు జూచినను నిర్మలనదీజలంబులే; ఎందువిలోకించినను నందన వనమే; యెచ్చోటదిలకించినను మహర్షులు బృందారకులు నప్స రసలు, తుంబురనారదులు, గంధర్వులును గనుపించుచుండిరి; దంతధావన కాష్ఠంబులు ప్రోవులుపడినవి; ఉపవస్త్రసంచయం బులు బుష్పశాఖలకు వ్రేలుచున్నవి; శ్రుతులకింపుగ గాంధర్వ గానము వినవచ్చుచున్నది. నానావిధరత్న స్థగితములైన జాం బూనదహర్మ్యంబు లద్భుతముగ దర్శనీయము లగుచున్నవి. దేవకాంత లరుదెంచి భరతాదులకుఁ జామరోపచారములు మొదలగు సపర్యలఁ జేయుచుండిరి. నారీనివహములకు స్నానా దికములకుఁ బ్రత్యేకమందిరమ్ము లేర్పడినవి. వచ్చినవారంద ఱికి నందఱు నుపచారములు సేయనియోగింపఁ బడిరి. ఎల్లరకు బట్టువస్త్రములు సంసిద్ధములుగఁ జేయబడినవి. బలవంతము మీఁద నందఱికిని నలుగులువెట్టి యాభ్యంగన స్నానములఁ జేయించు చున్నారు. వేయియేల? యింద్రలోకముగూడ నా చందముండునని తలంపరాదు. ఆ యుపచారములు సేయు వారలెవరో? ఆ మణిభవనము లెట్లు వచ్చినవో? యెవ్వరు నెఱుంగరు. గుఱ్ఱములకు గజములకును పేలాలను సారాయ మునఁ గలిపి త్రాగించి గోధుమపిండి యుడికించి శర్కరగలిపి

ఒంటికి దాణా వేయుచున్నారు. స్త్రీమండలిని నుపచారిక లలంకరించి సేవలు సేయుచున్నారు.

ఆ విశాలకనక హర్మ్యంబులఁ బీఠములును, కలశము లును పాత్రలును స్వర్ణమయములై నవి సంసిద్ధములుగఁ జేయఁ బడెను.

భరతున కివన్నియుఁ జూడఁగనే పిచ్చి యెత్తినట్ల య్యెను. వసిష్ఠుండీ వైభవమంతయు భరద్వాజుని తపోమహి మచే గలిగినదని చెప్ప ఆ హా! మహర్షుల ప్రభావంబు లమే యంబులుకదా ! యని తలపోయు చుండెను. భరద్వాజ సుశీలలు తాము కూరుచున్న చోటునుండి కదలనే లేదు. ఈవైభవమంతయుఁ జూచుచు నానందించు చుండిరి.

అప్పుడందఱును భోజనములకు సంసిద్ధులై కూరుచుం డిరి. ఏపదార్థము రుచిచూచినను దానినే కడుపుపగులఁ దినవల యునని తోఁపించుచుండెను. వివిధశాకములు నానావిధ భక్ష్య ములు భోజ్యములు క్షీరోదనములు రసాయనములు చోష్య ములు నొకటియా? పదియా? వేలకు వేలుపదార్థముల నంద ఱును మితిమించి భుజించినను ఆశతీరక యున్నది. అందువలన పాత్రముల విడువక చాలాసేపు గూరుచుండి భుజించిరి. అందఱును విసివి యెట్టకేలకు లేచిరి.

అందఱికిని సుగంధ మిళితతాంబూలంబు లొసంగఁ బడినవి. గంధర్వుల పాటలకు నచ్చరల యాటలకును

మోహపరవశులుకాని వారెవ్వరును లేరు. పరివార జనమంతయు నిఁకరాముని కొఱకుఁగాని యయోధ్యకుఁగాని మేమురామను తలంపులోనున్నారు. భరతునకుమాత్రము రామదర్శనకాంక్ష యుండుటచేత నీమహోత్సవములంతరాయమునుగలిగించుచున్న వని తలంపు గలిగి భరద్వాజుని సమీపించి, తపోధన! మీమాహాత్మ్యమనవద్యమైనది. మాపూర్వ పుణ్యవిశేషంబున తమరొసఁగిన యద్భుతపు విందు నారగింపఁ గలిగితిమి. పరిజనులీమహోత్సవమును విడువఁ జాలక్కముందు ప్రయాణమునకు వెనుదీయుచున్నారు. తమరీ మహోత్సవమున కింతటితో నుపశాంతిం జెప్పి మమ్ముఁ బ్రయాణము జేసి పంపఁ బ్రార్థించుచున్నాననియె.

భరద్వాజుండును నట్లే యని యుపశాంతిఁ జెప్పెను. మఱల భరద్వాజాశ్రమ మెప్పటి యట్లైనది. భరతాదులను కొంత దూరమువఱకు సాగనంపి వత్సా! మీరీ మార్గమున గొంత దవ్వరుగుడు. ఈవనము నతిక్రమింపఁగనే యొక బహిరంగస్థలమగపడును. దాని కవ్వలనే నయనాభిరామమై చిత్రకూటనగంబొకండు కలదు. దాని కుత్తరదిక్కున నొక నదీమతల్లి కనుపట్టును. అందె చిత్రకూటమను శైలంబు దోఁచు. నారెండింటిమధ్య నాశ్రమము నేర్పఱచుకొని శ్రీరాముం డున్నవాఁడు. అయ్యాశ్రమ మిచ్చటికి రెండున్నరయోజనముల దూరము మాత్రమున్నది. పోయిరండు. మీకు శుభంబగునని వారి ననిపివైచెను.

చం. అనవరత ప్రమోదకర, ♦ మార్యపథార్జిత వై భవంబు, వ
హ్నినిదపియింపనట్టిది, ము ♦ నిస్తుతమైనది తస్కరింపఁగా
గనుపడనట్టి పెన్నిధి, జ ♦ గంబున శాశ్వతరూపమాతపో
ధనమునకున్ సమానమగు ♦ ద్రవ్యములేదుకదా! ధరిత్రిలోన్.

భరద్వాజుండు తపోధనులందు నాయకమణివలెఁ బ్రకా శించుటచే నా మహాత్మునకు సర్వలోక సంపదలును కరతలా మలకములై యుండుటవలననే దశరథ పుత్రుఁడైన భరతు నకు నావిధంబున విందుఁజేసి శ్రీరామ వనవాసమువలన నాత నికిఁ గలిగిన చింతను మఱచునట్లుచేసి భరతున కద్భుతమును గలిగించెను. అప్పుడట్టి మహోత్కృష్టమైన విందు జరిగినందు వలననే యిప్పటికిని భరద్వాజ విందని లోకములలోఁ బ్రసిద్ధి వహించినది.

చిరకాలము తద్విధంబుగ భరద్వాజుండు సుశీలా సహి తుండై తపంబు నాచరించుచుండెను. త్రేతాయుగంబు కడచి నది. ద్వాపరయుగంబు ప్రారంభమైనది. ఒక్కనాఁడు సాయంకాలమైనది. సాంధ్యకృత్యముల నిర్వర్తించుకొని దైవ వశంబునఁ దనకుఁ గలిగిన మనశ్చాంచల్యమువలన బహిర్గత మగు తేజంబు నొక ద్రోణమం దునిచి సుశీలను బిలిచి యొఱింగించి దీనిని భద్రముగ సంరక్షించు చుండు మని చెప్పెను.

సుశీలయు బతియాజ్ఞను శిరసావహించి యద్దానిని భద్రముగ సంరక్షించుచుండ నందుండి కొన్నిదినంబుల కొక

కుమారతిలకుండు శుక్రుని యంశంబున నావిర్భవించెను. ఆ కుమారుఁడే మహాభారతరణంబున బ్రఖ్యాతివడసి కౌరవ పాండవాచార్యుఁడైన ద్రోణాచార్యుండు. ఆ విధంబుగ నా బాలకుండు దినదిన ప్రవర్ధమానుండై పెరుగు చుండఁ బృషతుండను పాంచాలదేశాధిపతి యొకకుమారుని దోడితెచ్చి ఈ బాలుండు నా కుమారుండు; వీఁడు ద్రుపదనాముఁడు; వీనిని మీ బాలునితో బాటు పెంచి యనంతరమునఁ దనకొసంగుఁడని చెప్పి భరద్వాజున కొసంగి పోయెను.

భరద్వాజుం డాకుమారుల నిరువురను బెంచి పెద్దవారిని జేసి, తన తపఃబున కంతరాయము కలుగునని యెంచి యా ద్రోణ ద్రుపదుల నుపనీతులఁ జేసి యగ్నివేశుఁ డను మహర్షి చెంత విద్యాభ్యాసము సేయ నప్పగించి తాను యథాప్రకారముగఁ దపోవ్యాసంగమునఁ గాలము గడపుచు ననంతరమున బ్రహ్మయనుజ్ఞచే భార్యయైన సుశీలాదేవితో సప్తర్షి మండలమున ననుపమానదివ్యతేజోవిరాజితుండై ప్రకాశించుచుఁ దన పవిత్ర చరిత్రమును సంస్మరించిన వారి యఘుంబులఁ దూలించుచు శుభ్రయశస్సాంద్రుండై యుండెను.

---

# విశ్వామిత్రుఁడు.



ఈతఁ డత్రి నేత్ర మరీచులవలన నావిర్భవించిన చంద్రునివంశమున జన్మించినవాఁడు.

చంద్రునకుఁ దారయందు బుధుఁడును, బుధున కిలా దేవియందు పురూరవుండును, పురూరవున కూర్వశియందు జనించిన యేడుగురు పుత్త్రులలో నొకఁడగు నమావసువును, వానికి భీముండును, భీమునకుఁ గాంచనప్రభుండును, నతనికి మహోత్రుండును, మహోత్రునకు జహ్నుండును, జహ్ను నకు సునద్యుండును, సునద్యునకు నజకుండును, వానికి బలా కాశ్వుండును, బలాకాశ్వునకుఁ గుశుండును జన్మించిరి.

ఆ కుశునకుఁ గుశిక, కుశనాభ, కుశాశ్వ, మూర్తిమం తులను నల్వురు పుత్త్రులు కలిగిరి.

అందులోఁ గుశికునకుఁ గుత్స యను భార్య యందు మహేంద్రానుగ్రహమునం జేసి యింద్రసన్నిభుఁడు గాధిరాజుద యించెను. గాధిరాజు పరిణయమై సత్యవతి యను పుత్త్రికనుఁ గని సంప్రాప్త యౌవనయైన యా కన్నియను కావ్యనందనుం డగు రుచీకున కొసంగి పరిణయముం గావించి కొంతకాలము రాజ్యమును బరిపాలించి పుత్త్రార్థియై తీర్థయాత్రాచరణముఁ గావించుచుఁ దన పుత్త్రి సత్యవతి నొసంగిన రుచీకుని యాశ్ర మమున కేతెంచెను.

సత్యవతియుఁ దల్లిదండ్రులఁ బూజించి యంతకుమున్న తనభర్త తనవశముజేసిన సంతానప్రదంబులైన చరువులలో నొక్కచరువును దనమాతకొసంగి తానొకటి భక్షణము గావింప దైవయోగంబున దనకొఱకు విప్రమంత్రములచేఁ గల్పించిన చరువు గాధిపత్ని కొసంగుటచే గాధికిఁ గుమారుఁ డొకఁడు బ్రహ్మతేజస్సమంచితుండు విశ్వామిత్రుం డుద యించెను. విశ్వామిత్రుఁడుబాల్యంబుననుండియుఁ దండ్రియందు మిక్కిలి భక్తికలిగినవాఁడై యితిహాసరూపమున మహాత్ముల చరిత్రములయందలి తత్వములఁ దెలిసికొనుచు సకలజనానంద కరుండై మాతాపితరులకుఁ దన సత్ప్రవర్తనలీలల దెలుపుచు బ్రాహ్మణ బాలురతో సఖ్యముంజేయుచు నాడుకొనుచుండెడి వాఁడు.

అనంతరమున నుపనీతుండై కొంతకాలము పురముననే యొక గురువుసమక్షమున విద్యాభ్యాసముం జేయుచుఁ దన కాతని సుబోధనము చాలదను తలంపుతోఁ దండ్రిచెంతకేగి తన మనోభీష్టము నెఱింగించెను.

గాధియుఁ గుమారునిఁ దోడ్కొనిపోయి భృగుశాస్త్రుఁ డను ముని కప్పగించి విద్యాభ్యాసము సేయుఁడని ప్రార్థింప నమ్మహర్షియు సమస్తవేదశాస్త్రములను ధనురాగమమును నేర్పి తనచెంతనున్న దివ్యాస్త్రముల నొసంగి విద్యాపూర్ణుని జేసి యాతనిని పంపివై చెను.

విశ్వామిత్రుండు మహనీయాస్త్రలాభముంగాంచి పురమున కరుదెంచి తండ్రియనుమతిని శాలవతిని, దృషద్వతిని బరిణయంబై, పట్టాభిషిక్తుండై, గర్వాంధుండై ప్రజాపరిపాలన మొనరించుచుండెను.

అప్పుడు మన విశ్వామిత్రుని మనోధైర్య మిట్లున్నది.

సీ. కూక్ష్మేక్షణముల నిర్మూలమ్ముఁ గావింతు
　　నా ! లోకములను క్షణంబులోన
కుంభినీచక్రంబు క్రుంగంగఁ గ్రుద్దుదు
　　నా ! భోగికులము షణంబులగల
శరవర్షధారలఁ గుఱిసి రాజులఁగూల్తు
　　నా ! శాత్రవుల వదనములు వాడ
నసమవిశ్వామిత్రు యశముఁ జాటించుదు
　　నా ! దిశావలయమల్లాడు నటులు

గీ. నాకుసముఁడైనవాఁడు ముల్లోకములను
　　గలఁడె ? నాకృత్యముల మాన్ప ఘనుడెవండు
　　బళిరె ! భూలోక శక్ర వైభవయుతుండ,
　　ధన్యచరితుండ, సర్వ విద్యా ఘనుండ

విశ్వామిత్రుఁడప్పుడు భృగ్వాన్వనిచెంత విద్యలనేర్చి మహనీయాస్త్రముల సంపాదించుట తప్ప బ్రహ్మశక్తిని సంపాదించి యుండలేదు. అంతమాత్రముననె అయ్యగారి కనులు తలకెక్కినవి. మత్సమానులు లేరని గర్వించి కన్నుగానక ప్రవర్తించుట కారంభించినాఁడు. తగినంత సమయము

లేకపోయినను సులభముగఁ గోపించు స్వభావముఁగలవాఁడు. అప్పటికప్పుడే కశ్యప పుత్రులైన హిరణ్యకశిప హిరణ్యాక్షులు తపస్సంపన్నులయ్యును భువనత్రయము జయించిన వారయ్యును మాకేమని గర్వించి క్రూరకర్ములై ప్రవర్తించుటచే నంతరించిన వారని వినియు నది స్మృతి లేక ప్రవర్తింపఁ దొడంగెను.

తమోగుణప్రధానులకుఁ గన్నులు కానరావనియుఁ జెవులు వినఁబడవనియు వారికొక క్రోధమే ప్రధానమనియుఁ బలికినమాట సత్యము. వారిని నిరంతరమును క్రోధదేవత యాశ్రయించి యుండును.

విశ్వామిత్రుండిట్లైనలేని మదంబున భూసంచారమునకు సర్వసేనలతోడను రథారూఢుఁడై బయలువెడలి జాహ్నవీతీరమునఁ బుణ్యాశ్రమమును గల్పించుకొని తపంబు సలుపుచున్న వసిష్ఠమునీంద్రుని యాశ్రమోపాంతమున విడిసెను.

వైఖానసాది శిష్యులవలన విశ్వామిత్రుని రాక నెఱింగి వసిష్ఠుండేతెంచి విశ్వామిత్రుని కుశలంబడిగి యాతనికిఁ దన క్షేమమును దెలిపి యానాఁడు తమ యాశ్రమమున భుజించుటకై కోరెను.

విశ్వామిత్రుఁడు వసిష్ఠుని యాదరమున కానందించి మహాత్మా! మీకు మాయందుఁ గలిగిన వాత్సల్యమును సూచించుటచే మీవిందుమాకుఁ జెందినది. నిరంతర తపోవ్యాసంగమునఁ గాలమును వెడలించు మీకు మావిందులు

స్వకర్మనిరోధములు; భారములు. మఱియు నే ససంఖ్యాకము
లైన సేనలతో వచ్చితినిగాని యొంటరిగ రాలేదు. కావునఁ గరు
ణించి మమ్మాశీర్వదించి పంపుఁ డిదియే నాయభిమతమని
ప్రార్థించెను.

వసిష్ఠుండా గాధేయుని ప్రయాణమునకు సమ్మతింపక
రాజా! నీ సేనలెన్నియైనను సరియే. నీవు నీ పరివారముతో
భుజింపకుండఁబోవుట నామతముకాదు. మఱియు నీతో వచ్చిన
యాఁడువాండ్రకును సైనికులకు గజతురంగాది వాహనము
లకుఁగూడఁ దగిన యాహారమును సిద్ధపఱపించెదను. సమ్మ
తింపుమని బలవంతము జేసెను.

విశ్వామిత్రుఁడాత్మలో నీ బీదపారునకు మాకు విందు
సేయఁదగినంత సామర్థ్యమున్నదా? అయినఁ జూచెదనుగాక?
యని తలంచి, యట్లెయని సమ్మతించెను. వసిష్ఠుండు నిజాశ్ర
మమున కరిగెను.

ఇంతలో భానుండు క్రమక్రమంబుగ నెనిమిదిగడియల
కాలము పయనముఁజేసెను. అప్పు డొక భటుఁడు పరుగున
వచ్చి, విశ్వామిత్రమహారాజా! వసిష్ఠుండెందును వంటలజేయు
చున్న ట్లగపడలేదు. దేవరకు భోజనకాల మతిక్రమించు
చున్నట్లు తోఁచుచున్నదని మనవిఁజేసెను.

అటులైన వసిష్ఠుఁ డెట్లు మనకు విందుసేయఁగలఁడో
చూచెదము! తనయసమర్థతఁదా నెఱుంగక మనలసందర భోజ

సమునకు నిలిపినవానికిఁ బరాభవము కలుగును గాక యని విశ్వామిత్రుఁడు తలంచుచుండెను.

వసిష్ఠశిష్యుఁడు వైఖానసుఁడరుదెంచి విశ్వామిత్ర రాజా! మీకును, మీనారీమండలికిని, బరివారమునకును, ననువగు కాసారంబులు వేఱువేఱుగ స్నానాదికములకు నేర్పడియున్నవి. ఉష్ణోదకములును సిద్ధముగఁ జేయఁబడినవి. అందఱును స్నానముఁజేసి వచ్చి విందారగింపవచ్చునని చెప్పి వెడలిపోయెను.

విశ్వామిత్రుఁ డాశ్చర్యముతోఁ బరివారమున కాజ్ఞ నొసఁగి తానును నారీనివహముతో బయలువెడలి పోయి చూచెను.

వసిష్ఠుని యాశ్రమము మునుపటివలె లేదు. విచిత్రములైన విశాలభవనములతోడను, వినిర్మల జలమయములైన కాసారములతోడను, స్ఫటిక శిలాసోపానములతోడను విరాజిల్లుచుండెను.

అంతటఁ గొందఱు స్త్రీలరుదెంచి విశ్వామిత్రునితో వచ్చిన యోషిన్మణులఁదోడ్కొని పోయిరి. వసిష్ఠుండరుదెంచి విశ్వామిత్రుని మంత్రులను దోడుకొని పోయెను.

భవనములన్నియుఁ బీఠములతోడను, కలధౌతపాత్రములతోడను, బంగారు జలకలశములతోడను, విలసిల్లియుండెను. సుందరాంగులు పాత్రములలో నానావిధ పక్వాన్నములను, భక్ష్యభోజ్య రసాయనములను వడ్డించు చుండిరి. ఎల్లరు నుచితాసనములఁ గూరుచుండి భుజించు చుండిరి. వడ్డించు

వారు పలుసారులు తిరుగుచుఁ గావలసిన పదార్థముల నవారిగా వర్షము గురిపించు చున్నట్లు కురిపించు చుండిరి. వారి భోజనముల కంతము లేకుండెను. పదార్థములన్నియు నద్భుత రుచులతో నొప్పుచున్నవి. గజాశ్వ సంతానమునకుఁ గావలసినట్లు దాణాయును ఖాదములును వేయబడినవి. ఆ విందు సంతృప్తిగఁ జేయఁబడెను.

వసిష్ఠుని తపోమహిమమువలన నిట్టి పదార్థము లుత్పన్నములైన వని యా సంయమిని మంత్రులందఱును ప్రశంసించు చుండిరి.

విశ్వామిత్రుఁ డత్యాశ్చర్యరససముద్రంబున మునిఁగి పోయెను. ఏవేవో ఆలోచనములు జేయుచుండెను. ముఖ మండలమున నిముసమున కొక కళ మాఱుచుండెను. ఔరా! బ్రహ్మసంపద అనిర్వాచ్యము! అప్రమేయము! దురవగాహము! అని మనసులో జర్చించుకొనఁ జొచ్చెను.

అందఱి భోజనములు నైనవి. అందఱకిని గర్పూర తాంబూలంబు లర్పింపఁబడినవి. వసిష్ఠుండు విశ్వామిత్రునిఁ జేరి నా యిచ్చు స్వల్పాతిథ్యముచు భక్తితో స్వీకరించి నందుల కానందమయ్యెనని యుపచారము చెప్పెను. విశ్వామిత్రుఁడును సంకల్పసిద్ధులును తపఃప్రభావ సంపన్నులు నగు తమ రొసంగిన యాతిథ్యమువలన సంతృప్తినేకాక పవిత్రతనుగూడఁ గాంచినాము. స్వామీ! మీకు నాయందున్న వాత్సల్యము పెంపు విస్తారము. మిమ్ము నొక్క విషయమున

నాశ్రయించు చున్నాను. నా యభీష్టమును దప్పక తీర్తురని తలంతున నెను. వసిష్ఠుఁడు, విశ్వామిత్రా! జపతపోయజ్ఞకర్మసాధనములే మా బోంట్లకు జీవయాత్ర నడపునవి. వానిని నిర్విఘ్నముగ నెరవేర్చికొనుచు యుష్మదాదు లేము_క్తిసాధనోపాయములనో అభ్యర్థించి సప్పుడు సఫలమనోరథులఁ జేసి యనుపుట యుచితము. కావున, నీ వాశ్రయించువిషయ మేదో తెలుపు మనెను.

రాజులు పరిగ్రహయోగ్యులుకారు. కావున, తద్దోషము నన్నుఁ జెందకుండఁ బదవేలపాడిమొదవులఁ దెప్పించి వాటి సంరక్షణమునకుఁ దగువసతుల నేర్పఱిచి తమ కర్పించెదను. తమచెంతనున్న శబల యను ధేనువును-

అను సర్థోక్తియందే విశ్వామిత్రా! నీ వద్దానిని గోరఁ దగదు. నేనీయఁదగదు. నీకుఁబరిగ్రహకిల్బిషంబెట్లో నాకును విక్రయదోషంబట్లు. కావున నీవా వాంఛనుండి బుద్ధిని మరలించుకొనుము.

సంయమీంద్ర! ధర్మాధికారినైన నాకు మిక్కిలి యీ గిడ్డివలన కార్యము లనేకములుండును. మీ కృత్యముల కంతరాయములేకయే నిర్వర్తింపఁజేసెదను. మీ రభ్యంతరము సెప్పవలదు.

రాజా! ఈ సురభిని నీ కీయఁగూడని విషయములనేకములున్నవి. అంతియెకాక నిరంతరమును హవ్యకవ్య దర్శ పూర్ణిమాస బలివిధానముల కాధారమైన దీని నొరులకిచ్చి నేనేమి

సేయవలయును? నా ప్రాణంబు నా దేహంబు నా కార్మికంబును నీ వభిలషింపవలదని వసిష్ఠుండు విస్పష్టముగఁ జెప్పెను.

విశ్వామిత్రుండు కన్నులెఱ్ఱఁజేసి నావంటి రాజేంద్రుని కోరికను దీర్పవుగా? యని బెదరించెను.

వసిష్ఠుం డావాక్యమును లెక్క సేయలేదు.

నా సమస్త సామ్రాజ్యమును నీ కర్పించెదను సుమా యని యాశఁజూపెను.

నీ సామ్రాజ్యమంతయు నా కుశాగ్రమునకుసామ్యము కాదని వసిష్ఠుండు నిరసించెను.

అటులైన మదీయ దివ్యాస్త్ర సందోహమును బ్రయోగించి నీకు నీ శిష్యగణంబులకు నకాలప్రళయముఁ గల్పించెద నని భయపెట్టెను.

భగవంతుని యనుగ్రహమున నా దండమునకు నీ దివ్యాస్త్రములు చల్లారఁగలవని వసిష్ఠుండు వచించెను.

అప్పుడు విశ్వామిత్రుండు దురాగ్రహ దేవతచేతిలోని నాట్యప్రతిమ యయ్యెను. శబలను బల్మిఁగొనిపొండని భటుల కాజ్ఞ యొసంగెను. రణమునకు మంత్రుల కాజ్ఞ యొసఁగెను.

వసిష్ఠుం డావంతయుఁ జలింపలేదు.

భటులు కామగవిబంధనముల సడల్చి తోలుకొనిపోవ యత్నించిరి. దానికీవిషయ మేమియుఁ దెలియక వారినిబోడిచి కోల్తలకుఁ దెచ్చి వసిష్ఠునికడ కఱచుచు వచ్చి కన్నుల నీరుఁ గార్చెను.

వసిష్ఠుండద్దాని పాటుఁ జూచి, అమ్మా! నీ శక్తికొలఁది నీవు వారిని ప్రమందించుము. నేను నిన్ను వారల కర్పింపలేదని పలికెను.

అప్పుడు శబల రోమకూపములవలనఁ బల్లవులను, యవనులను, శకులను, మ్లేచ్ఛకిరాతులను జనింపఁజేసి విశ్వామిత్రుని సేనల నురుమాడుచుండెను.

విశ్వామిత్రుం డకాల రుద్రావతారుఁ డయ్యెను. తన చెంతనున్న దివ్యసాధనముల నెల్లఁ బ్రయోగించి విక్రమించెను. కాని యవియన్నియు వసిష్ఠుని దండమున కాహారములై పోయెను. సేనలన్నియుఁ బీనుఁగు పెంటలైనవి. నవీనాస్త్రమొక్కటియు లేదు. ఱెక్కలు విరిచిన పక్షివలెనయ్యెఁ; ఒడుపుఁదప్పిన నాగుబామువలె బుసకొట్టుచు నేలఁగూలెను.

అట్టి సమయమున వసిష్ఠుండు ప్రత్యస్త్ర ప్రయోగమును సేయని ప్రశాంతచిత్తుండగుటచే విశ్వామిత్రుండు జీవించుటకుఁ గారణమైనది.

అప్పుడైనను పరసంపదల కసూయఁ జెందరాదనియు నన్యులఁ గోరరాని వస్తువులఁ గోరరాదనియు నప్పుడు నిరాకరింపఁబడియు నకారణముగ వారిపై నాగ్రహింప రాదనియుఁ దెలిసికొనఁడయ్యెను. దురభిమాన దురాగ్రహములు మాత్ర మాతని విడువకుండెను. కాని వసిష్ఠు నేమిచేయుటకును శక్తి లేక వీని నెట్లు సంహరింతునని మిక్కిలి పట్టుదలతో దీర్ఘాలోచనముఁ జేసెను. క్రియకు దపశ్శక్తి వలనఁగాని వసిష్ఠుని

గెలువఁ జాలనని తలంచి వెంటనే హిమాచలమున కరిగి ఘోరమైన తపం బాచరించెను. శంకరుఁడు సాక్షాత్కరించి నీ యభీష్టంబును వేఁడుమని పలికెను. విశ్వామిత్రుండు శర్వునకు సాష్టాంగనమస్కారము లాచరించి మహేశ్వరా!

చం. ఉపనిషదర్థసంపదల ♦ నుజ్జ్వలచాప కళారహస్యముల్
నృపసురదైత్యఖేచరము ♦ నీందు ప్రిలమించినయట్టి దివ్యశ
స్త్రపరిచయంబు, బాహుబల♦ దర్పవిభూతియుఁగార్యదీక్ష
యున్
గృపదళుకొత్తనాకొసఁగ♦వే హిమశైలసుతామనోహరా!

"తథాస్తు" అని పరమేశ్వరుం డంతర్హితుండయ్యెను. విశ్వామిత్రుఁడు బళిబళీ! గెలిచితినిఁక వసిష్ఠుని, మహీరసవిశిష్టు జేసెదనని గర్వోన్నతుండై వసిష్ఠాశ్రమమున కరిగి యొకశరంబున నాశ్రమమహీరుహంబులనెల్ల భస్మమాత్రముగఁ జేసెను. రెండవశరముఁ బ్రయోగింప నకాలప్రళయం బుత్పన్నంబై శిష్యగణ శూన్యముగ నయ్యెను.

ఇందులకుఁ గారణము విశ్వామిత్రుని దురాగ్రహమని తలంచి వసిష్ఠుండు లయకాలరుద్రుని భంగి తన బ్రహ్మదండము నెదుటఁ బ్రతిష్ఠించి యేదో జపించుచుండెను.

విశ్వామిత్రుండు దివ్యాస్త్రములఁ బ్రయోగించుచుండెను. ఒకటియా? రెండా? ఐంద్రము, ఆగ్నేయము, మారుతము మొదలగు నస్త్రములనెల్లఁ బ్రయోగించెను. సర్వసాధనములును బ్రహ్మదండమునోట బచ్చులకాడలవలెఁబడి

పిప్పి యగుచున్నవి. కడకు బ్రహ్మాస్త్రమును బ్రయోగించెను. మహదాకాశమునఁ జిదాకాశము సంక్రమించి నట్లయ్యెను. నారాయణాస్త్రమునుగూడ వదలెను. తుద కదియు వమ్మ య్యెను. పాశుపతాస్త్రమునుగూడ సంధించి విడిచెను.

ప్రారంభమున నాయస్త్రము బ్రహ్మాండ భాండ మంతయు నావరించిన మంటలతోఁ జెలరేగినదికాని సమీ పమున కేగి యాబ్రహ్మదండమునకు మృణాళ హారమయ్యెను. అప్పుడు మింట నిలిచిన దివ్యులంద ఱా వసిష్ఠునే మేమో పొగడిరి.

విశ్వామిత్రుండపహృత తేజుండగు సహస్కరుం బోలి యుండె. నిస్తరంగనీరధివలెఁ జైతన్య శూన్యత వహించెను. హిమాచల సానుప్రకరణి స్వేదజలార్ద్ర శరీరుండయ్యె. భూభార వహన శ్రాంతుఁడైన శేషాహివలెదీర్ఘనిశ్వాసమును వెడలించి,

శ్లో. ధిగ్బలంక్షత్రియబలం। బ్రహ్మతేజోబలం బలం।
ఏకేన బ్రహ్మదండేన । సర్వాస్త్రాణి హతానిమే॥

గీ. బ్రహ్మతేజోంచితబలంబె ♦ బలముకాని
బలమె క్షత్రియ బలము ఛీ! ♦ వ్యర్థకరము
అస్మదీయ ప్రయుక్త ది ♦ వ్యాస్త్రశతము
మండిమసియయ్యె నొకబ్రహ్మ ♦ దండమునను.

ఇట్లు కృతనిశ్చయుండై మంచిది పంచేంద్రియముల వశముఁ జేసుకొని వానప్రస్థాశ్రమంబున మానసిక తపంబుజేసి

బ్రహ్మర్షిత్వమును సంపాదించెదను గాకయని భార్యతో దక్షిణ దిశాభిముఖుండై చనెను.

గాధేయుండు దక్షిణదిశయందున్న నదీతీరమున నొక పుణ్యాశ్రమమునఁ దపంబుఁజేయుచు ఋతుకాలములయందు భార్యతోఁ బ్రవర్తించుచుఁ దపంబు సల్పుచు నొక వేయి సంవత్సరములు గడపెను. ఆ దినములలో నీతనికి హవిష్యందుఁడు, మధుష్యందుఁడు, దృఢనేత్రుఁడు, మహారథుఁడు నను నల్వురు పుత్రులుద్భవించిరి. అంత నొక్క వాసరంబున బ్రహ్మ సాక్షాత్కారుఁడై, కౌశికా! నీ తపంబునకు మెచ్చితి. తపోమహిమంబున రాజర్షుల నెల్లమించితివి. కావున, నీవు“రాజర్షి”వై తివని నుడివి యంతర్హితుండయ్యెను.

అంతట విశ్వామిత్రుండు నా వాంఛితము బ్రహ్మర్షిత్వమునకుఁగాని రాజర్షిత్వమునకుఁ గాదు కదా! నాకేల యీ వ్యర్థవరంబని తలపోసి మఱలఁ దపోనిష్ఠకుఁ బ్రారంభించెను.

వర్షము లనేకములు గతించినవి. ఒకనాఁడొక్క తేజోవిహీనుఁడరుదెంచి మహాత్మా! గాధినందన! “శరణుశరణు” అని పాదములఁ బడెను. కౌశికుఁడాతనిఁగాంచి రాజులకాశ్రిత రక్షణ మావశ్యక మగుటచే “నభయోస్తు” అని దీవించి త్రిశంకుమహీపాలా! నీకుభయకారణమేమి? నీకీ యమంగళ రూప మేకారణమునఁ గలిగెనని పలికెను.

త్రిశంకుఁడను స్వామీ! శరీరముతో స్వర్గమున కరుగ గల సవనముఁ జేయింపుఁడని మా పురోహితులగు వసిష్ఠుని వేడ నాతఁడిది తగని పని యని నిరాకరించెను. అంత నేనాతని పుత్రుల చెంత కేఁగి మీ తండ్రి మా వంశజుల కాచార్యుఁ డయ్యును సశరీర స్వర్గము నొసంగు మఖ మును జేయింపుఁడని వేఁడ నన్ను నిరాకరించెను. శిష్యుల యభిమతమును దీర్పని గురు వెందులకు? మీరైన నట్టి క్రతు వును సేయింపుఁడు; వలదందురేని నేనన్యుల నాశ్రయించెద నంటిని. అంతనవ్వాసిష్ఠులలిగి, గురునిందఁ జేసిన కిల్బిషంబు వలన నీవు చండాలుఁడ వగుదువుగాక ! యని శపించిరి. కావున నాకీరూపము ప్రాప్తించినది. సర్వసమర్థులు, మిమ్మా శ్రయించితి, నన్ననుగ్రహింపుఁడని గాధేయుని వేఁడుకొనెను.

అట్టి యాగ మసర్వ్వమని తానెఱింగియును వసిష్ఠ నివారితమైన కార్యము నొనర్చితీరవలయునని గట్టి దీక్షకలిగి విశ్వామిత్రుండాతని నాదరించి వాసిష్ఠుల ధైర్యమునకుఁ గిని యుచు రాజా ! నీ సత్యశీలత్వమును పరాక్రమము నెఱుంగు దును. నీకిట్టి కోరిక తీర్పక పోవుటయేకాక, నిన్ను శపించిన వాసిష్ఠుల మోము వాడునట్లు శప్తుఁడవైనను నిన్నీ రూపము తోడనే స్వర్గమున కనిపెదను. నన్ను శరణుఁ జొచ్చుటచే, నీకు స్వర్గస్థానము సులభముగా లభింపఁ జేసెదనని చెప్పి తన శిష్యు లచేఁ దగిన వస్తుసముదాయమును దెప్పించి యనేకమునుల రావించి యజ్ఞమును బ్రారంభింప బ్రయత్నించెను.

తత్పవనమునకు వసిష్ఠ తనయులు వినా యితరులందఱు విచ్చేసిరి. తానంపిన శిష్యులలోనొకఁడువచ్చి విశ్వామిత్రునితో రాజర్షి చంద్రమా! వాసిష్ఠులు తాము రాకుండుటయే కాక

క. చండాలుండట! యాజియె
చండాలాధ్వరముఁ జఱుప ♦ శక్తుఁడు, గాధే
యుండఁట! చండాలాన్నము
దండిగఁదిన మునులు సురలు ♦ దరలుదురో హాహా!

అని పరిహాసించిరని పలికెను.

అప్పుడు విశ్వామిత్రుండుదురాగ్రహావేశకంపితాంగుండై కనుఁగవ విస్ఫులింగములు దొఱల, ఔరా! దుర్మదాంధులు, తుచ్ఛులు, వసిష్ఠపుత్రులు నన్ను గూడ నధిక్షేపించినారుగా! మంచిది. ఇప్పుడే, ఈ చండాలాధ్వరయాజకు ననివార్య శాపానల కీలామాలికల వాచవి నా వాసిష్ఠులు రుచిజూచెదరు కాక! అని శాపోదకముల హస్తాంజలి గ్రహించి—

చ. ఉరుతరసత్తపోభిరతి ♦ నున్నననున్ ఋజుమార్గవర్తనున్
బరుసములాడినట్టి కుల♦పాంసనులైన వసిష్ఠసూనులె
ల్లరును మదీయశాపశిఖు♦ల,న్నిరయంబునుబొంది బూదియై
భరమగు కాలపాశమున ♦ బంధితులై విలపించుచుండి దు
స్తర దురితౌఘసప్తశత ♦ జన్మములున్ శవమాంసభోక్తలై
ధరణినపూజ్యులై, క్షుధకుఁ♦దాళక కుక్కలఁజంపి మెక్కుచున్
బరుసకిరాతకవ్రతతి ♦ భాతివివేకము లేక క్రూరులై
నరకమహార్ణవంబున న♦నారతమున్ మునిఁగిల్లుఁగావుతన్.

అని ఘోరముగ వాసిష్ఠుల శపించెను.

ఆ సమయమున నతని శాపమునకు వెఱచి సభ్యు లెవ్వరు నోరుం గదపరైరి.

అంతటితో నాగ్రహము తీరక విశ్వామిత్రుండు సభ్యులార! ఈ త్రిశంకుమహారాజు సత్యశీలుండు. ఎట్లైన మీ సహాయమువలన యాగము చేయించి తీరెదనని సవనమారంభించి హవిర్భాగంబులకై దివ్యుల నాహ్వానముం జేసె. ఒక్కదివ్యుఁడును రాఁడయ్యె. అది కాంచి, సరే, యజ్ఞముమాట నటుండనిండు. నా తపోబలంబున లేశంబే మహీవల్లభునకు ధారవోసి యితని నీ శరీరముతో స్వర్గమున కంపెదనని చెప్పి తనపుణ్యఫలంబాతనికిధారవోసి ఓ త్రిశంకుమహీరమణా! "సశరీరోదివంవ్రజ" అని త్రిశంకుని స్పృశించి పైకి లేవనెత్తెను. అప్పుడు త్రిశంకుఁడు గగనమున కెగిరిపోవుచుండెను. ఋషులందఱును జయ జయ ధ్వానములు సేయుచుండిరి.

అంతలో నాకసమునుండి, ఓ రక్షకా! విశ్వామిత్రమునీంద్రా! మాం పాహి మాంపాహి. గురుతిరస్కారమును జేసిన చండాలుఁడవు. నీకు స్వర్గమేడ యని యిందుృండు నన్నుఁ బడఁద్రోసినాఁడు రక్షింపుము, రక్షింపుమని ధ్వని వినవచ్చెను.

అప్పుడుగాధేయుండాతురతతోఁ జేయెత్తి రాజా! నిలువుము నిలువుము; నీకుభయములేదు. నా వాగ్దానము జెల్లించుకొనువాఁడను. నీ నిమిత్తమొక క్రొత్తస్వర్గమును సృష్టించెదనని

యాగగనమున దక్షిణ దిక్తటంబునఁ గ్రొత్తస్వర్గమును సప్తర్షి మండలమును సృజించి స్వర్గలోక సౌఖ్యములనన్నింటి నేర్పఱచి నీ వందు సశరీరుఁడవై వసింపుమని చెప్పి నా సామర్థ్యము నెఱుంగక నిన్ను నిరాకరించిన యింద్రుఁడే లేకపోవునట్లు శపించెదనని విశ్వామిత్రుఁడు శాపోదకముల గ్రహించి దుర్వార క్రోధుఁడై నిలిచెను. అప్పుడు వేల్పులందఱు భయపడి బ్రహ్మాదులతో నరుదెంచి విశ్వామిత్రా! శాంతింపుము. నీ తపోబలమనుపమానము. నీవు తలంచిన. స్వర్గము చేకాదు, చతుర్దశ భువనములఁగూడ సృష్టిచేయ సమర్థుఁడవు. గురు శాపోపహతుఁడగు నీ పాపునకుఁ బుణ్యాకరైక లభ్యమగు స్వర్గము నొసంగుట విధినిర్ణయమునకు భంగము సేయుటయని నీ వెఱుంగక పోలేదు. ధర్మసంస్థాపకుఁడవైన నీవే నిషేధ మార్గ మవలంబించుట ధర్మముకాదు. కావున సురలయెడ సుప్రసన్నుఁడవై ధర్మమును బరిపాలింపుము. నీవు సృష్టించిన సప్తఋషులును బృందారకులును స్వర్గము నిలుచుగాక! యీ రాజేంద్రుండీ స్వర్గమున నుండఁగలఁడు. అందువలన నీ ప్రతినయు నెరవేఱినట్లగును. కావున నింతటితో శాంతింపు మని ప్రార్థించిరి.

విశ్వామిత్రుండు ప్రశాంతి వహించెను. దివ్యులును మునులును తమ తమ స్థానముల కరిగిరి.

అప్పుడు విశ్వామిత్రుఁడు త్రిశంకుకతమ్మున దనతపో భంగమైనదని తలంచి యచ్చోటు వాసి పశ్చిమదిక్తటంబునం గల పుష్కరక్షేత్రంబునఁ దపంబుఁ గావించుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు గాధేయునిసోదరియైన సత్యవతి పుత్రుఁడు శునశ్శేఫుఁడనువాఁడు వచ్చి, విశ్వామిత్రుని గాఁగిలించుకొని యేడ్చుచు మామా! నా తండ్రి ఋచీకుండు నన్ను నంబరీషునకు బలిపశువుగా సమర్పించినాఁడు; నాప్రాణముల రక్షించుమని ప్రార్థించెను.

అప్పుడు భాగినేయుని రక్షించుట ప్రాముఖ్యమని కరుణాళుండై, వత్సా! నేను రెండుమంత్రములఁ జెప్పెదను; నిన్ను యూపమునకు బంధించినపుడు నీ వామంత్రముల బఠింపుము. నీ కప్పుడు విపత్తు తొలఁగుటయేగాక యంబరీషుని యజ్ఞము కూడ సఫలమగునని చెప్పి యంపించెను.

విశ్వామిత్రుఁడు మరల తపంబునకారంభించెను.

శునశ్శేఫుఁడు మఱలవచ్చి మామా బ్రతికితి. నీవు చెప్పినట్లు చేసితి. దివ్యులు నాకు దీర్ఘాయుష్య మొసంగి యంపినారని చెప్పెను.

మంచిదని మఱలఁ దపమారంభించెను. తపోష్ణత యూర్ధ్వలోకముల వ్యాపించుటచే దేవతలందఱు భీతిల్లిరి.

బ్రహ్మ యరుదెంచి విశ్వామిత్రా! నీవార్జిన యఖండ తపోబలంబునంజేసి ఋషివైతివని నిజేచ్ఛం జనియెను.

ఔరా! బ్రహ్మర్షిత్వము లేని నాకీ ఋషిత్వమేలయని మఱలఁ దపంబుసేయ మొదలిడెను.

ఆ యుష్ణమునకు జగంబులన్నియుఁ గంపింపఁ దొడంగెను. వసంతకాల మావిర్భవించె. ఎందుఁ జూచిన మందార

పుష్ప సుగంధబంధుర శీతానిలతరంగములె, ఏ ప్రదేశముఁ దిలకించిన మకరందపాన భ్రమన్మత్త మధుకరీబృంద మనోహర గానాలాపములే, ఏ స్థలంబుల నవలోకించినఁ బరభృత శుక శారికామంజుల గీతికారవళియే, ఏ సీమగనిన నేత్రపర్వము లైన శృంగార సుమలతాగారములే. అట్టి సమయంబున,

సీ. గాధేయ దృఢమనోగ్రంథివిప్లు శచీక
శతు్రచే బైఁడి శలాక యనఁగ
భయద తపోగ్నినార్ప విధాతృ శంగార
వైభవ వర్ష దేవత యనంగ
భవ్యకర్మసమూహ ప్లవము గంగనుముంప
దండియగా బంగారు గుండనంగ
విరహాంకురంబు లావిర్భవింపగఁ జేయ
లలితమైన వసంత లక్ష్మియనఁగ

గీ. నలరి మారుని సమ్మోహ నాస్త్రమనఁగ
మందహాసేందు చంద్రికా మంజరియన
సకియ యొక్కతె కౌశికా శ్రమసమీప
పుష్పవనమును జేరె నో ప్పులు చెలంగ.

అంతనా పువ్వుబోణి.

సీ. ననలుగోసెడునట్లు నటియించుచును హేల
లలరఁ జిర్నగవుల నొలుకుచుండు
మధుపమా ! త్రాగుమా మకరందమని మంజు
రుల వంచి కలరీతిఁ బలుకుచుండు

కోకిలా! యొకసారి కూయవా హాయిగా
మానసమా! యని తారుమారుచుండు
మారుడా! దుండగమా! బెదరింప నం
చలికినట్లు నటించి కులుకుచుండు

గీ. కాలిమంజీర రవములు ఘల్లురనఁగ
రమణిఁ గలహంసగతి నొయ్యారముగ నడచు
నోరచూపులఁ జూచుచు జారుపైఁట
సవరణము జేసికొనుచు స్వేచ్ఛ గఁ జరించె.

ఈ విధంబుగ సంచరించు నయ్యాలికుల వేణినిఁగాంచుట తోడనే విశ్వామిత్రుండు తపము బ్రహ్మర్షిత్వమునను మాట పూర్తిగ మఱచిపోయెను.

గీ. సత్క్రియా వ్రతపరమని ♦ ప్రాగరిష్ఠ
తావివేక తపః పర ♦ త్వంబనియెడు
సారఫలమిచ్చునట్టి కే ♦ దారభూమి
మెలఁతయను పుర్వుజొచ్చిన ♦ మేయుచున్నె.

విశ్వామిత్రుని పైనప్పుడు పంచబాణుండు తన పుష్పాయుధంబులఁ బ్రయోగించెను. గాధేయుండా మోహినిమణి వంక బాగుగ దృష్టిఁబఱపెను.

శా. లావణ్య ద్రవిణంబొ? మాధవుని లీ
లాపుంజమో? లేక, యా
సౌవర్ణాచల ధాతుపుంజకళికా
సౌభాగ్యమో? చంచలా

భావామేయ తటిల్లతారమణియో?
స్వర్భామినీరత్నమో?
ఈవామాక్షి కరాంబుజాతవిభవం
బెట్టైన నాకబ్బునే?

అని యూహించి జపతాపఫలం బచ్చట బారవైచి యుత్తరీయమునైనఁ జేకొనక బిరాన నాసరోజాక్షియంతికంబున కరిగి, యోసుందరాంగీ! నీవెవ్వతెవు! నీపేరెయ్యది! నాకు దర్శనమొసంగి ధన్యునిజేయుటకుఁగాక యీప్రాంతమున కేకారణమున వచ్చితివని ప్రశ్నించెను.

ఆపురంధ్రియు, మహాత్మా! నేను మేనకయను స్వర్గసుందరిని. కారణాంతరమున భూలోక సంచారమొనర్చి నాకమున కేగుచు నిటు వచ్చితినని శృంగారలజ్జ నటించెను.

అటులైన నాకు నీసమాశ్లేష సుఖంబు నీయవలయునని పలికి మేనక కరగ్రహణ మొనర్చెను.

కొన్ని సంవత్సరంబులహోరాత్రంబులాయె మోహమునఁ జిక్కి ప్రవర్తించుచుండ నొక్కనాటి ప్రాతఃకాలమున నొక యాఁడుబిడ్డనుగని మేనక యాబిడ్డను గాధేయుని హస్తమునంబెట్టి మహాత్మా! మీకును నాకును నేటితో మైత్రి సరిపోయినది. మీబాలికను మీరే పెంచుకొనుఁడు. నేనిఁక స్వర్గమున కేగెదనని చెప్పి వెడలిపోయెను.

విశ్వామిత్రుఁడు బిడ్డతోనున్న పాణిసంపుటమును దూరముగసాచి మోముఁబ్రక్కకుఁద్రిప్పి, హా!హతాశుఁడనని,

మ. తపమా! దగ్ధముఁజెందె, బ్రాహ్మ్యపుఋషి♦త్వంబా గసన్
రాదు, క్షై । ర్యపదంబాహారియించె, శిష్యగణ వి♦ ద్యా
శూన్యమైపోయె, మో । హాపదంబా! తలకెక్కె, దుర్య
శములా! ♦ యాశ్రాస్థలిన్నిండె, మా । ళిపయిన్బిడ్డనుబ్రోచు
బర్వుపడె, నీ ♦ క్లేశంబు నెట్లోర్చెదన్?

అని విషాదపూరితమనస్కుండై కొంతసేపు చింతించి ధైర్యముం దెచ్చుకొని మంచిది. ఈ బిడ్డను నాయాజ్ఞచే వనదేవతలు పోషించెదరు కాక యని శకుంతపక్షుల కలకలారావములతోను, అకల్పిత ప్రసవశయ్యయుఁ గల యొక పూవుంబొదలో నా నిసువును బెట్టి చనియెను. ఆ బిడ్డయే "శకుంతల."

గాధేయుం డచ్చటనుండి కదలి, యుత్తర దిగ్భాగమున హిమాచల ప్రాంతమునఁ దన సోదరియైన సత్యవతి వాహినీ రూపమున నున్న కౌశికీతీరమునకుఁబోయి, మరల నుగ్రతపంబు నారంభించెను. వేయేండ్లతిక్రమించినది. బ్రహ్మ ప్రత్యక్షమై నాయనా! తపము చాలించుము; నీవు మహర్షి వైతివని పలికెను.

స్వామీ! నే నభిలషించునది బ్రహ్మర్షిత్వము. కరుణచే నాకద్దాని నొసంగుఁడని వేడెను.

అయ్యది జితేంద్రియులైన పరమశాంతులకు లభ్యమగునది కాని, నీవంటి దురహంకారునకు దుర్లభమని చెప్పి యంతర్హితుండయ్యెను.

విశ్వామిత్రుఁడు మాత్రము బ్రహ్మర్షిత్వముఁ గాంచు వఱకును తన పట్టుదలను విడువక, మఱల వెయ్యేండ్లు వార్షికంబున సలిలాశయమునను, గ్రీష్మమ్మునఁ బంచాగ్నిమధ్యమునను నిలిచి తపంబుఁజేసెను.

అప్పుడొకనాఁడు కృత్యముల నిర్వర్తించుకొనఁ గన్ను దెఱచి చూచెను. మున్నెన్నఁడును దోఁపని శృంగార మా వనంబున నగుపడెను. ఇదేమివిచిత్రమని నాలుగడుగులు నడిచి చూడ నందలి సరోవరంబున జలక్రీడలాడు సుందరీబృందంబు తనకనులకు మిఱుమిట్లు గొలిపెను. విశ్వామిత్రునిరాకఁ జూచి యయ్యంచయానలందఱు నొడ్డెక్కి వృక్షములచాటున కేగిరి. వారిలో రంభమాత్ర మా కొలకునువీడక గాధేయునిఁ జూడనట్లు నటించుచు మందహాసచంద్రికల నెఱపుచు నీటినుండి వెడలి తడివల్వ మేని నంటుకొన, నిజావయవంబుల లావణ్యమును వెలిఁ బ్రసరింపఁజేయుచు, కౌశికశుకంబు తన బాహుపంజరమున నిశ్చయముగఁ జిక్కునని తలంచుచుఁ దీరమున కెక్కి బిరాన గాధిసుతునిజూచి జడిసినట్లు కొంకుచు గడగడ వడంకు మైజీవతో, మందగమనంబుతోఁ బూబొదలచాటున కేగుచుండెను.

విశ్వామిత్రుండీ మోహనాంగుల యాగమన జలక్రీడా విహారములకుఁ గారణ మేమైయుండునని దివ్యదృష్టితోఁ బరిశీలింప దనతపో భంగమునకై దేవ ప్రేరితలై వచ్చినట్లుగ పడెను. కుశిక సుతుం డాగ్రహముతో నౌరా! దివ్యులకు

నాతోఁ జెలగాటమా! అచ్చరలా! నాతపోభంగమును సేయు వారని యపరిమిత దురాగ్రహంబున రంభా!. నీవు శిలవు కమ్మని శపించెను. మిగిలిన యప్సరస లిక్షుధన్వితో నెగిరి పోయిరి. రంభ చూచుచుండఁగనే శిల యయ్యెను.

అప్పుడు విశ్వామిత్రుండకట్టా! నాతపమున కొన్ని విఘ్నములు వాటిల్లుచున్నవి! నాకు బ్రహ్మర్షిత్వము ప్రాప్తము కాదు కాబోలును! నన్ను బట్టిన దురాగ్రహ పిశాచము వదలదయ్యె. ఈదురాగ్రహమున వికారగుణము నన్నట్లు వ్యర్థుని జేయుచున్నది. ఇప్పుడైన నేనుకోపమును మాని నిర్వికారుఁడనై మఱలఁ దపంబు జేయవలయు. ఈదిక్కునునాకనువు పడలేదని తూర్పు దిక్కునకుఁబోయి యొకచోట నాశ్రమము నేర్పఱచికొని, అతిఘోరముగఁ దపంబు సేయనారంభించెను.

స్వర్గాది లోకము లన్నియు మరల విశ్వామిత్రు భయంకర తపోగ్నికీలలకు మాడిపోవుచుండెను. పురందరాదులు తాళలేక గాధేయునకు బ్రహ్మత్వ మొసఁగి జగత్సంక్షోభమును మాన్పుఁడని బ్రహ్మచెంతకుబోయి ప్రార్థించిరి.

విశ్వామిత్రుఁడు తపము సేయుచునే యుండెను.

అప్పుడు మహాత్మా! ఆకలిమంటచేఁ బ్రాణములు పోవుచున్నవి. పట్టెఁడోగిరమిడి ప్రాణంబుల రక్షించుమని యొక యెలుంగు వినఁబడెను.

పరప్రాణదానము కూడఁ దపంబులోనిదే కదా!. యని కన్ను దెఱచెను. అప్పుడొక పరమ వృద్ధబ్రాహ్మణుఁ

డాఁకలి యని మూర్ఛిల్లెను. విశ్వామిత్రుండు దయాళుండై తనకొఱ కేర్పఱచికొనిన యన్నము నాతనికి బెట్టెను.

బ్రాహ్మణుండు భుజింపుచుండ, నీతఁడెవఁడని దివ్య దృష్టితోఁ జూచెను. ఆపారుఁడు మహేంద్రుఁడనియుఁ దన తపంబునకుఁ విఘ్న మాచరింపవచ్చెననియుఁ బొడకట్టెను. మఱల నీతనికిఁ గ్రోధమావేశమయ్యెను. కాని యోర్చుకొని ప్రశాంతచిత్తుఁడై యాభూసురుననిపి మఱల దపంబున కుపక్ర మించెను.

వేల్పు లద్దానిఁ జెఱుపఁ బ్రళయాగ్నికీలలను బఱుగించిరి. ఝంఝామారుతములఁ బుట్టించి యాశ్రమమును ధ్వంసము గావించిరి. పిడుగులవర్షమును గురిపించిరి. ఇట్లనేక కాలోత్పాతంబులఁ బుట్టించిరి. కాని గాధేయుఁడు చలింపలేదు. దివ్యులు విపత్తులఁగూర్చినకొలఁది నాతని మనోదీక్ష దృఢతర మగుచుండెను. అట్టిసమయమున,

చం. కులగిరిపంక్తితో నదరె ♦ గుంభిని సప్తమహాసముద్రముల్
కలఁగె నవగ్రహంబులును ♦ ఖంబునుదారకలున్ జలించె దిక్కులుతలడిల్లె జంతువుల ♦ గుండెలుప్రీలె నమర్త్యులెల్లగం
పిలెగుశికాత్మభూభువన ♦ భీష్మతపోమహిమాగ్నిదీప్తికిన్.

ఇట్టి జగత్సంక్షోభకారణంబయిన విశ్వామిత్రతపంబునకు సంతుష్టుండై పరమేష్ఠివచ్చి వత్సా! విశ్వామిత్ర! నీవు బ్రహ్మర్షివైతివి. తపంబుఁజాలించుమని పలికెను.

విశ్వామిత్రుండంతటితో సంతసింపక, నిక్కముః కాదేమోయని పలుకక యూరకుండెను.

బ్రహ్మ యతనిశరీరమును దన కరకంజంబుల నిమిరి-

శ్లో. బ్రహ్మర్షే! స్వాగతం తేస్తు । తపసాస్మసుతోషితాః
బ్రాహ్మణ్యంతపసోగ్రేణ । ప్రాప్తవానసి కౌశిక.

గీ. స్వాగతంబగునీకు బ్ర ♦ హ్మర్షివర్య
సంతసంబయ్యె నీతప ♦ శ్చరణమునకు
నధికతపమొనరించి బ్రా ♦ హ్మణ్య పదవిఁ
జెందితివి నిశ్చయంబు కౌ ♦ శికమునీంద్ర.

అని పలికె నీవుచిరకాలజీవివై సప్తమహర్షులతోః సప్తర్షి మండలమున విరాజిల్లెదవుగాక! యని యాశీర్వదించెను.

విశ్వామిత్రుండు బ్రహ్మకు నమస్కరించి స్వామీ! పరమేష్ఠి! నేనింతటితో సంతృప్తి నందఁజాలను. క్షత్రవేద విదులందును, బ్రహ్మవేద విదులందును వసిష్ఠుండు గరిష్ఠుండు. ఆతండువచ్చి నన్ను బ్రహ్మర్షినిగా వచించెనేని సంతసించెదనని వినయమునఁ బల్కెను.

సమస్త దివ్యులతో నరుదెంచియే యున్నవాఁడగుటచే వసిష్ఠుండు మందహాసముతో వచ్చి విశ్వామిత్రా నీమహిమ అప్రమేయము, నపారమును నైనది. నీమనోదీక్షకు బ్రహ్మర్షుల దీక్షలును న్యూనములు. నిక్కముగ బ్రహ్మర్షుల నధఃకరించిన నీవు బ్రహ్మర్షివి కాక వేఱగుదువా! యనిప్రశంసించెను.

అప్పుడు "ధన్యోస్మి కృతార్థోస్మి" యని యమరులకు వసిష్ఠాదిమునులకు నమస్కరించి విశ్వామిత్రుండు మహాత్ములారా! నిశ్చయముగ వసిష్ఠుండు నా బ్రహ్మర్షిత్వమునకుఁ గారణ భూతుండు, మార్గదర్శియునని దృఢముగఁ జెప్పుచున్నాను.

గీ. పట్టుదల కల్గియుండిన ♦ బ్రహ్మపదము
నైనఁ జేకొనవచ్చు ని ♦ త్యానురక్తి
దీక్ష లేకున్నఁ దొల్లింటి ♦ తెల్వికూడఁ
గ్రమముగ హరించు జీవ యా ♦ త్రయు నశించు.

కావున నెల్లరును గార్యదీక్షయందు దృఢ మనస్కులైనచో నుత్తమపదంబుల నందుదురు. అని పలికి దివ్యుల, మునుల ననిపి యథేచ్ఛగనుండెను.

గీ. తనువుతోఁ బుట్టినట్టి క్రో ♦ ధగుణమెట్టి
జ్ఞానియందున్నఁ దలచూప ♦ మానదెపుడు
నింబరసకణయుక్తామృ ♦ తంబుమధువుఁ
జిలుకుచుండిన వెగటుసూ ♦ చించునట్లు.

కావున, మనవిశ్వామిత్రుఁడు నిర్వికారుఁడగుటవలన నున్నతపదవిని సంపాదించు కొనవచ్చునని యెఱింగియు నాజన్మజనితమైన క్రోధమును కర్మవశమున విడువఁడయ్యెను.

దేవసభలో నొకనాఁడు భూలోకంబున నిత్యసత్యవ్రతుఁడెవ్వఁడని మహేంద్రునిచేఁ బ్రశ్నింపఁబడినప్పుడు వసిష్ఠుఁడు లేచి హరిశ్చంద్రచక్రవర్తివినా అన్యుఁడు లేఁడని వచించెను.

నేనిటనుండఁగా నీప్రత్యుత్తరంబిచ్చుటకు వసిష్ఠుడెంత ఖాఁడని దురాగ్రహగ్రస్తుండై వానిచే నేభాంకించెదనని ప్రతిన బట్టి వసిష్ఠునెట్లైన నోడింప బద్ధకంకణుఁడయ్యెను.

పిదప నాహరిశ్చంద్రుని సవనధనంబు యాచించి యాతఁడాధనమీయ, నీచెంతనే నిలుపుమని చెప్పిపోయెను.

అనంతరమున నొకనాఁడు హరిశ్చంద్రుఁడు వేటకొఱకేగ మాలెతల సృజించి హరిశ్చంద్రుని వరునిగాఁ గోరుఁడని యంపించెను. ఆమహారాజందు కిష్టపడక వారిని దండింపవచ్చిన దానచ్చోటునకేగి వారిని వరింతువాలేదా ? యని నిర్బంధించెను.

స్వామీ ! నా సర్వసామ్రాజ్యమునైన నర్పించెదను గాని చండాల కన్యకా సంపర్కమును సమ్మతింపనని హరిశ్చంద్రుఁడనియె.

అటులైన నీ సామ్రాజ్య మొసంగుమని స్వీకరించి తొల్లిటి యజ్ఞధనంబిమ్మని వేధించెను.

నెల గడవిచ్చినచో నే నమ్ముడుపడియైన మీ ఋణమును దీర్చెదనని యా రాజేంద్రుండు వేడుకొనెను.

నేను నీకు యజ్ఞధనంబీయలేదని పలికిన నీ సర్వస్వము నీ కొసంగెదనని యెన్నో దుర్బోధనలఁ జేసెను.

ఆలిఁబుత్రులఁ బాసినను ప్రాణము పోయినను ఆడి తప్పనని యా మహారాజు ప్రత్యుత్తర మొసంగెను.

అటులైన నీ కర్మమని యడవులఁ బట్టించెను. మధ్యే మార్గంబున ననేక విపత్తుల ఘటిల్లఁజేసెను. అసత్యమాడుమని బోధించెను. తుదకాతని భార్యాపుత్రుల నమ్మించెను. హరిశ్చంద్రుని మాలవాని కమ్మించెను. పుత్రుని విషసర్పముచేఁ గఱపించి చంపెను. తుదకు హరిశ్చంద్రుని నిల్లాలిపై హత్యా దోషము నారోపింపఁజేసి చంపింప నాజ్ఞను బుట్టించెను.

హరిశ్చంద్రుఁ డప్పట్టున మహాధైర్యముతో సత్యమును విడువక భార్యను జంపుటకు యత్నించుచుండెను.

అప్పుడును హరిశ్చంద్రునకు ననృతమాడితి వేని నీకీముప్పుఁ దొలఁగించెదనని హితవు చెప్పెను.

హరిశ్చంద్రుండందుల కంగీకరింపక భార్యాశిరంబును నరికెను. కాని యాప్రఘాతము పుష్పమాలయై యామె కంఠమున కలంకారమయ్యెను. అదిచూచి నేనే సత్యవ్రతపరాయణుఁడనేని ఈ ఘాతముచేఁ జంద్రమతికంఠము దునియుఁ గాక ! యనివేసెను.

అప్పుడు శివుఁడు ప్రత్యక్షమై వారించెను. విశ్వామిత్రుఁ డరుదెంచి రాజా ! నీ సత్యవ్రతదీక్షఁ బరీక్షింప నిట్టి బాధల నలయించితి నాతప్పు క్షమించుమని వేఁడికొనెను.

శివుండు మృతులైనవారిని సజీవులఁగా జేసి చనియె. అప్పుడు విశ్వామిత్రుఁడేకాక యెల్లరును హరిశ్చంద్రుని సత్యవ్రత దీక్షితునిగ నిర్ణయించి సూర్యవంశరాజుల కీర్తి వేనోళ్లఁ బొగడిరి. తరువాత ధరిత్రియందు దుష్టసంహారముఁ జేయింప

దలఁచి విశ్వామిత్రుండు దశరథుని యాచించి రామలక్ష్మణులఁ గొంపోయి వారలకు మహామంత్రము లుపదేశించి తన చెంత నున్న దివ్యాస్త్రముల నొసంగి తాటకా సుబాహు మారీచ ప్రముఖ రాక్షసగణంబుల నిర్మూలముఁ గావింపఁజేసెను.

పదంపడి రామలక్ష్మణులఁ దోడ్కొని మిథిలాపురి కేఁగుచు రామచరణ ధూళీలవంబున శిలాకృతిని గాంచిన యహల్య శాపవిమోచనముఁగావించి రామునిచే శివచాపారోపణముఁ జేయించి రామునకు జానకినే కాక దశరథ పుత్రు లందఱికిని జనకకుటుంబములోని కన్యకల నిప్పించి పెండ్లిండ్లు సేయించెను. ఆసమయమున ధూర్తుఁడై వచ్చిన పరశురాముని గర్వమును రామునిచే నడఁగింపఁ జేసెను.

తొలుత సామాన్య మహీపాలుఁడైన విశ్వామిత్రుఁడు కార్యదీక్ష గలవాఁడై తపంబుల ననేకములఁ జేసి యంతరాయ బహుళంబుల నతిక్రమించి ఋషియై మహర్షియై బ్రహ్మర్షియై చిరకాల జీవిత్వమునుఁగాంచి బ్రహ్మాద్యమరులచేత సంస్తుతులఁ గాంచి సప్తర్షులలో నొక మహానుభావుఁడై యనేక సంతానములఁగాంచి నాఁటికి నేఁటికిని సప్తర్షి మండలంబున నిశ్చలన విద్యుద్గోళమువలెఁ బ్రకాశించుచు స్మరణమాత్రమున మానవుల కిల్బిషంబుల వోకార్చుచు సర్వజన స్తుత్యుఁడై యుండెను.

# సప్తర్షులు.

మూఁడవ భాగము.

## గౌతముఁడు.

బ్రహ్మమానసపుత్రులలోఁ బ్రచేతసుఁడనువాని మానసంబునుండి గౌతమమహర్షి యావిర్భవించెను.

ప్రాచేతసుండగుటచే సమస్త వేదవేదాంగముల రహస్యము లెఱింగిన గౌతమునకు గురుప్రబోధము లవసరము లేకయే విజ్ఞాతృత్వ మలవడినది.

వయస్సంభూతుండగుటచేఁ బరమ పవిత్రురాలును సురూప సద్గుణగరిష్ఠయు నగు నహల్యను పరిణయమై వానప్రస్థాశ్రమమును గైకొని తపంబుసేయుచు శిష్యులకు సకలవిద్యల నేర్పుచు నాత్మజ్ఞాన విశిష్టుండై యుండెను.

ఈ మహానుభావుండు మిక్కిలి కరుణా స్వభావుండగుటచే "ఆత్మవ త్సర్వభూతాని" అను సూక్తి ననుసరించి యనవరతముఁ బరులయం దనురాగరసమును జిలుకుచు వారి నభివృద్ధిచేయు తలంపుతోఁ దన జీవయాత్ర గడపుచుండెను.

మిక్కిలి పవిత్రకరమును, మోక్షప్రదంబునైన బ్రహ్మగిరియందు నొక యాశ్రమము నేర్పఱచుకొని యున్నంతలో

బ్రహ్మనిర్ణయమునం జేసి పాపజనసంహార మూలమైన భయంకరమగు శతవర్ష క్షామము పట్టి జనులం బీడింపం జొచ్చెను.

గీ. పగఱం బరిమార్పవిడచిన ♦ వహ్ని శరము
జగములనుగూడ వేధించు ♦ చందమునను
ఖలులకొఱకయి కలిగిన ♦ క్షామపీడ
మహిజనుల నెల్ల మలమల ♦ మాడ్చుచుండె.

అట్టి భయంకరక్షామంబు సంభూతంబగుటచేం జలాశయములన్నియు సలిలశూన్యంబులయ్యెను. కూపము లెండిపోయెను. తరుగుల్మలతాదులన్నియు నామావశేషములయ్యెను. వసుంధర నెంతవెదలకించినను పచ్చని మొక్కయొక్కండును గానవచ్చుటలేదు. స్నానాదికములకే కాక పానముసేయుట కొక్కపుడిసెండుదకంబైన దొఱకుటలేదు. కందమూలపత్రములన్నియు నిర్దగ్ధంబులగుటచే నాహారములేక మునులు తల్లడపడుచు, ముక్కునం బ్రాణములుంచుకొని సంతాపించుచుండిరి. మేంతలేక జంతుజాలములన్నియు రూపుమాసినవి. అల్పసత్త్వములన్నియు నడుగంటుటచే వాటిని భక్షించి బ్రతుకందలంచినను దిక్కులేకయున్నది. అట్టి జగత్సంక్షోభ సమయంబున బ్రహ్మగిరి సమీపాశ్రమవాసుల తల్లడమును జూచి గౌతముండు తన క్షుధార్తి యెట్లున్నను వారలయార్తిదీర్చి రక్షించు టెట్లని జాలిజెంది విచారించుచు దీర్ఘాలోచనమును గావించి వారి నెట్లయిన జీవములతో నిలుపం దలంచి-

గీ. కొద్దియో గొప్పయో సుంత ♦ కూడఁగల్గి
నపుడు పోషించుటది తెన్ను ♦ యనఁగరాదు
నీటిచుక్కయు దొఱకని ♦ కాటకమున
నన్యులను బ్రోచు టది ధర్మ ♦ మనఁగఁ బడఁగు.

కావున నేనిప్పుడే జలాధి దేవతయగు వరుణునిగూర్చి తపంబుఁజేసి యీదుర్వార క్షామపీడను నివారింపఁ జేసెదనని తలంచి నిష్ఠాగరిష్ఠుండై తపోదీక్ష కారంభించెను.

సాధారణముగఁ బరిమళవంతములైన ప్రసవములకుఁ జుట్టును కంటకము లుండుటయు, నమృతమరిచి నావరించుకొని కాలకూటము లుండుటయు స్వభావమగుటచేఁ బరోపకార పరాయణుఁడును కరుణాస్వభావుఁడును తన వలెనే పరులును కపటములేక సంభాషించుచు నసూయలేక ప్రవర్తించెదరని యోజించు నమాయకుండును నగు గౌతముని యాశ్రమము చుట్టున నున్న మునులందఱు నసూయాపరులును దుష్ప్రవర్తకులునై యుండిరి.

వారందఱా గౌతముని తపంబును జూచియోర్వఁజాలక,

ఇతఁడా! యీ గౌతముఁడా! జలంబుల గురిపించి దేశక్షామంబు నివారించు వాఁడని తృణీకరించి మనమందఱము సుభిక్షముఁగలిగిన వేఱొక దేశమున కేఁగుదమనికొందఱు పలికిరి. ఆ దేశములుకూడ నిట్లే యుండిన నేది దిక్కని మఱికొందఱు పలికిరి. మంచియో చెడ్డయో జలములకై ప్రియ

త్నించుచున్నాఁడీ గౌతముఁ డిందే యుండుదమని మఱి కొందఱు వచించిరి. క్రియకందఱందే నిలిచిరి.

గౌతముఁడు ప్రాణాయామముఁబట్టి యెండలకుఁ దపించుచు వానలకుఁ దడియుచు నతిఘోరముగఁ దపంబు సేయుచుండెను.

గీ. తాము గ్రీష్మాతపముల సం ♦ తాపపడియు
వృక్షములు సత్ఫలంబుల ♦ నిచ్చునట్లె
పరహితరతాత్ము లాత్మీయ ♦ బాధలకును
సైచియుండుట ధరణి నై ♦ జమగుఁగాదె ?

ఇట్లు పన్నెండు మాసములు గౌతముండు తపం బాచరించెను. అప్పుడు వరుణదేవుండు సాక్షాత్కరించి గౌతమా! నీ తపంబునకు సంతుష్టి నందితిని. నీయభీష్టంబును దెలుపుమని పలికెను. గౌతముఁడులేచి వరుణునకు నమస్కరించి, మహాత్మా! సకల జీవనాధార! ఇప్పటి కనేకవత్సరములనుండి యనావృష్టి దోషంబు సంభూతమై ప్రజల బీడించుచున్నది. మహీరుహము లును వీరున్నివహ తృణాంకురంబులును రూపుమాసినవి. అల్పసత్త్వమ్ములెల్ల నశించినవి. మునులందఱును ప్రాణాయామనిరతులై ధ్యానబలంబున నిట్టి దుర్భరకాలంబును దృటికాలముమహాయుగంబుగ గడుపుచున్నారు. కావున వర్షమును గురిపించి జగంబు లుద్ధరించుము. భువనాపాయమును దీర్చుటకై మిమ్ముఁ బ్రార్థించుచున్నాను. కాని నేను నాయొక్కని సుఖంబునకై మిమ్ముల వేఁడుటలేదు. కావున నన్నుగ్రహించుమని వేఁడుకొనెను.

వరుణుండును గౌతముని పరోపకారబుద్ధి కాత్మసంతసించి ఓ ప్రాచేతసా! నీవవలంబించినది మహోన్నత ధర్మమేయగును కాని బ్రహ్మనిర్ణయమగు దీర్ఘక్షామము నివారించుట ధర్మేతరము. జీవులయొక్క దుష్కర్మఫలము ననుసరించి యిట్టి దేశవిప్లవములఁ గల్పించుచుండును; నేనద్దానిని విఫలము సేయరాదు. కావున నీవు వేఱొకవరమును ప్రార్థింపు మిచ్చెదనని పలికెను.

గౌతముండును మహానుభావా!

గీ. పుడమి జలశూన్యయగుచుఁ ద ♦ ల్లడపడంగ
మునులు కొనయూపిరిని గల్గి ♦ పొగులుచుండ
నే నొకండనె మీవర ♦ దానగరిమ
బ్రతుకనేర్తునె జీవచ్ఛ ♦ వంబనగుచు.

అని మఱి మఱి ప్రార్థించెను.

వరుణుండాతని సత్ప్రవృత్తికి మోదించి, అట్లైన నీవొక చెఱువును త్రవ్వించుము. నేను వర్షజలంబుచే నద్దానిని బూరించెదనని చెప్పి యంతర్హితుండయ్యెను.

గౌతముండా ప్రకారము మునుల నందఱఁ బిలిచి వారి సహాయమునఁ బుష్కరిణిని ద్రవ్వెను. వరుణుండునువర్షమును గురిపించి, అక్షయోదకంబులచే నింపెను.

అది మొదలా కొలను గౌతమ పుష్కరిణి యని ప్రసిద్ధ వడసెను. తత్సరంబునఁ గల్హారకుముద కమలంబు లుత్పన్నంబు లయ్యెను. గౌతమాశ్రమ ప్రాంతమంతయుఁ

దరుగుల్మలతాదులచే నెప్పటియట్లు శోభాయమానమై యుండెను. ఆ కాసారసలిలంబును మునులందఱుపయోగించుచు జీవించుచుండిరి. గౌతముఁడా పుష్కరిణినుండి తన శిష్యులచే జలములఁ దెప్పించుకొని నిత్యకర్మల నెరవేర్చికొనుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు గౌతమశిష్యులు జలాహరణము కొఱకచ్చోటునకు రాఁగా, దక్కిన ముని పత్నులా శిష్యుల గాంచి స్త్రీస్వభావసులభంబగు నసూయతో మేము జలములఁ గొనిపోవువఱకును మీరు దూరముగా నుండుడని యధికార మును జూపిరి. ఆశిష్యులు కోపించి పోయి గౌతమున కెఱిం గించిరి. వారి మాటల విని యహల్య యింతటినుండి మీరు పోవలదు; నేనే జలములఁ దెచ్చెదనని చెప్పి తానుస్వయముగ గలశమునందుకొని వెడలిపోయెను. కాని యా స్త్రీలందఱు నామెతో మచ్చికగామాటలాడక మౌనమువహించి రేవంతయుఁ దామే సంచరించుచు నల్లరిగాఁ బ్రవర్తించుచుండిరి.

అహల్య మహా సుగుణ, నిగర్వచూడామణి. వారట్లు చేసినను ఈపుష్కరిణి నాభర్తచేఁ బ్రతిష్ఠింపఁబడినదని గర్వింపక తాను తన పతివ్రతాప్రభావంబునం జేసి సరసునందున్న తామరాకుల మీఁదనుండి నడిచి కొలను మధ్యకేగి స్నానము జేసి నీళ్ళు ముంచుకొని వెడలిపోయెను.

రేవులోనున్న మునిపత్నులామె పాతివ్రత్యమున కాశ్చర్యమందిరి. కాని దుస్స్వభావలగుటచే నామెయందసూయ గలిగి యెట్లువంచించు నాలోచనమును జేయఁచుండిరి.

గీ. అశుచి కలవారినే భూత ♦ మావహించుఁ
ధర్మబాహ్యులయందె క్రో ♦ధంబునిలుచు
నల్పగుణులైన స్త్రీలనే ♦ యనుసరించు
బాపము నసూయయున్ దుస్స్వ♦భావగుణము.

కావున నాస్త్రీలందఱేకకంఠులై తమ భర్తలతో నహల్య తమ్మును దుర్భాషలాడుచున్నదని వాకొనిచ్చిరి. తమప్రాణముల కాధారభూతుఁడైన గౌతముని యందు నంత భక్తిగలవారగుటచేత నామహాత్మునితోఁ జెప్పక యుపేక్షించిరి. కాని భార్యలుమాత్ర ముపేక్షింపక నిత్యమును వేధించు చుండుటచే విసిగి గౌతమున కెఱింగించిరి.

గౌతముం డహల్యను మందలించెను. కాని యాపరమ సాధ్వీమతల్లి యంతయు దోషము నెఱుంగనిదగుటచేఁ బ్రత్యుత్తరముఁ జెప్పఁజాలక యిట్టియపనింద తనపురాకృతకర్మంబున వచ్చెనని తలంచి కన్నుల నీరుడివమాత్రమూరకుండెను.

చ. కులసతులైనవారలు ప్ర ♦ కోపనులై యెవరెట్టి క్రూర వా
క్కులనలయించినన్ మదిని♦ఘూర్ణిలుచున్ బ్రతిభాషలాడఁగాఁ
దలఁపకయుంట; నింద్యచరి♦తల్ కడురోజుచు వేయినోళ్ల తో
గలగలలాడుచుండుట జ ♦ గంబున నైజగుణంబెయౌగదా!

ఆశ్రమపాంత మునులకు భార్యల ప్రతిబంధకము లెక్కువయ్యెను. వారి పోరులు బడఁజాలక సామవచనంబుల మనల రక్షించిన గౌతము నిల్లాలిని భర్త్సింపఁ జాలమని బోధించిరి. కాని, యా సతులు భర్తల వాక్యముల విశ్వ

సింపక యెట్లైనను గౌతముని నీ ప్రాంతమునుండి వెడలఁగొట్టినఁ గాని మేము మీతోఁగాపురములు సేయంజాలమని నిష్కర్షగా నుడివిరి.

అప్పుడు మునులు భార్యల బెదిరింపులకు జడిసి యట్లే యని గౌతముని బరాభవించుటకై యోజనలు సేయుచుండిరి.

గీ. విషలతికలల్లుకొన వాటి ♦ విహితమునను
నమృత ఫలముల నిచ్చు వృ ♦ క్షములుఁగూడ
విషసదృశ రసఫలము లా ♦ విర్భవింపఁ
జేయుటలు ధర్మమేకద ! ♦ క్షితి తలమున.

కావున గౌతమునిఁ బరాభవింపఁ దలంచిన మునులంద అును తమ కార్యము నిర్విఘ్నముగ సాగునటు లొకచోట వినాయకుని బ్రతిష్ఠించి ధూపదీప నైవేద్యములచే నర్చించి యా మహాత్మునిగుఱించి తపంబుః సేయుచుండిరి.

వారల కంత నొకనాఁడు విఘ్నేశ్వరుండు ప్రసన్నుండై మునులార! మీపూజలకు సంతసించితిని. మీ యుద్యమముల నెఱింగితిని. సకలమునిగణరక్షకులును, పరమశాంతులును నైన, గౌతమాహల్యల విషయమై మీరిట్లు తలంచుట ధర్మముకాదు. వారు మీకొనర్చిన మహోపకారమునకు మీ చర్మము నొలిచి పాదరక్షలుగాఁజేసి వారికొసంగినను వారి ఋణమును మీరు తీర్చికొనఁజాలరు. నిర్దోషినియు మహా సాధ్వియునైన యహల్యను మీపత్నులపవాద కలుషనుగాఁ జేసినను, ఆమె మిమ్ముఁగాని మీసతులనుగాని దూఱి

మెఱుంగదు. మీ సతులామె పాతివ్రత్యమును జూచి సహింప లేక యామహాసాధ్విపై నిట్టి కలహాకంఠత్వము నారోపించినారు. మీరు మీ భార్యలచేతి తోలుబొమ్మలై యుక్తాయుక్తముల నరయక మీరిట్టి యకృత్యమునకుఁ బూనుచున్నారు. మీ రా దౌర్మార్గ్యమునుండి బుద్ధిం మఱలించి వేఱొక వరంబును గోరుఁ డొసంగెదననియె.

ఆమునులును సంతసమొత్తఁబడుచుండుటఁ జూచి వారి భార్యలువచ్చి గౌతమబహిష్కారవరము వినా, అన్యమక్కఱ లేదనుడని మగలఁబోడుచుకొని దినుచుండిరి.

వారును స్వామీ! మా యింటిపోరుఁ బడఁజాలము. మాకా వరమేకాని యన్యమక్కఱలేదని వేయివిధములఁ బ్రార్థించి మాతపములకు సంతసించినందులకు మాకీయుప కారము సేయుడనిరి.

గణేశ్వరుండు వారి మౌర్ఖ్యమునకును, వారి భార్యల గయ్యాళి తనమునకును వగపుఁజెంది తెల్విహీనుల ప్రవృత్తిము లిట్లే యుండు నని తలంచి మునులారా! కృతఘ్నులై మీరు కల్పించు విపత్పరంపరల నా గౌతముఁడు సుఖప్రాయములుగ ననుభవించును. ఎవ్వ రెట్టి సిలుగుల నలంచినను గౌతముని మనఃకమలమునకు గ్లాని కలుగనేరదు. చివరకు మీదౌర్జన్యమే నిలుచును. అందువలన మీ కనేకాపదలు సంభవించును. మీరు నన్ను కోరుటచే గౌతముని యం దేదో కళంక మారో పింపఁబడునట్లు చేసెదను. తరువాత భవదీయపాపకర్మము

లకుఁ దగిన ఫలంబును మీ రనుభవింపఁగలరు. కాని యప్పు డైన గౌతముని కృప వడసితిరేని మీకు సుగతులు కలుగు ననిచెప్పి తిరోహితుం డయ్యెను. అది మొదలు మును లందఱు నేవిధంబగు దోషమును గౌతముఁ డొనరించునా యనియెదురు చూచుచు నాతనికిఁ గొంత సమీపమున సంచరించుచునే యుండిరి.

ఇట్లుండ నొకనాఁడు గౌతముండును, నహల్యయు నాశ్రమమును విడిచి పుష్కరిణీప్రాంతమున కరుదెంచిరి. అప్పు డొక సస్యమును మేయుచున్న బడుగుగోవునుజూచి తమయాహారమునకు భంగదశ కలిగించుచున్నదని యచ్చటనున్న తృణము నొకదానిని చేఁగొని దాని నదలించెను.

అయ్యది మాయాకల్పితగోవగుటచేఁ దృణము సోకి నంత మాత్రముననే మరణించెను.

ఆగోవుయొక్క మరణదశను గాంచి గుండెలు జల్లు మన హా! గోహత్యాదోషమునకు గుఱియైతినికదా! యని విచారింపఁదొడంగెను. అహల్యయు శోకసంతప్తహృదయయై నిశ్చేష్టితురాలయ్యెను.

ఇప్పు డీగోవుయొక్క వృత్తాంతము మనము వినవలసి యున్నది. వినాయకుండు మునులకావిధంబున వరమిచ్చి కైలాసమునకుఁ జనియె. అంత గౌరి కుమారుని జేరి వత్సా! గణనాయక! నీతండ్రి శంకరుండు గంగాదేవియందు లోలుఁడై శిరమున నెక్కించుకొనినాఁడు. నాకంటె నాసవతి యున్నతస్థానం

బున నుండుట నాకు సంతాపకరముగనున్నది. ఆమెను శివ మౌళితలముననుండి భూమికిఁ దింపునట్లు చేసి నావంత మాన్ని నాకుఁ బ్రియముసలుపుమని వేడుకొనెను.

వినాయకుండును మాత్రాజ్ఞను బాలింపఁ దలంచినవాఁడై దీర్ఘాలోచనమునుజేసి తొల్లి తా నభయమొసంగిన మునులకోరికలఁ దీర్చుటకై గౌతముని యందు దోషారోపణముఁజేసినఁ దద్దోషశాంతికై గౌతముఁడు శంకరుని బ్రార్థించి గంగావతరణమును జేయ సమర్థుఁడనియు, నందువలనఁ బార్వతి యభీష్టముకూడ నెరవేఱుననియుఁ దలంచి యొక ముసలియావై గౌతమ సస్యమునుమేయఁ దొడంగెను. అందువలననే గౌతముఁ డదలించుటయే తడవుగ నది మరణించెను.

గౌతమదోషమునకై తత్ప్రాంతములనిరీక్షించుచుండిన మునులు మునిపత్నులును బిరాన నరుదెంచి తమకోరిక నెరవేఱినదికదా యని సంతోషించుచు, ఓయీ గౌతమ! నిష్కారణము గోవును జంపి మహాదోషమునకు గుఱియైతివే! ఛీ! నీవు గోహంతకుఁడవు నీమోముఁ జూచిన మాకును నీ దోషము వాటిల్లు నని యనేకదుర్భాష లాడుచు రాళ్ళచే రువ్వుచు నేతత్క్షణమున నీప్రాంతమునుండి లేచిపోయెదవా? లేదా? యని యాదంపతులపై రాళ్లవర్షమును గురిపించిరి.

అప్పుడు గౌతముఁడు నహల్యయు మహాదుఃఖసముద్రమున మునిఁగి పోయిరి. నేను పాపుఁడనైతి ననియు, క్షమించుఁడనియు నేవేవో ప్రార్థనములు సేయుచుండెను.

కాని గౌతముని ప్రార్థనలఁ జెవిని బెట్టకయే యా మును లందఱా పుణ్యదంపతుల తర్జనభర్జనంబుల నొప్పింప వారా ప్రఘాతములకు సైపలేక తత్క్షణమే తమ యాశ్రమము నుండి యచ్చోటుకు గ్రోశమాత్ర దూరమునకుఁబోయి యందాశ్రమము నిర్మించుకొని నివసించిరి.

గౌతమశిష్యు లామహాత్ముని విడువకున్నను, సర్వ మునులకు నహితమైన కార్యమును సేయుటుచితము కాదని మహాదోషినైన నన్నిఁక సేవింపవలదని వారి నంపివైచెను.

మన యుపాయవృక్షము బాగుగ ఫలించినదని యచ్చటి మునులును, మునిపత్నులును సంతోషించుచుండిరి.

గౌతమాశ్రమ ప్రాంతమున కొక్క కాకియుఁ దొంగి చూడదయ్యె. అందువలన నా దంపతులెనలేని చింతాకూపా రంబున మునిఁగి ఎల్లైన మునులఁ బ్రార్థించి దోషనివృత్తికై తగిన ప్రాయశ్చిత్తమును జేసికొననెంచి వారి యాశ్రమము లకు భార్యతోఁగూడ నరిగెను.

ఆ మునులు వీరిని చండాలునిఁగఁ దలంచి దూరముగ నుండుమని బహిష్కరించిరి.

గౌతముండప్పుడు ముకుళితకరకమలుండై మహాత్ములారా! నావిన్నప మాలింపుడు. ఎట్టి మహాదోషములకుఁగాని ప్రాయశ్చిత్తంబులు లేకపోవు; నేనుచేసిన పాపము దుస్సహమైనదని నే నెఱుంగుదును. మీరెట్టి దుర్భర ప్రాయశ్చిత్తమును విధించినను జేసికొని పునీతుఁడ నయ్యెదను.

తత్ప్రాయశ్చిత్తవిధుల నేనెఱింగి చేసికొనినను, మహాత్ముల యుపదేశములు లేక చేయఁబడినవి నిష్ఫలంబులగును. కావున బ్రాయశ్చిత్తవిధుల నేర్పఱచి నన్ను గృతార్థునిఁ జేయుఁడని ప్రార్థించెను.

ఆమునులును నితనికి దుస్సాధ్యములైన ప్రాయశ్చిత్త విధుల నేర్పఱచిన లబ్ధమనోరథుఁడు కాక తనంతట దానే వెడలిపోవు నని తలంచి, గౌతమా! నీ పాపవిమోచనకుఁ దగిన ప్రాయశ్చిత్తమును జెప్పెదము వినుము. ముందుగ మీరీ బ్రహ్మగిరికి నేకాదశ ప్రదక్షిణములఁ జేసి వచ్చి శతఘట స్నాన ములు సేయవలయును. అనంతరమున నే నిట్టి ఘోరహత్య నొనరించితి నని చెప్పుకొనుచు సమస్తభూమండలమునకును బ్రదక్షిణం బాచరించి వచ్చి మఱల బ్రహ్మగిరి కేకోత్తరశత ప్రదక్షిణంబు లొనరించిన నుంతదోషము హరింపబడును. తరు వాత గంగాదేవి నీ యాశ్రమమునకుఁ దోడ్కొనివచ్చి యందు గృతస్నానుండవై యథావిధిగఁ బూజ లొనరించినచో నీపాత కము పటాపంచలగును. పునీతుఁడ వయ్యెద వని నుడివిరి.

గౌతముండును ఆధ్యాత్మికశక్తి సంపన్నుఁ డగుటచే దృఢదీక్షతోఁ జేసిన నెట్లు నెరవేఱకుండునని తలంచి మహా ప్రసాద మట్లే యొనర్చెద నని చెప్పి యనుజ్ఞ వడసి యథా విధిగ గిరిప్రదక్షిణ భూప్రదక్షిణ స్నానాదుల నొనరించి పరిశుద్ధుండై గంగావతరణమునకై శంకరునిగూర్చి తపంబు సేయ నారంభించెను. అహల్యయుఁబతితో సమస్తప్రాయశ్చిత్తం బులను గావించుకొని భర్తృసేవాపరాయణయై యుండెను.

శిష్యగణంబులు మరల గౌతముని సేవించు చుండిరి.

సీ. ఆత్మశక్తిని గలిగి కా ♦ ర్యక్రమమున
దృఢతమంబైన దీక్ష వ ♦ హించెనేని
యతని కడుచేత నిలుచు బ్ర ♦ హ్మాండపదవి
కనుక సాగనికార్యముల్ ♦ కలవె జగతి.

గౌతముని దృఢదీక్షాతపోమహిమంబునకు సంతుష్ట చిత్తుండై చంద్రార్ధమౌళి, శంకరుండు, గంగాధరుం డరు దెంచి, వత్సా! గౌతమ! నీ తపంబున కానందించితి. నీ యభీష్టంబును వేడుమని సుప్రసన్నవదనుండై పలికెను. గౌతముండు కనులువిప్పి చూచి యమ్మహేశ్వరుని దర్శించి యనేక సాష్టాంగనమస్కారము లాచరించి, ఆదిదేవా! మహేశ్వర! గౌరీవల్లభా!

చ. జలజభవాండముల్ మునులు ♦ సర్వసుపర్వులు వేదముల్ యు
గంబులును బ్రభాకరాదిగ్రహ ♦ ముఖ్యులుజీవులునీయపాంగ
దృక్కులజనియించివృద్ధిఁగని♦కూలుచునుండును కాదెనీదుమం
గళకర దివ్యరూపమును ♦ గాంచితిఁ బాపమువాసె నీశ్వరా!

స్వామీ! గంగాధర!

చ. అతులతపంబు సేయమహి ♦ మాన్వితుఁ జేసెదుమధ్యమధ్యగ
ర్వితుఁడగునంచు భక్తుని వి♦వేకముమాపి మహాపరాధభూరి
భృతములనెత్తిఁ బెట్టెదవు ♦ విశ్వమయుండవునీవిలాసముల్
పతితుఁడనేనెఱుంగుదునె♦బ్రహ్మహరిప్రముఖార్చితా! హరా!

విధుకృతవతంసా! సస్యలుబ్ధుండనై తృణముతో నద లించిగోహత్యాదోషము నొడిఁగట్టుకొంటిని. తత్పాపవిమోచన మొనరించి నన్నుఁ బవిత్రునిగ నొనరింపుము. నేనీ మహాదోష మును భరింపఁజాలకున్నాను. గౌతముఁడు గోహత్య చేసెనను దుర్యశము భూమండలంబెల్ల వ్యాపించినది. దాని నివారించి కృతార్థునిఁ జేయుమని వేఁడుకొనెను.

మహేశ్వరుండును, వత్సా! గౌతమమునీంద్రా! నీవు ధన్యచరితుండవు. నీయం దసూయ గలిగి దుష్టచిత్తులైన తమ భార్యలపోరుఁ బడఁజాలక ఈ ప్రాంతనివాసులైన మునులెల్ల నిన్ను వంచింపఁదలఁచి వినాయకునిఁ బ్రార్థింప నాతఁడు గోరూపమును ధరించి సస్యమును మేయుచుండెను. నీ వద్దాని నదలించినంతనే యది నేలఁ గూలెను. ఆ వ్యాజంబున నిన్ను గోహంతకునిగా గణించి, నిన్నీ మును లందఱును పాపునిగ నిర్ణయించుకొని బహిష్కరించిరి. కాని నీకు గోహత్యా దోషము సంభవింపలేదు. అయినను స్వల్పదోషంబు కలిగిన నా సందర్శనము వలననే నీ పాపము హరించినది అంతేయెకాక నీవు ప్రాయశ్చిత్తములఁగూడ జేసికొంటివి. నీ విఁక నిర్మల మనస్కుఁడవై యుండుమని చెప్పెను.

గౌతముండును, మహాదేవా! భవానీధవా! ఈ మునులు కపటస్వభావులై, నన్నువంచింపఁ బ్రియత్నమును జేసినను నీసందర్శన భాగ్యమునాకు లభించుటఁజేసి వారు నాకుమహోప కార మొనర్చినవారని తలంచుచున్నాను. వారు నాకు నిర్ణ

యించిన ప్రాయశ్చిత్త విధులలో గంగాదేవిని దోడితెచ్చి యిందుఁ బ్రవహింపజేయుట యొక విధియై యున్నది. కావున నాయెడఁ గరుణించి గంగాదేవిని నాకనుగ్రహించి నన్నును నీ యాశ్రమ వాసులను బవిత్రులఁ జేయుమనెను.

గౌతమమునిచంద్రా! తమకు మహోపకార మొన రించిన మహానుభావుఁడవైన నీయందు దోషారోపణమును గావించిన యీ కృతఘ్నుల దోషంబు లెద్దాని వలనను హరించునవి కావు. వాటికిఁ బ్రాయశ్చిత్త విధులులేవు; నీవు సౌజన్యముచేత వారొనర్చిన యపకారము నుపకారముగ గణించు కొనుటయే కాక వారిదోషనివృత్తికిఁ గూడ నీవు పాటు పడుచున్నావు. నీసద్గుణంబులు సంస్తవనీయంబులు. నీభవ్యానామము జగత్పవిత్రము; నీకేదియు నసాధ్యంబు లేదు. లోకులు పాపబుద్ధి గలవారు. నీవమాయకుఁడ వగుటచే నీవు వారల దుర్వృత్తిని దెలియ నేరకున్నావు. కావున పరుల భావంబుల నవలీలగాఁ దెలిసికొనుటకు నీచరణతలంబున నేత్రము నొసంగితిని. నీవిది మొదలు, అక్షపాదుండను నామము తోఁ బ్రసిద్ధివడయుదువుగాక! తొల్లి స్వర్గసారంబును, బృథ్వీ సారంబును సంగ్రహించి యుంచితిని. దాని యం దర్ధ భాగం బును పరిణయ సమయంబున బ్రహ్మకొసంగితి. నవశిష్ట భాగంబగు నర్ధంబును నీకొసంగితిని. నీయభీష్టము దీఱునట్లు పరిగ్రహించుమని చెప్పి గంగాదేవిని బ్రార్థించుమని మహే శ్వరుండు వెడలిపోయెను.

కం. అపకారము నొనరించిన
కృపణుల దయఁజూచి వారి ♦ కిల్బిషహారమా
నుపకారముఁ జేసెడు ని
ష్కపటుని గౌతము చరిత్ర ♦ సంస్తుతముకదా!

శివుండు గౌతమునకు గంగాప్రసాద మొసంగినాఁడని తెలిసికొని కశ్యపాత్రిభరద్వాజవిశ్వామిత్రవసిష్ఠజమదగ్నులును సర్వమునులునుసంతోషముతో గౌతమాశ్రమమున కరుదెంచిరి. గౌతముం డప్పుడు కరకమలంబుల ముకుళించి,

మ. హరిపాదాబ్జసుధానిధి న్బొడమి, ది♦వ్యాఘౌఘశుద్ధైనట్టి శం
కరుమౌళ్యగ్రజటాటవీస్థలిని రం ♦ గన్మంగళారావనుం
దరనాట్యక్రమలీలలన్ వరలు గం ♦ గాదేవి! మాపాపసం
హరణార్థంబరుదెంచుమీ! యిలకుగ♦ళ్యాణప్రపన్నాంతవై.

అని ప్రార్థించెను. ఆసమయంబుననే తన వంశజులైన సగరచక్రవర్తిపుత్రుల దుర్గతుల మాన్పఁ దలంచి తపంబున శంకరుని మెప్పించి గంగావతారమునకై వరంబునుగొన్న భగీరథుండును గంగాదేవిని బ్రార్థించుచున్నందున గౌతముండు సప్తర్షులతోడను కైలాసమున కరుదెంచెను.

శంకరుండప్పుడు నిజభక్తులైన గౌతమ భగీరథుల యభిమతములఁ దీర్పందలంచి గంగాదేవి కనుజ్ఞనిచ్చెను.

గంగయు శివ జటాజూటమునుండి నిర్గమించి తొలుత సుమేరుమహీధరంబును జలప్లావితంబుఁ గావించి, తక్షణము హిమవంతంబునకు దిగి, యందున్న యీశానునిందుమణిమయ.

మకుటంబున నిల్వ, నయ్యాశానుఁడు భక్తపరుండగుటచే నా గంగను సింహాచలంబున విడువ, నద్దేవి సప్తభాగములై ప్రవహింప నొన్నిఁటిని భగీరథుండు గొని చనుచుండ నాగంగ కాశీక్షేత్రము వఱకును వచ్చి నిలిచెను. శంకరుండును గౌతమ భగీరథులవెంటఁ బోవ్మని యానతీయ గంగయుఁ బార్వతీ ప్రమథగణములతో నీవిందు వసించుము; నేను నర్థాంశముతో నిందుండెదను; మిగిలిన యర్థాంశముతో మునులవెంట నరిగెదనని శివునితోఁ బలికెను.

అట్లే యని శంకరుండు సమ్మతించి కాశీక్షేత్రమున నెలసె. అందువలననే కాశీక్షేత్ర మట్టి పాపహరమైన మహాత్మ్య కలిగినదై నది.

అందుండి భగీరథుఁడు కొంత గంగను వింధ్యమహీధరోత్తరభాగమునుండి తీసికొనిపోయి పూర్వసముద్రమునఁ గలిపి సాగరులకు మోక్షమును గలుగఁ జేసెను.

గౌతముండు గంగాశాఖను దీసికొని వింధ్యపర్వత దక్షిణదిశనుండి తోడ్కొని వచ్చుచుండెను.

గౌతముండిట్లు గంగను దెచ్చుచున్నాఁడని విని గౌతమాశ్రమప్రాంతవాసులైన మునులు స్నానముసేసి పవిత్రులము కావలయునని యెదురువచ్చుచుండిరి.

అంతలో గంగ భూగతమై యంతర్థానముఁ జెందెను. గౌతము డప్పుడా గంగాదేవి ననేకవిధముల స్తుతింప నామె గగనమున నిలిచి గౌతమా! నిన్ను వంచించినమునులు

నాలోస్నాన మొనరించి, తమపాపముల నాశంటించఁ దలఁచి వచ్చినారు. నేను వారిని స్పృశింపఁజాల. అందువలన సంతప్తాన నైతి నని పలికెను.

గౌతముం డప్పు డుచితమైన భక్తితో స్తుతించి తల్లీ! భువనపావని! నాకు వారిఘర్షణమువలననే శివుని సందర్శనమును, నీ యనుగ్రహమును గలిగినది. కావున, వారు నా కప కారులైనను మహోపకారులుగాఁ దలంచుచున్నాను. నా యందున్న వాత్సల్యము పెంపున వారినిగూడ రక్షింపు మని ప్రార్థించెను.

గంగ సాక్షాత్కరించి వత్సా! అట్లయిన నా కపటమును లందఱును బ్రాయశ్చిత్తమును గావించుకొనునట్లు చేయుము. పదంపడి నీ వెంట వచ్చి వారలఁ బవిత్రులఁ జేసెద ననియె. ఆ మునులును సిగ్గుపడి తా మొనరించిన యకృత్యములకు వగచి ప్రాయశ్చిత్తములఁ గావించుకొనిరి. అప్పుడు గంగాదేవి సహ్యాపర్వతమునుండి వెడలి గౌతమునివెంట నిప్పుడు రాజమహేంద్రవరమను ప్రసిద్ధి వడసిన పురమువఱకు వచ్చెను. ఆపురమునకు దక్షిణముననున్న కొవ్వూరే గౌతముఁడు సస్యలోభియై గోవునదలించిన ప్రదేశము. అందులకు నిదర్శన మిప్పటికిని దత్తీరమున గోపాదములు విస్పష్టముగఁ గనిపించు చుండును. గంగాదేవి తత్ప్రదేశమును బవిత్రముఁ జేసెను. కపటమునులకు స్నానభాగ్యం బొసంగి పవిత్రులఁ జేసెను. అప్పుడు సప్తమహర్షులలోఁ దక్కిన యేడుగురు గౌతము

నాశ్రయించి గంగాదేవిని మనమేడుగురము సాగరమున సంగమింపఁ జేయుదమనిచెప్పి యొప్పించి సప్తర్షులు గంగాదేవిని సప్తస్థానముల సాగరమున సంగమింపఁ జేసిరి.

అందులకు నిదర్శనము రాజమహేంద్రవరమువఱకును గౌతమియని ప్రఖ్యాతి వడసినది. అది మొదలేడు పాయలై సంక్రమించుటచేతఁ దుల్య, భారద్వాజ, గౌతమి, వృద్ధగౌతమి, ఆత్రేయి, వసిష్ఠయు, కౌసిక, అను సాగర సంగమముల నామము లేర్పడినవి. అయ్యవి కాకినాడ చెంత నున్న చొల్లంగి మొదలు అంతర్వేది వఱకు గలిగి యున్నవి. గౌతమాజ్ఞచే వసిష్టుండు గంగను దెచ్చుచుండ నందొక భాగమును గన్నవరమునుండి వైనతేయుఁడు తస్కరించుకొని వచ్చి బెండమూర్లంక సమీపమున సాగరంబునఁ గలిపె. అందువలన నా పాయకు వైనతేయమని నామము కలిగెను. తస్కరించుటచే వైనతేయమున స్నాతులైనవారికి బుణ్యముండదని వసిష్ఠుండు శపింప మఱల సుపర్ణప్రార్థితుఁడై యాదిత్యవారమున స్నానముఁజేసిన పుణ్యము కలుగునని వసిష్ఠుండు వరమనుగ్రహించెను.

పైనుదహరించిన సప్తసాగరములలో స్నానముచేసిన వారికి తప్పక సంతతి కలుగునని క్షేత్రమహాత్మ్యమునఁ జెప్పఁబడియుండుటచే నిప్పటికిని గృహస్థులు సంతానార్థులై కుటుంబములతో సప్తసాగరయాత్రను సేయుచుందురు.

గౌతమీనదికి గౌతముఁడే ప్రధానుఁడగుటచేఁ దచ్చరిత్ర మంతయు నిచట వ్రాయఁబడినది.

గంగానది ప్రవహించుటచేఁ దత్ప్రాంత మంతయుఁ బుష్పఫలభరితమై సర్వజన సేవ్యమై యుండెను.

గౌతమమహర్షి పరమసాధ్వియైన అహల్యతో సంతానాభిలాష కలవాఁడై కొన్ని వర్షంబులు సుఖించి యామె గర్భమున మహాశాంతుండును జ్ఞానియునైన శతానందుం డను కుమారరత్నముం గాంచి యానందించుచుండెను.

ఇట్లుండ నొకనాఁ డహల్య తన భర్తయైన గౌతముఁడు తపోబలముచే నవతరింపజేసిన గౌతమీనదియందు బుతుస్నానమును సేయుట మహాదోష మని తలపోసి సర్వ సమర్థుండగు భర్తకుఁ దన యభిమతమును దెలిపెను.

గౌతముండామెకు గౌతమీనదయందున నున్న పరమ భక్తి కానందించి యిందుల కేమి సేయుదు నని తలంచి తా నంతకుమున్న నివ్వరిధాన్యమును బండించుకొనుటకై నాగళ్ళచే దున్ననిబీడు పల్లపుభూమిలోఁ బ్రవహింపు మని గంగాదేవిని భక్తిపురస్సరుండై ప్రార్థించెను. గంగయు, నాగౌతముని యభీష్టముం దీర్చుట కభ్యంతరము లేని దగుటచే నా పల్లపుఁ బ్రదేశము నొకసారి పొంగి నిండించి మరల యథాప్రకారము ప్రవహించుచుండెను.

గౌతముండా గంగాదేవి భక్తవాత్సల్యమునకును, తన పూర్వపుణ్యావిశేషమునకును నానందించుచు, నా ప్రాదమునకు

(ఇవ్విట్టున నహల్యాశబ్దవిచారణము సేయ నవసరమైయున్నది. హాలేన కృష్టా భూమిః హాల్యా అనఁగా నాగలిచే దున్నిన ప్రదేశము. హాల్యా నభవతీ త్యహల్యా నాగలిచే దున్నని దగుటచే నహల్యా యని బీడుభూమి కర్థము. అట్టి అహల్యా యను భూమికి గవాం అతిశ్రేష్ఠః గోతమః గోవులలో నతి శ్రేష్ఠుఁడు అన గోపతి. గోతమ ఏవ గౌతమః అట్టి వృషభ రాజు బీడుభూమి యగు నహల్యకు నాథుఁడు కావున నహల్యకు భర్త గౌతముఁడు అని తెలియనగును.) అహల్యాక్షేత్రంబున గంగ సంగమించుటచే నహల్యాసంగమతీర్థంబని సమాఖ్య నునిచి యందుఁ బురుషు లెవ్వరును స్నానము సేయరాద నియు, నట్లు చేసినవారు తమ తేజమును గోల్పోవుదు రనియుఁ నాన వెట్టెను.

అది మొదలా తీర్థంబున స్త్రీలు వినా పురుషులు స్నానము సేయకుండుట యాచారమై యున్నది. నిరంతరమును స్త్రీలేయందుఁ బ్రవర్తించుటచే అహల్యా సంగమతీర్థం బను పెద్దమాట నుచ్చరింపఁజాలక నతు లందఱు నా మడువును "అహల్య అహల్య" యని వాడఁజొచ్చిరి.

ఇట్లుండ నింద్రుం డొకనాఁడు భూలోకమునకు వచ్చి యచ్చటచ్చట నచ్చరలతోఁ గ్రీడించి వారి నవిపి తన హృద యమున నేదో కోరిక నుంచుకొని యా అహల్యా సంగమ తీర్థంబునఁ గ్రుంకుచుండెను.

ఆ సమయమున గౌతమపత్ని యహల్యా హ్రాదముం దఱియం జొచ్చి యందెవ్వఁడో పురుషుండు స్నాన మాచరించుచుండె నని తలంచి బిరాన వెనుకకుఁ బోయి గౌతమ మహర్షి కెఱింగించెను.

గౌతముం డప్పుడు నా యానతిని ద్రిలోకముల నుండు వారును సమాదరించుచుండ నీ యతిక్రాంతమర్యాదుండగు మూర్ఖుఁ డెవ్వఁడని దురాగ్రహముచే బయలువెడలి వచ్చుచుండెను.

ఇంతలో దత్ప్రాంతమున గుశలకొఱ కేఁగిన మునికుమారుం డా హ్రాదమును సమీపించి, ఓయీ! మూర్ఖుఁడా! లోకత్రయమునకుఁ గూడ నవిలంఘ్యమగు గౌతమశాసనసూత్రము నధిగమించి యహల్యను సంగమించితివా! దీనికిఁ దగిన ప్రాయశ్చిత్తమగు నదే గౌతముఁడు కాలాగ్నిరుద్రుని వలె వచ్చుచున్నాఁడని చెప్పి వెడలిపోయెను.

గౌతమాగమనవార్త వినుటతోడనే బృందారకేంద్రుండు భయంబు నంది యొక బిడాలరూపమును ధరించి మెల మెల్లనఁ దత్తీరమున గల చిట్టిచిట్టి పొదల మాటున దారుచుండెను. గౌతముఁడు సర్వజ్ఞుఁడు, మహాత్ముఁడు. ఆతనికి దెలియని విషయ మేదియు లేదు. ఓరీ బిడాలరూపుఁడా! నీ వెవ్వండవు? నీ వే యభిలాషముతో వచ్చి యీ హ్రదమునఁ గ్రుంకితివి? సత్యము చెప్పుము. లేకున్న మదీయశాపానలంబునఁ దగ్ధుండవయ్యెద వని మహోగ్రుండై పలికెను. అప్పు డేక

దనమాయవేషములు సాగవని యెంచి, మార్జాలరూపమును ద్యజించి శరీరధారినై మహాత్మా! నే నింద్రుండను. అజ్ఞానంబునం జేసి తమయాజ్ఞ నెఱుంగక యిందు స్నానం బాచరించితి, నింతటం దమరు కోపోద్రేకంబున వచ్చుచున్నారని విని భయమంది బిడాలరూపమును ధరించితి. స్వామీ! అపరాధిని నన్ననుగ్రహింపుం డని గౌతముని చరణ కమలముల కెఱగెను.

గౌతముండును నంత యాలోచించి, ఓరీ శక్ర! నీవింకను అసత్య మాడుచున్నావు. ముల్లోకములలోని జీవకోటుల హృదయములలోని భావములు నా యాత్మముకురంబునం బ్రతిబింబరూపములై నాకుం గనంబడును. నీ వే యుద్దేశమున బుణ్యవాహినియైన గంగ యీ ప్రాంతమున నుండ నిందులకు వచ్చితో తెలుపు మని మఱల నడిగెను.

శతమఖునకు నోట మాట రాలేదు. గౌతముండు తన యమంగళభావమును గుర్తెఱింగినాం డని గడగడ వడంకుచు స్వామీ! చిత్తము; నా యపచారమును క్షమించుండు. నా హృదయమున నహల్యారాగాంకురము మొలిచిన మాట సత్యము. నే నందుకే యిందుల కరుదెంచితి నని గౌతమునికిం బునఃపునః ప్రణామంబు లాచరించెను.

గౌతముం డలిగి, యోరీ కామాంధుండా! నీ వే వస్తువుపై ననురాగముం గలిగి వచ్చితివో, అట్టి వస్తుసహస్రము నీ మేనెల్ల నిండుంగాక యని శపించి పొమ్మనెను.

అంతట నా కారణముంబట్టి లోకంబున నింద్రుఁడహల్యను సంగమించి శప్తుడైనాఁడని యొకకింవదంతి కలిగెను. ఆవదంతి శబ్దముయొక్క యుచ్చారణముఁ బ్రజలిసను తుదకాయపయశోలేశము గౌతమపత్నియైన అహల్యకుఁగూడ సంక్రమించెను.

అహల్య యేపాపము నెఱుంగకున్నను అహ్యల్యయను ప్రాసవ్యాజంబునఁ దనకుఁ గలిగిన యపవాదమునకు శోకించుచుండెను.

గౌతముండును దనభార్యకు రాఁగల పుణ్యలోకసుఖసంపదకు నిరోధమనితలంచుచు నేమి సేయుదునని యాలోచించుచుండెను. అంతలో గౌతమునకు దైవవశంబునఁ దన తేజంబున శరద్వంతుఁడను కుమారుఁ డుదయించెను.

గౌతముఁ డప్పుడు లోకోపకారములైన గ్రంథముల రచింపవలయునని యెంచి దురాచారపరాయణులకు సద్గతుల గలుగఁజేయవలయునని సమస్తసదాచారములను దెలుపు సూత్రములను ధర్మప్రశ్నములను రచించి యంతటితోఁ దృప్తింగనక త్రేతాయుగమునందలివారందఱు నాచరింపవలసిన కర్మలను దెలుపునట్టి గౌతమస్మృతిని రచించి ప్రచురపఱిచెను. అనంతరమునఁ దర్కశాస్త్ర మంతయు న్యాయనామముతో రచించి ప్రపంచమునకు విద్యాభిక్ష పెట్టెను. వ్యాకరణమును జేసిన పతంజలి యెట్టివాఁడో, అంతకు మించిన మహానుభావుఁడు. అనేక వత్సరములు భగవంతునిగూర్చియు జీవునిగూర్చియు

జగత్సృష్టివిధానముంగూర్చియు నాత్మశక్తిచేతను వేదార్థ విజ్ఞానసంపదచేతను చర్చించి చర్చించి తన యాత్మనేత్రమునకుం దోంచిన యాథార్థ్యములను లిఖించి ప్రపంచమునకు జ్ఞాననేత్రము నొసంగెను.

విద్యావిషయమైన చర్చ నంతటితోం జాలించెను. అప్పటికిని అహల్యావిషయమైన యపవాదము తొలంగలేదు. భర్తయొక్క భావము నెఱింగిన యహల్య మగనిని జేరి ప్రాణేశ్వరా! పుణ్యాగతులకు విరోధమైన యపవాదము మాయలేదు. లోకులు కాకులవంటివారు. లోకము గ్రుడ్డిది; కన్నులులేవు; బుద్ధిలేదు. కావున నా కేదో దండనముం గావించినం గాని యీ యపయశం బడంగదు. నే నీ కిల్బిషప్రపంచమును జూడంజాల; నన్ను శపించివేయుం డని పదంబులం బడెను.

గౌతముండును భార్యాయోగ్యతకు చాల సంతసిల్లి నిరపరాధిని లోకు లాడు మాటలచే శపింపవలసివచ్చినందులకు విచారించి, భద్రా! నేను భవిష్యదర్థంబును గనిపెట్టితిని. నీ యపయశోలేశము వాయుటకు శిలాకృతినిం దాల్చి యుండుము. శ్రీమన్నారాయణుండు రామనామముతో దశరథమహారాజున కుదయించి యీ మార్గమున మిథిలానగరమున కరుగుచుం దన చరణధూళిలవంబు సోకించి నీ శాపవిమోచనముం గావించును. నీ వప్పుడు నన్నుం జేరెదవు. నే నంతవఱకు హిమవంతంబునం దపోనిష్ఠతో నుండెద నని చెప్పెను.

అప్పు డహల్య శిల యయ్యెను. గౌతముఁడు హిమవంతంబున కేఁగెను. శతానందుఁడు మిథిలానగరమున జనకు నాశ్రయించి యుండెను. శరద్వంతుం డొక యాశ్రమమునఁ దపోనిష్ఠలో నుండి కృపాచార్యకృపులఁ గాంచెను.

కొద్దియో, గొప్పయో గౌతమాశ్రమప్రాంతవాసులైన మునులయు, మునిపత్నులయు నహల్యాపవాద ప్రసంగములు కట్టువడి వారి హృదయముల యసూయలు చల్లారినవి.

గౌతముండు తనభార్యయం దెంతమాత్రమును దోషము లేదని యెఱుంగును. పృథివ్యాదిపంచభూతములును సూర్యచంద్రాదిగ్రహములును నెఱుంగు నయిన నేమి? తత్ప్రాంతవాసుల యసూయ అహల్యాద్రోహవ్యాజంబున నా నాశ్రమస్త్రీపై నట్టి యపవాదము నారోపించినది.

గీ. కేవల మసత్యమైన శం ♦ కింపఁబడిన
యప్పు డా యపకీర్తి మా ♦ యంగఁ జేయు
ననుచిత మెవ్వారికైన దే ♦ కన్న దుర్య
శంబు కొండంత యగుచు సౌ ♦ ఖ్యంబు నడఁచు.

అను న్యాయముచే గౌతముం డహల్యను శపించెను.

ఈ శాపమువలనను అసూయాపరుల యారడివలనను అర్థద్వయము గల అహల్యాశబ్దమువలనను సాధారణముగాఁ బర్జన్యుఁడు అనుపయోగములైన బీడు భూములలోను సముద్రములను వర్షించు స్వభావము కలవాఁ డగుటచే

బర్జన్యాంశగల యింద్రునిగుఱించి "అహల్యాయైజారా" యని వేదములయం దుండుటచేతను, దాని వాస్తవార్థముం దెలిసి కొనజాలక అహల్యయం దట్లు శంకించి కొందఱు తమ గ్రంథముల యందును నట్లె లిఖించిరి. ఆ వాడుక యిప్పటికిని మాయకున్నది. విజ్ఞులు దీని వాస్తవార్థమును బరిశీలించెదరు గాక !

అనంతరమునఁ గొన్నిదినంబులకు శ్రీరామచరణపంకజ పరాగ కణము సోకి పాషాణత్వమును బాసి యహల్య హిమవంతంబున కేఁగి గౌతముని సేవించుచుండెను. కొలఁది దినములకు గౌతమమహర్షి బ్రహ్మయనుజ్ఞ వడసి సప్తర్షి మండలస్థానము నలంకరించెను. ఆ మహాత్ముని మనము కన్నులారఁ జూడకున్నను ఆయన రచించి లోకమున కొసంగిన న్యాయశాస్త్రమును జూచుచు దానిని బఠించి విజ్ఞులైన పండితోత్తములఁ జూచి యానందించుచునే యున్నాము.

---

## జమదగ్ని.

బ్రహ్మ జగత్సృష్టి సేయదలంచి, తొలుతఁ దన యవయవంబులనుండి సృష్టిచేసిన నవబ్రహ్మలలో నొకండగు భృగుమహర్షికి చ్యవనుఁడు, శుక్రుఁడు నను నిరువురు కుమాళ్ళు గలరు. అందు శుక్రునకు ఋచీకుండను విజ్ఞానసంపన్నుం డుదయించి తండ్రియైన భార్గవునిచెంత వేదశాస్త్రపఠనంబుఁ గావించి విద్యాపరిపూర్ణుఁడై యాధ్యాత్మికశక్తిప్రభావశ్రీయుతుఁడై

చిరకాలతపంబుఁ జేసి నిరంతరబ్రహ్మానందసామ్రాజ్యమును గాంచియుండెను.

అనంతరంబున భార్గవానుజ్ఞ వడసి, సర్వలక్షణసంపన్నయు, సురూపజ్ఞానవతియు, గాధిరాజదుహితయునైన సత్యవతి యను సాధ్వీమణిని బరిణయంబై, తపోవ్యాసంగమునఁ గాలము గడపుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు సత్యవతి భర్తకుఁ బ్రణమిల్లి మహాత్మా! ఏద్దానివలన స్త్రీజన్మ సార్థక మగునో, అట్టి అపత్యంబు నొసంగి నన్ను కృతార్థురాలినిగఁ జేయుఁ డని ప్రార్థించెను. ఋచీకమహర్షియు మనంబున దీర్ఘముగ నాలోచించి తనయత్తగారైన గాధిరాజభార్యకుఁగూడ సంతతి యొదవునట్లు సంకల్పించి, విప్రరాజమంత్రవితానముచే ప్రేల్పించి చరువుల నేర్పఱచి, ఇం దొకటి తనభార్యయైన సత్యవతికిని, రెండవది గాధిభార్యకు నని చెప్పి తాను స్నానము సేయఁ జనెను.

ఇంతలోఁ దనకు సంతాన మొదవునట్లు తనయల్లుఁడు చరువు నేర్పరచినాఁడని సంతోషముతో వచ్చి తల్లి యడుగ సత్యవతి తనకొఱకు విప్ర మంత్రయుతముగ ప్రేల్చి సమకూర్చిన చరువును దల్లి కొసంగి తల్లికొఱకు రాజ మంత్రతతుల ప్రేల్చిన చరువును దా భక్షించు సమయమున ఋచీకుఁ డరుదెంచి చూచి, యోసి యవివేకినీ! నీ చరువును నీ తల్లి కొసంగి నీవు నీ తల్లి చరువును భక్షించుచుంటివా! నీకుఁ గ్రూరుఁడును నీ తల్లికి బ్రహ్మజ్ఞానసంపన్నుఁడు నుదయింతు

ని నుడివెను. సత్యవతి యంతట భయాక్రాంతచిత్తయై పతిచరణంబుల కెఱఁగి యనుగ్రహించి నా పుత్రుఁడు సాధు చిత్తుఁడగునట్లనుగ్రహింపుఁడని వేఁడ, ఋచీకుండు ప్రసన్నుండై మానిని! నీకు బుట్టెడువాఁడు పరమశాంతుఁ డగును. గాని, ఈ చరువ్యత్యయదోషంబున నీ కుమారున కుదయించు పుత్రుఁడు మాత్రము సహజభూర్తుఁడు గాక మానఁ డని వచించెను.

కుమారున కట్టి ధార్ష్ట్యము లేకపోవుటకు సంతసించి మునుమునిపాఁటను దలంపక సత్యవతి యా చరువును భక్షించి యమితవిజ్ఞానసంపన్ను జమదగ్నిని బ్రసవించెను. అట గాధి రాజమహిషి విశ్వామిత్రునిఁ బ్రసవించెను.

చ. భ్రమరము చిత్తశుద్ధి
నితరంబగు పుర్వును దెచ్చి దానిపై
భ్రమణ మొనర్చి షట్పదము
భాతిగ మార్చి సుఖించునట్లుగా
శమదమయుక్తులై యలరు
సంయమివర్యులు బ్రహ్మనిర్ణయ
క్రమమునుగూడ మార్చఁగల
ప్రౌఢచరిత్రులు కారె ధాత్రిలోన్?

శుక్లపక్షక్షపాకరునిమాడ్కి దినదిన ప్రవర్ధమానుండై జమదగ్ని పితరుండైన ఋచీకునిచెంత విద్యాభ్యాసముం జేసి

వేదశాస్త్రరహస్యంబు లెఱింగి విజ్ఞానుండై తపమును జేసి బ్రహ్మను మెప్పించి వరంబులం బడసెను.

అట్లు తపస్సంపన్నుండైన జమదగ్నికి దన ముత్తాతయైన భృగుమహర్షి బ్రహ్మవలన దాను బడసిన కపిల యను కామగవి నొసంగెను.

అనంతరమున జమదగ్ని రేణువనువాని పుత్రికయగు రేణుకను బరిణయంబై యనేక వత్సరంబు లామెతోఁ గ్రీడా విహారంబులు సేయుచు వానప్రస్థాశ్రమమును స్వీకరించి వసుమనుఁడు మొదలగు కుమారులఁ గనియెను.

రేణుకాదేవి యంతటితో సంతోషింపక, యొక్కనాఁడు పతికెదురుగ నిలిచి, ప్రాణేశ్వరా! జగన్నాథుండు నారాయణుండు నా గర్భమున నుదయించునట్లు తపంబు జేసెదను. మీరు నాయెడ ననుగ్రహించి నారాయణాత్మకమైన మంత్రము నుపదేశింపుఁడని ప్రార్థించెను. జమదగ్నిమహర్షియు మిగుల సంతోషించి, కళ్యాణీ! నీ యాశయము సంస్తవనీయమైనది. ఏకార్యమునైనను దీక్ష వహించి యనుష్ఠించినచో సఫలము కాకపోదు. నీవు నిర్మలాంతఃకరణప్రవృత్తిఁ గలిగినదానవై నే నుపదేశించిన మహామంత్రమును జపింపుము; నీ యభిమతం బీడేరు నని చెప్పి నారాయణమంత్రమును భార్య కుపదేశించెను.

రేణుకయు మనోదీక్షకలదై యన్యచింతనమును మఱచి యోగనిరూఢచిత్తయై తపము సేయుచుండెను.

సుగుణవతియైన భార్య యుత్కృష్టపదవికొఱకుఁ బ్రయత్నించుచుండఁ దాను నామె కార్యమునకు సహాయపడినచో నుత్తమధర్మ మని తలపోసి జమదగ్నిమహర్షియుఁ దపంబు సేయ నారంభించెను.

ఇట్లు కొన్ని సంవత్సరము లతిక్రమింప నొకనాఁడు లక్ష్మీపతి జమదగ్నికిని రేణుకకును సందర్శన మొసంగి పుణ్యదంపతులారా! మీ తపంబులకు సంతుష్టిని గాంచితిని. కామ్యంబుల నర్థింపుఁడని సుప్రసన్నవదనకమలుండై పలికెను.

అప్పుడు రేణుకాజమదగ్నులు సంతుష్టహృదయులై హర్షోద్గళితపయోధారల రమాకాంతుని చరణకమలముల క్షాళనముఁ జేసి మస్తకన్యస్తాంజలిపుటులై దేవదేవా! మాధవ!

చ. అనుపమకాచపాత్రివివ ♦ గాంతరదీపిక బాహ్యసీమయుం
దును గుహారంబునన్ వెలుఁగు ♦ దోపగఁ జేసెడుభంగి లోక
జీవినిచయగర్భకోశముల ♦ వెల్గుచు నాత్మమయుండవై జగం
బునకు బహిర్గతుండవయి ♦ పొల్చురమాధవ! నీకు మ్రొక్కెదన్.

అని యా దంపతు లిరువురు సాష్టాంగనమస్కారములాచరించి, పరమపురుషా! పంకజలోచన! కించిజ్ఞు లిట్టి యభీష్టముల నభిలషింప నగునా యని గర్హింపకుము. మహోన్నతపదంబు లెట్టి యల్పజీవులనైన లుబ్ధులజేయఁ గలవు. నీకు జన్మమరణములు లేవు. అనాదిపురుషుండవు, నాశ్రితరక్షణబిరుదాంకుఁడవు నగుటచే మాప్రార్థనములసాదరముగనాకర్ణించి నీవు మాకుఁ బుత్రుండవై జనించి మా యభిమతముల దీర్పుము.

నీవు తలంచినఁ దృణము మహామేరుతుల్యంబగును. స్వామీ! జగత్పరిపాలనకర్త! రక్షించు మని పునఃపునఃప్రణామంబుల నాచరించిరి.

విష్ణుండు నా దంపతుల యత్యభిలాషకు నానందించి దంపతులార! భువనపవిత్రమైన మీ వంశమునం దుదయించుటకు నాకు సంశయము లేదు. మీకుఁ గుమారుఁడనై యుదయించి మీ యానందమును దీర్చెద నని యభయ మొసంగి యంతర్హితుండయ్యెను.

జమదగ్నియు రేణుకయు మహానందభరితులై నారాయణాంశజు నెప్పుడు కనులారఁ గాంతుమా యని క్షణకాలము వర్షసమముగా దినములు గడపుచుండిరి.

అనతికాలమున రేణుక గర్భవతియై పదియవ మాసంబునఁ బరిశుద్ధలగ్నమునఁ గుమారచంద్రుని ప్రసవించెను.

అట్టి పుణ్యసమయమున దివ్యులు పుష్పవర్షములఁ గురియించిరి.

ఆ కుమారసింహుండు సర్వజనుల నానందపరచుటం జేసి రాముఁ డను నామధేయము నునిచి, యా బాలకుని లీలావిలాసముల కానందించుచుండెను.

కొంతకాలమునకు రాముఁడు ప్రాజ్ఞుండై గండ్రగొడ్డలి నొకదానిని జేపట్టి కాష్ఠముల నడికి తెచ్చుట కడవికేగుచుండెను. జమదగ్ని యొకనాఁడు తపంబును నిర్వర్తించుకొని పత్ప్రాంతమున కరుగ నొక్క వృక్షముక్రింద కూర్చొని పవనా

ములచే మిక్కిలి కృశించిన కార్తవీర్యార్జునుం డను మాహిష్మతీ వాధునిజూచి దయారసంబు గలవాండై మహారాజా! ఆస్థానసార్వభౌమా! నీవును నీ పరివారంబును నేకారణంబు ననో మిక్కిలి యలసియున్నారు. నా యాశ్రమంబున కరు దెంచియు మీ రిట్లుండుట నాకు విచారకరము. కావున మీ యుపవాసమును నా కెఱింగించి నా యిచ్చు నాతిథ్యమును స్వీక రింపుఁ డని పలికెను.

కార్తవీర్యుండును జమదగ్నికి నమస్కరించి మహాత్మా! మృగయావిహారార్థ మరుదెంచి మిక్కిలి యలసి యుంటిమి. నిన్నటి దినమున సాయంకాలమునుండి మాలో నెవ్వరికిని భోజనము లేదు. మీ రిప్పుడు మమ్మాదరించినందు లకు సంతోషమే కాని మీకు శ్రమ కలుగు నని సందేహించు చున్నా నని పలికెను.

జమదగ్నియుఁ దద్భారమును నాకుఁ గలుగకుండ మా హోమధేనువు సేయలేదా యని మనోధైర్యముతో రాజా! నీ వంపులకు సందేహింప వలదు. మీ యందఱి కోఱకుఁ బిరువాత మా శిష్యుల నంపెదను. నిలిచిపొం డని చెప్పి తన యాశ్రమమునకు వెడలిపోయి కపిలచెంత కరిగి దీనాననుండై నిలిచెను. జమదగ్ని యదివఱ కెన్నఁడును కపిల వలన హోమద్రవ్యసంభారములనే కోరుచుండువాఁడు కాని యపారభోజనపదార్థముల నెన్నఁడును గోరియుండని కారణంబున నిట్టి మర్భరకార్యము నెఱవేఱునా యని లోలోనఁ

దల్లడిల్లుచునే యున్నవాఁడు. దుస్తరమైన తన కోర్కె కపి-
లతోఁ జెప్పు టె ట్లని సంశయించుచు నిలిచెను.

సర్వాభీష్టప్రదాయినియైన కామధేనువునకు జమ-
దగ్ని మనోగతభావంబుఁ దెలిసికొన దుస్తరము కాదు.
అయిన నాతనినోటఁ బలికింపవలయు నని తలంచి ఓబ్రహ్మ ! జమ
దగ్ని! నేఁడేల యిట్లు దీనాననుండ వైతివి? తపోబలంబున నారా
యణుని గన్న పుణ్యపురుషుఁడవు, సత్యవ్రతశీలుఁడవు. నీ యభీ
ష్టములఁ దీర్ప నటు లక్ష్మీకళతుల్యుండను నాశ్రమమున
నేనును గలుగ నీకీ విచారమేల ? నీ వగపునకుఁ గారణంబు
దెలుపు మని యడిగెను.

అయితే, గోవు మాటాడునా యని కొందఱికి సందేహ
ముండవచ్చును. గోమహిషాదులు కశ్యపుని భార్యయైన సుర
భికి జనించిన వని వెనుక వ్రాసియుంటిని; కాని వాటి సామర్థ్య
మెట్టిదో వివరించియుండలేదు. కావున నిప్పు డా సందేహ
మును దీర్చెదను.

ఉ. సారసపత్రనేత్రములు ♦ జక్కని శ్రీవదనంబు, గాంతి వి
స్తారపు మేను, నాలుగు ప♦దంబులు,బుచ్ఛము వెన్కనున్నదం
భోరులఁ బీవరంపుఁబొదు ♦ వొప్పుచునుండఁగ నెల్లవారికిన్
గోరిక లిచ్చు కామగవి ♦ కోమలవాక్యవిశేష వచించు జే:

తల్లీ ! సపరివారుండనైన నా కాతిథ్య
మొసంగఁ దలఁచి సమర్థింపు మని నిన్ను వేఁడుకొను
చున్నాఁడను. నీవు లక్ష్మీదేవియంశమువలన సముద్భవించినదా-

నవు. నీ కసాధ్య మేదియు లేదు. నేఁడు నాయందు నీ కృపారసము నెరజల్లి నన్నుద్ధరించు మని జమదగ్ని ప్రార్థించెను.

మునీంద్రా! అందులకై నీవు సంకోచింపఁ బనిలేదు. నా కెన్ని కోటులైనను మృష్టాన్నములచే సంతృప్తిఁ గావించెద ననెను. అంతట జమదగ్ని శిష్యులఁ బంపి యర్జును నాహ్వానించెను.

కృతవీర్యుండు సేనాసమూహములతో కపిలాకల్పితములైన సరస్సుల స్నానంబుల నివర్తించుకొని వచ్చి సకలవిధ భక్ష్యభోజ్యసరసాన్నతక్రాదులచేఁ బూరింపంబడిన స్వర్ణ రాజతపాత్రంబులఁ జూచి యాశ్చర్యపడి కడుపార మంత్రులతో భుజించి, తాంబూలాదుల స్వీకరించి సంతుష్టినంది, మునీంద్రా! మీచెంత నున్న కపిలను నే నభ్యర్థించుచున్నాను. కావున నా కోరిక నెరవేర్పుఁడని కోరెను.

జమదగ్నియు నిరంతరమును నాకుఁ గామ్యంబులగు హవ్యకవ్యముల నొసంగు కామధేనువును నీవు యాచింపరాదు. నేనొసంగరాదు. రాజా! నావంటిముని క్షత్రియునకా దాన మొసంగుట? చాలు జాలు నిట్టి యపసవ్యపు గోరికను గోరకు మని వచియించెను.

దురాగ్రహగ్రస్తుండై యర్జునుండు నేను కోరుటయు నీవు వలదనుటయునా? సమర్పించెదవా లేకున్న బలిమిని గొంపోమ్మనెదవా? యని కన్నులెఱ్ఱజేసి తనయధికారమును జూపించెను.

జమదగ్ని యా రాజు వాక్యము లాలించి మితిలేని కోపంబున మూర్ఖాత్మా! అమంగళకార్యాచరణ తత్పరుఁడ వైనను నా యింటి కతిథి వగుటచే నిప్పుడు మదీయశాపాన లంబున భస్మీభూతుని సేయక విడచితి నీకనైన బుద్ధిగలిగి పొమ్మని తృణీకరించెను.

అర్జునుం డా మునిపరుషవాక్యముల కలిగి సర్వసేనలకు రణమున కాజ్ఞ నొసంగి జమదగ్నిని గొండఱు బంధించి కొంద ఱా కపిలను దోడ్కొనిరం డని యాజ్ఞ నిచ్చెను.

సైనికులు కొంద ఱేఁగి కపిలను పట్టి తోడ్కొని వచ్చు టకుఁ బ్రయత్నింప నదియు వారిని శృంగనిహతులఁ జేసి జమ దగ్ని సమీపమున కరుదెంచి మునిచంద్రమా! ఈ దుష్టులు నన్ను బల్మిఁ గొనిపోవ నుంకించుచున్నారు. నీ యాజ్ఞ యైనచో మహావీరులఁ బ్రసవించి వీరిని దుడముట్టించెద నని పలికెను.

జమదగ్నియు భయాకులితచిత్తుఁడై తల్లీ! సురభీ! నీచే సృజింపబడిన సేనలు వారల నిర్మూలింపఁగలవు. దుర్మార్గులై నన్ను గూడ నిరోధించినచో దివ్యాస్త్రముల నెఱుంగని నే నశక్తుఁడ నగుదును. కావున నాకును గొన్నింటిని పరదుస్సా ధ్యములైన మహనీయదివ్యసాధనములఁ బుట్టించి యనుగ్ర హించు మని వేడుకొనెను.

కామగవియుఁ దనయవయవములనుండి యనేకకోట్ల శూరులను బుట్టించి యుద్ధమున కనిపి తరువాత దివ్యాస్త్రము లను గని జమదగ్ని కొసంగి కుమారా! ఈ సాధనములు నీ వే

శస్త్రముల నభిలషించిన నా శరములై శత్రునాశనమును సేయఁగల వని చెప్పి తననివాసగృహంబునకుం జనియెను.

కపిలోద్భవవీరుల కోడి యర్జునసేనలు పలాయితము లగుచుండెను. కృతవీర్యుండు మదాంధుండై తన సేనల దుస్థితి నైనఁదలంపక జమదగ్నిని ముట్టడించెను.

జమదగ్నియు, రాజా! నేను నీతో యుద్ధము సేయ సంసిద్ధుఁడనై యే యున్నవాఁడను. కాని నీతో ముందుగ గొన్ని మాటలఁ జెప్పవలసియున్నది వినుము; తరువాత రణము సేయుదము.

చం. కడుపునబుట్టి యేవనప్పుఁ ♦ గల్మిని గన్నులకావరంబునన్
జెడుగుతనంబుచే జనని ♦ చెల్వపుసౌఖ్యము గోరునట్లుగా
గడుపగలంగ మెక్కి కను ♦ గానక మాయకసత్తపఃఫలం
బడుగుటె పాపహేతువుదు♦రాత్మ!రణంబునుగూడ సేతువే?

మఱియు నీ శౌర్యపరాక్రమాయుర్ధనంబు లన్యాయమార్గవహ్నిచ్ఛటలచే నంతరింపంగలవు. కావున విజ్ఞానివై మఱలి పొమ్ము; లేదేని సంగ్రామ మొనరింపు మని పల్కెను.

గర్వాంధుండైన కార్తవీర్యార్జునుండు జమదగ్ని వాక్యములకుఁ బ్రత్యుత్తరము దివ్యాస్త్రములచేతనే యొసంగెను. కాని మాటలచే నీయఁడయ్యె. తుదకు సమర మతి భయంకరముగ జరిగెను. జమదగ్ని కపిలాప్రదత్తములైన మహనీయసాధనములఁ బ్రయోగించి మాహిష్మతీంద్రుని

రథసారథితురంగంబులు రూపుమాపి యతని భూమిపై మూర్ఛిల్ల జేసెను. హతశేషు లగు సైనికులు యథాయథలైరి.

అప్పుడు జమదగ్ని కరుణారసమున మునిఁగిపోయి కట్టా! రాజహంతకుఁడ నైతినే యని శవముల మధ్యమున నోడలెఱుంగక వివశుఁడై పడియున్న యర్జునుని చెంతఁ జేరి తన కమండలూదకములఁ జల్లి సేదతీర్చుచు నీ మహీపాలుఁడు త్రికశుద్ధిపూర్వకములైన మదీయామోఘాశిషంబులఁ జైతన్యమును గాంచి స్వస్థచిత్తుం డగుఁగాక యని దీవించి యుత్తరీయాంచలమున విసరుచుండెను.

కార్తవీర్యుండును నొక నిట్టూర్పు విడిచి మెల్లనఁ గనువిచ్చి తనకు బరిచర్యసేయుచున్న జమదగ్నిం జూచి సంత త్రపను వహించి, యాతని కరుణావిశేషమునకును సాధు స్వభావమునకును నాశ్చర్యమందుచు లేచి చాలు నిఁక నీ యుపచారము లని పల్కెను.

జమదగ్నియు సహస్రబాహుని పునర్జీవిత్వమునకు నాత్మలో సంతోషించుచు మహీవల్లభ ! అహంకారము నిప్పటికైన విసర్జించుము. జన్యంబున జయాపజయంబులు పురుషకోటికి స్వాభావికములు ; జయమునకు సంతసించుటయు, నపజయంబునకు విచారించుటయు మూఢులమతములు. కాలం బసాధ్య మైనది. మానవుని యాత్మసత్త్వముయొక్క పారిశుద్ధ్యమునుబరీక్షింపఁ బరమేశ్వరుఁడు మనమీఁదికి మర హంకారగ్రహమును బ్రయోగించును ; మన మద్దాని తత్త్వము

నెఱుంగఁజాలక దానికి వశులమై పౌర్వాపర్యములఁ బరిశీలింపక యుక్తాయుక్తముల గణింపక కోపగ్రంథిలోఁ జిక్కువడి యగ్నుల గుఱియగుచుందుము. మహారౌరవనరకములకు మూలకందమైన యాగ్రహమును విజ్ఞానులవలంబింపరు. నీవు సత్కులీనుఁడవు. భగవత్ప్రసాదసంభరితుఁడవు. మహామహీతల సామ్రాజ్యచక్రవర్తివి. ధర్మతత్పరుండవు. యశఃకీర్తి విభూషణుండవు. యాచకకల్పశాఖివి. నీవంటి వసుంధరారమణుండు మాబోంట్టి తాపసజనుల యభిమతములఁ దీర్చుచు మా తపంబుల కంతరాయములు కలుగకుండ సంరక్షించుట రాజధర్మము. ధర్మపరులకు దయ, క్షమ, శాంతి, దాంతి, పరహితబుద్ధియు ననుసరణీయములు. అట్టి యోగ్యగుణుడైన కెన్నఁటికిని నపజయమును దుఃఖమును రాజ్యచ్యుతియుఁ గలుగనేరదు. తామస మనుజుఁడు గృహస్థుని శోకవారాన్నిధిలో ముంచి వేయుటకు గుండువంటిది. ప్రాణసస్యమును మొదలంట మేసి వేయుటకుఁ జీడపురుగువంటిది. కావున నీ వా భయంకర శత్రురూపమైన క్రోధదేవతను దూరమునకుఁ బారద్రోలుము. ఎవ రెట్టి పుణ్యకర్మలను జేసికొందురో, అందులకుఁ దగిన ఫలముల ననుభవించెదరు. మనుష్యకృత్యముచేఁ బరధనములఁ దన వశముఁ జేసికొనవలయు నని ప్రయత్నింపరాదు. తాదృశ సంపద ననుభవింపవలయునని యభిలాష యుండినచోఁ దపస్సంపన్నత్వముం గాంచినచో నభిమతములఁబడయఁగలవు. కావున నా తపఃఫలంబైన కామగవికొఱకై యాశపడకుము. కావలసియున్న నీవును దపంబుఁ జేసి పడయుము. నే నిట్లు

గపిలానుగ్రహంబున సంపాదింపఁబడిన పీయూషసదృశములైన భోజ్యవస్తువులచే నాతనికి విందు గావించెను.

కార్తవీర్యున కా దివ్యాన్నము విషప్రాయమైనది. దురభిమానజ్వరము ప్రకోపింప నావహించినది. విధి లేక యమ్మహర్షితో నసంబద్ధములైన మాటల నొకటిరెండుమాత్రము మాటాడెను. దేహమునకు నుంత శక్తి కలిగినది. తనతో వచ్చిన పరిజనుఁ డొక్కఁడును గానరాలేదు.

గీ. కమిలి కలిగినవఁ జేకె నె ♦ చ్చెలుల రాక,
కలిమియు బలంబు నడిగినఁ ♦ గానఁబడరు;
ధరణి సౌజన్యలక్ష్మియు ♦ ధైర్యశక్తి
నరులకు సహాయమగుఁ గాని ♦ యొరులు కలరె?.

అట్టి విపత్సమయమున నర్జునునకుఁ దనగర్భశత్రువైన జమదగ్ని వినా తనసహచరుఁ డొక్కఁడునుఁ దన్ను నాదరించువాఁడు కానఁబడలేదు. వారి ప్రాణములను దక్కించుకొని వా రందఱును మాహిష్మతికిఁ జేరిరి.

అట్లయినను తనహృదయము జమదగ్నియొక్క కపిలాప్రభావవిషయమైన అసహిష్ణుత్వముచే గ్రసింపఁబడిన దగుటచేఁ దన యనుచరుల యవగతము తోపలేదు. ఆ సమయమున జమదగ్ని తనవిషయమై చూపిన సానుభూతికిఁ దగినంత భక్తివిశ్వాసములలో సహస్రాంశమైన నర్జునుం డెచ్చూపింపక, అయ్యా! పురమున కేఁగెద నని చెప్పెను.

మహానుభావుఁడును, నిర్వికారుండును, పరమ శాంతస్వభావుండును, దయారసమూర్తియు నగుటచే జమదగ్ని

పూతని హృదయ మింకను నిర్మలము కాలే దని యోజింపక, ఆత్మసమమిత్రుని విశ్లేషభారమునకు సహింపలేనట్లు కృతవీర్యుని గాఁగిలించుకొని, వత్సా! పోయెదవా? నీ వింకను నవ్యోత్తుఁడవై యున్నావు. రెండు దినములు నిలుపు చేసికొని పోవుట నా యభిమత మని త్రికరణశుద్ధమైన మనంబుతో వగచెను.

అత్తఱి నింట వసించిన ప్రియసఖులందఱును జమదగ్నిని "సాధుసాధు మహాభాగ" అని వేనోళ్ల సంస్తుతించిరి.

సీ. దాత దాత యనంగ ♦ దను జన్మమిచ్చిన
వాని రక్షించిన ♦ వాఁడె దాత
కాసున కైనను ♦ గతిలేని వానికి
ఋణ మొసంగిన యట్టి ♦ ఘనుఁడె దాత
ఆఁకటఁ గృశియించి ♦ నట్టివానికిఁ దన
యన్నంబు వెట్టిన ♦ యతఁడె దాత
పరుస కాత్మశరీర ♦ పలలఖండమ్ములఁ
దఱిగియిచ్చిన ధన్య ♦ తముఁడె దాత
గీ. ఆత్మప్రాణముఁ దీయఁగ ♦ నడుగు రిపున
కసువు లొసఁగిన మనజమ ♦ దగ్ని దాత
సంశయించుచు దాన మొ ♦ సంగి పిదప
వగచువాఁ డొక దాతయే ♦ జగతిలోన.

కార్తవీర్యార్జునుఁడును పురమునకుఁ బోవక తీఱదని పలికెను.

జమదగ్ని యాతనిని నిండుప్రేమంబునఁ గౌఁగిలించుకొని వత్సా! పోయి రమ్మని పలికెను.

కృతవీర్యున కా పుణ్యపురుషుని సమాశ్లేషణము వహ్నికీలల నాలింగన మొనర్చుకొనినట్లు సంతాపభాజనం బయ్యెను.

క. జ్వరపీడితునకు నమృతము
గరళప్రాయముగ నాలు ♦ కకుఁ దోఁచు క్రియన్
దురితుఁడగు రాజునకు ముని
వరునాలింగనము వహ్ని ♦ వలె దుస్సహమై.

కార్తవీర్యార్జునుండు తనపురమునకు వెడలిపోయెను. జమదగ్నిమహర్షియు యథాప్రకారంబుగఁ దపోనిష్ఠతో దినములఁ బుచ్చుచుండెను.

కృతవీర్యుండు తనశుద్ధాంతమునఁ బ్రవేశించెను. గాని జమదగ్ని నెట్లు వంచనఁ జేసి కపిలను గోషికెత్తునా యని యాలోచించుచునే యుండెను. ప్రతిక్షణమునను కపిలాపరిభావ మొక పెనుభూతమువలె బాధించుచుండెను.

మ. ఘనసారంబునఁ బూడ్చియుంచిన సుధా♦కల్లోలినిన్ముంచినన్
దన దుర్గంధమునుల్లి నుంతయును మా♦నంజాల దన్నట్లు క్రౌ
ర్యనిబద్ధాత్ములు బోధనామృతము న♦త్యంతంబు పానంబుఁ జే
సిననై ర్మల్యము బొందఁజాలవు కదా♦చిత్తాశ్మసంతానముల్

కార్తవీర్యునకుఁ గపిలాకాంక్షచే నాహారనిద్రలు దూరము లయ్యెను. జమదగ్ని తన్ను జేసిన పరాభవము మఱ

చెను. దురాగ్రహపిశాచము శిరోగ్రరంగస్థలమున నెక్కి తాండవ మాడుచుండెను. కార్తవీర్యార్జునుఁడు సహింపలేక విధిప్రేరితుండై యనేకసైన్యముల సమకూర్చుకొని తన గురువైన దత్తాత్రేయుఁ డొసంగిన దివ్యాస్త్రమంత్రమును బునశ్చరణముఁ జేసికొని హృదయమున శ్రీహరినిఁ దలంచుచు మఱల జమదగ్నిమహర్షి యొక్క యాశ్రమముపై దండెత్తి రణభేరిని మ్రోగించెను.

శిష్యు లందఱును బరువిడివచ్చి మహాత్మా! మఱల గార్తవీర్యార్జునుండు రణమునకు సంసిద్ధుఁడై వచ్చినాఁడని విన్నవింప జమదగ్నిమునియు నిట్టి దుర్మద మెందును గాన లేదని నవ్వి, కపిలచెంత కేగిఁ తల్లీ! మఱల కార్తవీర్యుఁడు జవరమునకై వచ్చియున్నాఁడు. వేవేగ మహావీరులఁ బ్రసవింపఁ జేసి నాకు సహాయులఁగాఁ బంపు మని ప్రార్థించెను.

కపిలయు వాని త్రపాహీనత్వమున కాశ్చర్యము నంది భార్గవా! క్షీరముల నురగంబులకు నారగింపఁజేసిన గరళత్వమునే కాంచినట్లు నీ కరుణారసము కార్తవీర్యార్జునునకు దుర్మదం బభివృద్ధిఁ జెందుటకుఁ గారణంబైనది. భూమిసురులు సహజశాంతులును, కరుణామయస్వాంతులు నగుటచేతనే సంగ్రామకార్యానర్హు లని నిర్ణయింపఁబడినారు. రాజులు కఠినస్వభావులును, కరుణాశూన్యులు నగుటచే దుష్టసంహారమునకు నియోగింపఁబడినారు. అందుచేతనే పాత్రాపాత్రవివక్షతఁ దెలిసి దానముఁ జేయవలయు నందురు. రాజు విషయమై నీ

కీ ప్రదానము నీకు దుర్వారశ్రమమును గలిగించుటకుఁ గారణమైనది. నే నిప్పుడే నీసంతానమును గాంచి సహాయులఁగాఁ బంపెద నని చెప్పి యసంఖ్యులైన మహాయోధులఁ బుట్టించెను.

క్షత్రియసైనికులును రాజసైన్యంబులమీఁదఁ బడి హాహాకారని బోరుచుండిరి.

జమదగ్నియుఁ గపిలాదత్త దివ్యాస్త్రసముదయంబును స్మరణకుఁ దెచ్చికొనుచు జని కార్తవీర్యుని బొడివి భయంకరముగ సంగ్రామము సేయ నారంభించెను.

అట్టిసమయమున జమదగ్ని పూర్ణాహుతులఁ గొన్న వైశ్వానరుని కరిది దుస్సహతేజుండై ప్రళయకాలరుద్రునిభాతి దున్నిరీక్ష్యుండై శిలీముఖంబులఁ బుంఖానుపుంఖములుగఁ బఱపించుచు నరేంద్రుని హృదయపీఠిక నగలించుచుండెను.

అట్టి సమయంబునఁ గార్తవీర్యార్జునుండు—

చం. రహి నొకవేయొదువందల
కరంబులచే దృఢచాపరాజముల్
గ్రహణ మొనర్చి తక్కిన
కరంబుల దివ్యశరాళిఁగూర్చి భూ
ర్యహమికచే రుషానల
మహార్చులనీను మునీంద్రుమీఁద దు
స్సహమగు వర్షమట్లు వెలుచన్
గుఱిపింపఁగసాఁగె నుగ్రుఁడై.

జమదగ్నియు మహీపాలప్రయుక్తమైన యాగ్నేయాస్త్రమును వారుణాస్త్రముచేతను, మారుతాస్త్రమును గాంధర్వాస్త్రముచేతను, నాగాస్త్రంబును గారుడాస్త్రముచేతను, శతభానుసమప్రభంబైన మాహేశ్వరాస్త్రంబును త్రిలోకవ్యాపకంబైన వైష్ణవాస్త్రముచేతను నివారించి, నారాయణాస్త్రంబును బ్రయోగించెను.

అయ్యది రోదసీకుహరం బంతయు నిండిన జ్వాలలతో వచ్చుచుండ గత్యంతరము లేక కృతవీర్యుఁడు ధనుర్బాణంబులఁ ద్యజించి రథావతీర్ణుండై యంజలి ఘటించి నమస్కరించుచు "నమో నారాయణాయ" అని జపించుచు నిలిచెను.

నారాయణుం డాశ్రితవత్సలుం డగుటచే నమస్కరించిన వారిని నశింపఁజేయని వాఁ డగుటచే నాయస్త్రము చల్లారెను.

అనంతరమున జమదగ్ని నవ్వుచు, రాజా! నాయస్త్రమునకు నమస్కారము వినా, నీకన్యశరణంబు లేకపోయెను గదా! సరే! ఈ యస్త్రమున నీవు పంచత్వము నొందఁగలవని జృంభణాస్త్రమును బ్రయోగించెను.

కార్తవీర్యుం డా మహనీయసాధనప్రభావంబునఁ జేసి స్మృతితప్పినట్లు గాఢనిద్రాపరవశుం డయ్యెను.

రాజు పాటెఱింగి పలాయితు లగుచున్న మంత్రుల నందఱి నాగపాశబద్ధులఁ జేసి జమదగ్ని రణస్థలియందే వారల బంధించి తన తపోమహత్త్వంబున సహస్రబాహుని మేలుకొలిపెను.

రాజు మేల్కాని పట్టరాని దురాగ్రహంబున నొకశక్తిని జమదగ్నిపైఁ బ్రయోగించెను. కాని యమ్మహాశక్తియుఁ దపోధనుని శక్తిచేఁ దెగటారెను.

అంతట బ్రహ్మ యరుదెంచి వారిరువురను సమాధాన పఱచి రణమును మాన్పి యెవరి యాశ్రమములకు వారి నని పెను. కాని, కార్తవీర్యునకు మాత్రము పగ యంతరింపలేదు. మఱల వెంటనే యనేకకోట్లసైన్యములఁ గూర్చుకొని వచ్చి జమదగ్నిని ముట్టడించెను.

జమదగ్నియు మఱల జృంభణాస్త్రప్రయోగముఁ గావించి, రాజును, సర్వసైనికులను, మహామూర్ఛలో ముంచి యెనలేని యాపద వచ్చె నని శోకించుఁ గపిల నూరార్చి నీ ప్రదేశమునకు నీ వరుగు మని యానతిచ్చెను.

కార్తవీర్యుం డంతలో మేల్కాని మునిపై బ్రహ్మాస్త్ర మును బ్రయోగింప నాతఁడును బ్రహ్మాస్త్రముచే దానిని శమింపఁ జేసెను.

తన బ్రహ్మాస్త్రము వమ్మగుటచేఁ దపించుచుఁ గార్త వీర్యార్జునుండు భక్తిపురస్సరంబుగఁ దనగురునైన దత్తాత్రే యునకు నమస్కరించి యా మహానుభావునిచే నొసంగఁబడిన యొకమనుజునిమాత్రముఁ దుదముట్టింపఁ గలిగిన శస్త్రమును గైకొని, యున్మనస్కుండై యా యస్త్రంబున సమస్తదేవతల తేజంబును హరిబ్రహ్మేంద్రమాయా తేజంబులను ధార

వేసి జమదగ్నిపై విడువ నయ్యది మర్మాంగమై జమదగ్నిని మూర్ఛిల్ల జేసెను.

భార్గవుండు సమసె ననియుఁ దనకు జయము వాటిల్లిన దనియు సంతసించి కార్తవీర్యార్జునుండు దుఃఖాకులితయైన కపిలను దోడ్కొని మాహిష్మతీ పురమున కరిగెను.

భర్తపాటుఁ జూచి సహింపలేక మహాపతివ్రతయైన రేణుకాదేవి హాప్రాణేశ్వరా! యని విలపించుచు వచ్చి, హా రామా! భార్గవరామా! వేగ రమ్ము. నీ తండ్రిని గూల్చిన కార్తవీర్యార్జునుని వధింపు మని మొఱపెట్టెను.

ఆ సమయమున భృగురాముం డెచ్చటినుండియో వచ్చి తండ్రిదుస్థితి గాంచి శోకించి ఎట్టకేలకు ధైర్య మవలంబించి కార్తవీర్యార్జునబాహుకాంతారమును, గంతనాశంబును విస ళింపకుండ నా గండ్రగొడ్డలి విడువ నని చెప్పి యప్పుడే మాహిష్మతీపురమున కరిగెను.

ఇట్లు గొంతసేపటికి జమదగ్ని లేచి భార్య నోదార్చి యాశ్రమమున కరిగి తన పుత్రుఁడైన రాముఁడు శత్రుసంహార మున కేఁగె నని విని ఎట్లు జరుగునో యని కళవళమందుచుండెను.

అంతలో శాత్రవరక్తకలితశరీరుండైన రాముఁ డరు దెంచి వైరివధవృత్తాంతమును దండ్రికిఁ దెలిపెను.

జమదగ్నిమహర్షి చింతించి, వత్సా రామ! మహీపా లుండు కేవలమును విష్ణ్వంశసంభూతుండు. ప్రజాపాలన దక్షుండును ధర్మప్రతిష్ఠాపకుండు నైన రాజును జంపుట

విప్రుని జంపిన పాపము కంటె నధికంబు. కష్టా! క్షమాశూన్యుఁడైతివి. క్షమలేనివానికి ముక్తి దుర్లభంబు. కావున, తత్పాపపరిహారముకొఱకై నొక వత్సరము తీర్థసేవఁ జేసి రమ్మని యంపెను.

రేణుకయు, జమదగ్నియు నాశ్రమమున సుఖంబున నున్న యవసరంబున రేణుక భర్తృప్రేరితయై జలాహరణార్థ మొక సరోవరంబున కరిగెను.

ఆశ్రమమున జమదగ్ని యెంతసేపు కనిపెట్టుకొని యున్నను భార్య రాదయ్యె. తన కప్పుడు జల మత్యావసరమై యుండుటచేఁ దన భార్య యేమి చేయుచున్నదో యని దివ్యదృష్టిని ప్రసరించి చూచెను. మనమున నావేశ ముదయించెను. క్రోధరసంబు కన్నుల శోణపద్మములుగఁ జేసెను. రేణుక యెప్పుడు వచ్చునా యని మనంబు తహతహపడుచుండెను.

ఇంతలో రేణుక జలకలశంబును జంకను బెట్టుకొని ఆలస్యమౌటచే భర్త యేమి యాగ్రహించునో యని యడలుచు వచ్చి లోపల కరిగి యా కలశంబు నందు దింపెను.

దుర్భరమైన దురాగ్రహంబు హృదయకుహరంబును దహించుచుండ జమదగ్ని దురాత్మురాలా! రేణుకా! ఏమి చేసితి వని నిప్పులొలుకుచుఁ బలికెను.

రేణుకయు గడగడ వడంకుచు మహాత్మా! అపరాధిని. ఆ గంగయం దప్సరసలతోఁ జిత్రరథుండను గంధర్వుండు జల

కేళి సలుపుచుండుటచే నాలస్యమైనది. క్షమింపుఁడని పద ములఁ బ్రాలెను.

ఏమీ! గంధర్వసురాంగనాజలకేళి నీకు సఖీలాషమును గలిగించెనుగా? సరే, తత్ఫలం బనుభవించెదవుగాక! యని కుమారులార! ఇటు రం డని పిలచెను.

రాముఁడు వినా తక్కినపుత్రు లరుదెంచి జనకా! యేమిం యాజ్ఞ యని యడిగిరి.

ఓరీ! మీరు మీ తల్లియైన ఈ రేణుక కంఠంబును ద్రెంచుఁ డని యాజ్ఞ నొసంగెను.

వారును జనకా! క్షమింపుము, మాతృహంతకులము కాఁజాలని మని ప్రత్యుత్తర మొసంగిరి.

అంతలో నిదేమి యన్యాయ మని రాముఁ డరుదెంచి భయ మందుచు నెదుట నిలిచెను.

జమదగ్నియు రామా! నీ వీ క్షణంబ నీ సోదరుల తలలను నీ తల్లి శిరంబును నఱకుమని యాజ్ఞ నిడెను.

రాముఁడును తండ్రియొక్క తపశ్శక్తి నెఱింగినవాఁ డగుటచే, మహాప్రసాద మని బిరాన గండ్రగొడ్డలితోఁ దల్లి కంఠంబుఁ ద్రుంచి పరుగువారుచున్న భ్రాతలఁ బట్టి తలల విదళించి రక్తసిక్తపరశువుతోఁ దండ్రిచెంత కరుదెంచి నమస్కరించి పూజ్యుల యాజ్ఞ నిర్వర్తించితి నని మనవిఁ జేసెను.

జమదగ్నియుఁ గుమారుని జనకాజ్ఞాపరిపాలనమునకు సంతోషించి వత్సా! రామభద్ర! నాకు మనఃప్రియము నొనరించిన నీ కేమి కావలయునో చెప్పు మనెను. రాముండును తండ్రీ! నా తల్లిని నా సోదరులను బ్రతికించుము. నా కింతకంటె నన్యవరం బేమియు వలదని పలికెను.

మంచిది. సంతోషించితిని నీ యనుజన్ములతో నీ తల్లి జీవింపఁగల దని జమదగ్ని పలికెను.

రేణుకయు హతులైన కుమారులతో జీవించి భర్తకు నమస్కరించి మాతాపితరుల సమానభక్తితోఁ బూజించు రాముని గాఁగిలించుకొనెను.

ఇట్లుండ నొకనాఁ డాశ్రమమున నెవ్వరును లేని సమయమునఁ బితృవధామర్షంబునం జేసి కార్తవీర్యార్జునుని పుత్రులరుదెంచి యోగనిష్ఠితచిత్తుండైన జమదగ్ని తలఁద్రెంచి పారిపోయిరి.

రేణుక అత్యంతశోకంబునఁ బ్రలాపించుచుండ రాముండరుదెంచి పితరుని దునిమిన దుష్టరాజకుమారులఁ ద్రుంచి తద్రుధిరంబున బితృతర్పణముఁ గావింతు నని ప్రతిజ్ఞఁబట్టి వైకుంఠమునకేగి శ్రీహరియాజ్ఞ నువడసి వచ్చి యర్జునుపుత్రులనే కాక ధరణిం గల రాజకుమారుల నెల్ల దన పరశుధారచే ద్రుంచి తొమ్మిది రక్తపుటేఱులఁ బ్రవహింపఁజేసి తచ్ఛోణి

తంబున బితృతర్పణములఁ గావించి "యహంబ్రహ్మాస్మి" యను న్యాయమున నేనే బ్రహ్మ నని తన్నుద్దేశించి యాగంబుం గావించి ఋత్విజులైన కశ్యప బ్రహ్మాదులకు దానమొసంగిన వసుంధరాచక్రము నంతయు ధారవోసి, తండ్రి యుత్తమాంగ మును గళేబరంబుతో సంధించి బ్రహ్మనదియైన సరస్వతీ వాహిని నవభృథస్నానముఁ గావించి మేఘ విముక్తుండైన భాస్కరుని వలె మించుచు దండ్రి తనువునుగూడ సరస్వతీనదీ జలంబున ముంచెను.

అప్పుడు జమదగ్ని మహర్షి పునర్జీవితుండై, కార్త వీర్యునికొఱకై శాంతమును గోల్పోయిన దోషమును వాసి యద్భుత తేజంబుతో నొప్పెను.

అప్పుడు బ్రహ్మాదిదేవతలు వచ్చి రామునిఁ గాని చూడక, జమదగ్నిని స్తుతించి, మానిచంద్రమా! నీకు సప్తర్షి మండలములో నొక స్థానము నొసంగినారము. నీవు నీ భార్యతోఁ జనుదెమ్ము. భార్గవరామా! నీవలన గావలసిన కార్యము లింకను గలవు. కావున నీవు భూమియందే తపోనిష్ఠతో నుండు మని చెప్పి, జమదగ్నిని రేణుకను సప్తర్షి స్థానమునకుఁ గొంపోయిరి.

# సప్తర్షులు.

## నాల్గవ భాగము.

### వసిష్ఠుఁడు

ఈ మహానుభావుఁడు బ్రహ్మమానసపుత్త్రులైన నవబ్రహ్మలలో నొక ప్రసిద్ధచరిత్రుఁడు. తన్ను గనిన తండ్రికి వశీభూతుండును, శిష్టుండునై వెలయుటంజేసి యీతనికి వసిష్ఠుండను నామము సన్వార్థమైనది. సమస్తవేదశాస్త్రవిజ్ఞానుండై ప్రభవించుటచే నీయనఘుండు వేఱే విద్యావిషయమైన చర్చ సేయవలసిన యవసరము లేకపోయెను. అనంతరము నఱువదివేల సంవత్సరము లఖండమైన తపముం గావించి పరమేశ్వరుని ప్రసాదంబు వడసి దివ్యజ్ఞానసంపన్నుండై ప్రజాసృష్టిని సేయందలంచి కర్దమప్రజాపతికి దేవహూతియందు ముదయించిన ఊర్జ యను సాధ్వీమణిని బరిణయంబై యామె యందుఁ జిత్రకేతుఁడు, సురోచి, విరజుండు, మిత్రుండు, ఉల్బణుండు, వసుభృద్ధ్యానుండు, ద్యుమంతుండు నను నేడ్వురపుత్త్రులఁ బడసెను.

ఈ వసిష్ఠుని భార్య అరుంధతి యని కొన్నిచోట్ల వివరింపఁబడి యుండుటచేఁ బాఠకులు సందేహింపవచ్చును. ఈమె కూర్జ నామధేయము ఊర్జశబ్దమునకు సన్నమని

యర్థముండుటచే నన్నప్రదానశీల యగుటచేతఁగాని, బలము నకుఁగూడ నర్థముండుటచే మిగుల బలిష్ఠమైన శరీరము గలిగియున్నదాటచేఁగాని వచ్చియున్నది. కాని, ప్రధాన నామధేయ మరుంధతి యను మాటయే నిశ్చయము.

మఱియు నరుంధతి భాగవతంబునఁ గర్దమపుత్రియనియు బ్రహ్మవైవర్తము మొదలగు కొన్నిటియందు దక్షపుత్రి యనియు, మనుస్మృతియందు "అక్షమాలా వసిష్ఠేన చండా లాధమయోనిజా" అనియు, మఱొకచోట "వసిష్ఠశ్చండాలీ మక్షమాలాం ప్రజాపతిః" యనియు జెప్పఁబడి యుండుటచే వసిష్ఠారుంధతుల జన్మప్రకారమునుగూర్చి లోకము సంశయింపవచ్చును. దాని యాథార్థ్య మిఁకముందు వ్రాయఁబోవు కథలో మా పాఠకులు తెలిసికొనఁగలరు.

ఇట్లు వసిష్ఠుం డూర్జనామధేయముంగల యరుంధతీ దేవితో వానప్రస్థాశ్రమము ననుసరించి తపంబు సేయుచుండెను.

అరుంధతీదేవి లక్ష్మ్యేకకళాంశసంభూత. ఆమెకును బ్రహ్మతేజోభవుండైన వసిష్ఠునకును గలిగియున్న మైత్రి యిదమిత్థమని వర్ణింప దుస్సాధ్యమైనది. ఆమె పతిభక్తి యనంతము. నిరంతర మా వసిష్ఠమునిచంద్రుని హృదయ కల్హారకర్ణికాంతరమునఁ బ్రతిష్ఠించికొని స్మరించుచుండును. వసిష్ఠుండును అరుంధతీదేవిని తనహృదయగోపురమునందలి మణిదీపికవలె సంస్థాపించుకొని యనురాగమునఁ బ్రవర్తిల్లు చుండును. ఈ పుణ్యదంపతులు ఛాయాప్రభాకరులకరణిని

జంద్రికాసుధాకరులభాతిని నిరంతర మొడబాయక యొక్క శరీరముగఁ బ్రవర్తిల్లుచుండురు.

ఇట్లన్యోన్యప్రేమతో నుండ నొకనాఁ డిక్ష్వాకు తనయుఁడైన నిమి యను రాజేంద్రుఁడు సర్వలోకగురుం డగుటచేతను, విశేషించి తమసూర్యవంశపురాజులకు గురువగుట చేతను, వసిష్ఠుని "యాగము సేయఁదలంచితిని. కావున, వచ్చి చేయించు" మని వర్తమాన మంపించెను. అనంతరమున నింద్రుఁడు యజ్ఞము సేయఁదలఁచితి ననియుఁ దక్షిణ మరుదెంచుఁ డనియు వర్తమానించెను. ఈ రెండుకార్యముల నొక్కసారి యెట్లు చేయించనగునని వసిష్ఠుం డాలోచించు చుండెను. యజ్ఞమహూర్తములింకను ఆలస్యముగనేయున్నవి.

ఇట్లుండ నా దినంబున నరుంధతీదేవి స్నానార్థము పుష్కరిణి కేఁగుచు జలంబులఁ దిరుగుచుండఁ దత్సమీప నికుంజమునఁ దపోనిష్ఠలో నున్న ముని యొకం డామెను జూచి పట్టరాని దురాగ్రహంబున, నోయువతీ! ఋతుమతివై నా సమీపముననుండి పోయి న న్నశుచిపఱచితివి. కావున, నీవు చండాల స్త్రీవగుమని శపించెను.

అంత నా యరుంధతీదేవి మహావాయువునకుఁ గంపించు మల్లెతీవకరణి వడఁకుచు మహానుభావా! మీ రిందుఁ దపోనిష్ఠతో నున్నట్లు నే నెఱుంగక తత్సమీపముననుండి వచ్చితి. నజ్ఞానజనితకార్యంబున కింతటి ఘోరశాపము నొసంగుదురా? రక్షింపుఁ డని ప్రార్థించెను.

కాని యీ క్రోధదేవతయైన మహర్షి, నా శాపము నీ వనుభవింపకతప్పదు; నీవు చండాలజాతివై నను బతిని ధ్యానించుచుం జేసి యనతికాలమున నా జన్మమును బాసి బ్రహ్మవంశమున జనించి పూర్వపుభర్తనే పెండ్లియాడఁగలవు. నీ భర్తయు జన్మాంతరమును గన్న నిన్నే భార్యఁగ దలంచుచు నన్యను వివాహమాడక మఱల నిన్నే వరించు నని చెప్పెను. దివ్యమంగళవిగ్రహయైన అరుంధతి యీ క్షణముననే యమంగళమైన చండాలరూపమును దాల్చెను. హరినీలంబులంబోలు కచభారము జుంజురు లయ్యెను. ఆమె వికారరూప మామెకే చూడ నసహ్యమై యొప్పెను. అట్టి పాపపు దేహముతో నవతరించిన శోకదేవతవలె వసిష్ఠునిచెంత కరుదెంచి దూరమున నుండి హా! ప్రాణేశ్వరా! రక్షించుఁ డని భూమిపై సాగిలెను. వసిష్ఠుఁ డామెను గాంచి తనభార్యయని గుర్తింపనేరక ఓ యభాగ్యురాల! నీ వెవ్వతెవు? నన్ను బ్రాణేశ్వరా! యని సంబోధించెద వేల? యని యడిగెను.

ఆమెయు మహాత్మా! నేను నీభార్య నరుంధతిని. సమీపమునసుండి వచ్చెకేఁగి, తన్నెఱుఁగిపరచితి నని యాగ్రహించి యొకముని నన్ను జండాలస్త్రీవి కమ్మని శపించె నని యావద్వృత్తాంతమును విన్నవించెను. వసిష్ఠుఁడప్పుడు మహాదుఃఖవారాశిలో మునిఁగిపోయెను. ఎన్నఁడును విచార మనునది యెఱుంగని విజ్ఞాని కీ సమయమున విచారసాగరము తలమున్కలయ్యెను; ధైర్యమును గోలుపోయెను; నిరంతరమును

పరబ్రహ్మావలోకనసంజనితములైన యానందబాష్పకణములు గుఱియు నమ్మహాత్ముని కనుదమ్ములనుండి దుఃఖవారి ధారాపాతముగ నెల్లెడఁ జొచ్చెను. చివరకెట్లో కనులఁ దుడిచికొని,

గీ. ఎందు నధికానురాగము ♦ క్రందుకొనునొ
దానికి విఘాత మొదవిన ♦ తఱిని దాని
కంటె బదిరెట్లు దుఃఖంబు ♦ కలుగు నందు
రకట! నా కది యనుగతం ♦ బయ్యె నిపుడు.

అని విచారించి ధైర్య మవలంబించి ప్రియురాల! నీ వాకతెవేకా వదృష్టహీనురాలవు. దర్శన కపవిత్రత కలిగి, నపుడు యూపముఃకూడ గళంకమును గాంచినటులె నా యర్ధాంగివైన నీ కిట్టి యేర్పాటు కలిగినప్పుడు నేను నభాగ్యుఁడనే. కాని కాలగతి దాటనెవ్వరికిని వశము కాదు. నీవు విచారింపకుము. త్వరలో దైవచింతనమున బునర్భవమును గాంచి మఱల నన్ను జేపట్టఁగలవు. నీవు నన్ను జేపట్టువఱకును నీవే నా భార్యవని యెంచుచు నిన్నే తలంచుచు నన్యసతినిఁ బాణిగ్రహణమును జేసికొనకుందు నని చెప్పెను.

అరుంధతియు మహాత్మా! నా ప్రార్థనయు నదే. మీరు వినా నా కన్యదైవంబు లేఁడు. నిరంతరమును మిమ్ముఁ గూర్చియే తపం బొనరించుచుండెదను. నే నచిరకాలమున మిమ్ముఁ గలిసికొనుటకు న న్నాశీర్వదింపుఁ డని వేడుకొనెను.

వసిష్ఠుండును తథావిధంబుగ నాశీర్వదింప నా యరుంధతి స్వామీ! నే నీ వేశ్యాప్రరూపమును భరింపజాల. నా కెట్లును

చండాలజన్మ తప్పును. తమరు చేసే యెన్ని సత్క్రియలను నన్ను భార్యగాఁ దలంపవలయు నని ప్రార్థించెను.

వసిష్ఠుండును ప్రియురాల! నీ వా విషయమున సందేహింపకుము.

చం. నలువవినిర్ణయంబున మ
నస్వినిగా నిను బెండ్లియాడి సుపు
త్రులఁ గని సౌఖ్యముం బడసి
ధూర్తుఁ డొకండు శపింప నాముచే
గలుషముఁ గన్నమాత్రమునఁ
గాంతరొ! నిన్విడనాడి వేఱు కో
మలి గ్రహియింతునే? యది య
మంగళకార్యము కాదె జ్ఞానికిన్?

నీవు లక్ష్మీకళచే నావిర్భవించినదానవు. ప్రాజ్ఞురాలవు. కాలాంతరమున నవతారాంతరములఁ దాల్చిన లక్ష్మి మఱల నారాయణాంశసంభూతునే పరిణయమైనట్లు నీవు నీ జన్మాంతరమున నైనను నా భార్యవే యగుదువు. ప్రకృతివిశిష్టంబైన బ్రహ్మంబుకరణి నీవు నన్ననుసరింపవలసియుండుట నీ ధర్మము. మఱియు మన యీ విశ్లేషము మన కిఁక ముం దధికమహత్త్వమును గలుగఁజేయుటకు సంప్రాప్తం బయ్యె నని తలంచెదను.

గీ. సౌఖ్యములు సంభవిలుట కష్టములకొఱకె
కష్టములు ప్రాప్తమగుట సౌఖ్యములకొఱకె
కాన మన కిట్టి విశ్లేష కష్టభరము
కల్గుట తలంప సౌఖ్యంబుఁ గాంచుకొఱకె.

కావున నీ యమంగళరూపమును యోగాగ్నిచే దహించి చండాలజాతియం దుద్భవించి నన్నే ధ్యానించుచుం గొన్ని దినంబుల కా తనువును ద్యజింపుము. అనంతరమున నీవు దక్షపుత్రికవై జనించి యరుంధతీ నామముననే నన్ను బెండ్లి యాడెదవు. మఱియు నీ వీ యక్షమాలను గైకొని దేహముం జాలించు మని యక్షమాల నొసంగెను.

అప్పుడు మహాప్రసాద మని యా యక్షమాలను గైకొని యోగాగ్నిచే నా యమంగళరూపమును దహించెను.

వసిష్ఠుం డామె పతిభక్తికి మెచ్చుచు నా సాధ్వి యగ్నిదగ్ధ యగునట్టి ఘోరకర్మకు శోకించెను.

గీ. ఎట్టి విజ్ఞానియైన మ ♦ జెట్టి క్రూర
కర్ముండైనను తన కుల ♦ కాంత వహ్ని
కీలలందునం బడి మగ్గ ♦ జాలిజెంది
భూరిశోకానలంబునం ♦ బొగులకున్నె?

అరుంధతి దేహము చాలింపంగనే వసిష్ఠుండు యజ్ఞార్థంబు దేవలోకమున కేగందలంచి యా జన్నమైనపిదప వచ్చెద నంతవఱకును వేచియుండుం డని నిమిచక్రవర్తికి వర్తమానించి నాకమునకుం జనెను.

ఇంతలో నిమి యీ వసిష్ఠుని వర్తమానమును విని యేమి సేయుటకును దోంచక యోజించుచుండ యజ్ఞార్థమరు దెంచిన తక్కిన మహర్షు లందఱును వసిష్ఠుండు రాకున్న యజ్ఞము మానెదవా? అంతియొకాక యరుంధతి శాపకారణం

బున జన్మాంతరమును గన యోగాగ్నిదగ్ధ యయ్యె నని నిమిని ప్రోత్సహించి మే మందఱమును నీ సవనముఁ జేయింపఁగలమని బోధించిరి.

నిమియు వారి ప్రబోధమునం జేసి యాగము ననుష్ఠించుచుండెను. ఆ దినముతో యాగము పూర్తియైనది. మహాత్ము లందఱి కిష్టదక్షిణ లింకను సమర్పింపలేదు. ఆ సమయమునకు వసిష్ఠుఁ డరుదెంచి యాగసమాప్తి యయ్యె నని తెలిసికొని దురాగ్రహాభూయిష్ఠుండై, ఓరీ మూర్ఖుఁడ! నేవచ్చువఱకును వేచియుండక యాగము నొనరించిన నీ దేహంబు ధరఁ ద్రెళ్ళు గాక యని శపించెను.

నిమియు రోషంబుతో, వసిష్ఠా! నా యాగంబునకు వచ్చెద నని తొలుత చెప్పి పిమ్మట నింద్రునిపై ని యభిమానంబున నతని యజ్ఞమున కరిగి, నా యుత్సాహమును భంగము సేయుటయేగాక నిరపరాధిని నన్ను శపించిన నీ దేహము భూపతితం బగుఁగాక! యని ప్రతిశాపం బొసంగెను.

అంత నా నిమివసిష్ఠు లచ్చటనే దేహత్యాగములఁ జేసిరి. కొన్ని దినంబులకు మిత్రావరుణులకు నూర్వశీ సౌంద ర్యావలోకనంబున బహిర్గతమైన తేజంబున వసిష్ఠమహాత్ము యుదయించి ప్రాచీనజ్ఞానసంపద కలవాఁడై యమ్మహాత్ముఁడు మఱలఁ దపోదీక్షచేఁ గాలంబుఁ గడుపుచుండెను.

ఈ పై కారణంబుననే పురాణములలో "ఊర్వశీగర్భ సంభూతో వసిష్ఠశ్చ మహామునిః" అని వ్రాయఁబడుటయు,

నీ వాక్యము ననుసరించి వసిష్ఠుండు నీచజాతియైన బోగపుకులమున నుద్భవించినాఁడని అప్రాజ్ఞు లాక్షేపించుటయు మాకొలమున వసిష్ఠుం డుదయించినాఁడని వేశ్యలు ముఱియుటయు సంభవిల్లినది. విజ్ఞు లీ వాస్తవతత్త్వార్థము నెఱుంగుదురుగాక!

ఇట్లుండ నరుంధతి యా దేహమును జాలించి తరువాత నొక పుణ్యుఁడైన చండాలునకుఁ బుత్రికయై జనించినది. ఆమె జన్మతోడనే కంఠమున నక్షమాలతో జన్మించుటచేత నా బాల కక్షమాల యని నామధేయ ముంచఁబడినది.

ఆ బాల సుగుణఖనియై విజ్ఞానవల్లియై తోడి బాలికల కెల్ల జ్ఞానోపదేశమునుం జేయుచు నా బాలికలకు సుగుణముల నలవడఁ జేయుచుండెను. చండాలు రందఱు నీమె మా కులమున మమ్ము రక్షింప నవతరించిన యాదిలక్ష్మి యని కొనియాడుచుండిరి.

గీ. చందననగంబు నింబవృ ♦ క్షములఁగూడ
సౌరభములీనునట్లుగా ♦ నలుపునట్లు
లక్షమాలయు నా పంచ ♦ మాంగనలను
జ్ఞానసంపదఁ గలవారి ♦ గా నొనర్చె.

ఇట్లుండ నా యక్షమాలకుఁ దలిదండ్రులు పెండ్లి చేసెద మని ప్రోత్సహించిరి. కాని యా బాల నేను పూర్వ జన్మంబున నరుంధతి ననియుఁ గారణాంతరమున శప్తనై మీ కులంబునఁ బొడమితి ననియు, నా భర్త వసిష్ఠుండును ఆ దేహమును బాసి మఱల మిత్రావరుణులకు నుదయించియున్న

వాఁడనియు నా మనోగతుఁడై నపతి యుండఁగా మఱల నన్యుని వివాహ మాడ నవసరము లేదనియు, నేనును కొలఁది కాలమున నీ జన్మనుండి విముక్తిని గాంచి ఋషివంశమున జనింతు ననియుఁ జెప్పెను.

అంతట వారందఱు సంతోషించి యా యక్షమాలను కులదేవతగా నారాధించుచుండిరి. ఈ కారణముననే చండాల జాతివారు అరుంధతి మా యింటియాఁడుపడుచనియు వసిష్ఠుఁడు మా యింటియల్లుఁడనియుఁ జెప్పుకొనుటకును బ్రహ్మద్వేషులు బ్రాహ్మణుల నాక్షేపించుటకును హేతువైనది.

వసిష్ఠుండు మిత్రావరుణులకు జనించుటయు, నరుంధతి యక్షమాలయై యుదయించుటయు మహర్షులు దివ్యులుగూడ నెఱింగిన యంశమే.

తరువాతఁ గొన్ని దినంబులకు నక్షమాల భర్తయైన వసిష్ఠుని మనంబునఁ దలంచుచు యోగమార్గంబునఁ బ్రాణంబుల బరిత్యజించి యనంతరమున దక్షపుత్రియై జన్మించెను.

ఆమె అరుంధతికళయే యని యెఱింగినవాఁడగుటచే దక్షుండా బాలిక కరుంధతి యనియే నామ మిడెను.

వసిష్ఠుండు తనభార్య దక్షతనయయై జనించిన దని యెఱింగి యామెను పరిణయంబై యామెయందుఁ గ్రమక్రమముగ నూర్వుర పుత్రులఁ బడసి యా పుత్రులనుగూడ దనంతటి తేజోవంతులఁ జేసి సంతతతపోనిష్ఠాగరిష్ఠుఁడై మహారాజులచేతను, మహేంద్రాదుల చేతను యజ్ఞ

యాగాది క్రతువులఁ జేయించుచు, వారల కెనలేసి ధర్మముల నుపదేశించుచు, నిరంతరలోకరక్షణపరతంత్రుఁడై, మహర్షులలోఁ జంద్రునివలెఁ బ్రకాశించుచుండెను.

గీ. ఆత్మవిద్యకుఁ దగిన యో • గ్యతను గల్గి
శాంతగుణుఁడయి లోకర • క్షణము కొఱకు
జీవయాత్రను జేసెడు • కోవిదుండు
పురుషులందునఁ జంద్రుని • పోల్కి మెఱయు.

గుణగరిష్ఠులలో వరిష్ఠుం డగుటచే వసిష్ఠుండు సర్వముని సురనరసంసేవ్యుండై ప్రతిభాశాలియై ప్రఖ్యాతిని బడసెను.

ఇట్లుండ నొకనాఁటి ప్రాతఃకాలమున ననుష్ఠానంబులఁ దీర్చికొని యున్నంతలో శిష్యులరుదెంచి, స్వామీ! విశ్వామిత్రుండు మన యాశ్రమసమీపమున సేనలతో విడిసెనని చెప్ప నంత నా సంయమితల్లజుం డాతఁడు విడిసినచోటున కరిగి, మహారాజా! నీవు కారణాంతరమున నెచ్చటికో యరుగుచు మా యాశ్రమమునవిడియుటచే మా కతిథివైతివి. కావున నీవు నీ పరివారముతో మా యిచ్చు స్వల్పాహారమును స్వీకరించి పోవు టుచిత మని యాహ్వానముఁ జేసెను.

కౌశికుండును బహుళసైన్యమున కాతిథ్యమిచ్చుట వసిష్ఠునకు శ్రమయని యంగీకరింప లేదు.

శ్రమలేదు; రాక తప్పదని బలవంతముఁ జేయుటచే విశ్వామిత్రుండు సమ్మతించెను.

వసిష్ఠుం డాశ్రమమున కరుదెంచి నిత్యముఁ దనకు హోమద్రవ్యముల నొసంగి రక్షించు శబల యను కామధేనువును బ్రార్థించి విశ్వామిత్రునకు విందుసేయుటకుఁ దగిన పదార్థముల ననుగ్రహించు మని ప్రార్థింప నా సురభి యట్లే యని పలికి సమస్తపదార్థములను రాసులఁగా గుప్పించి వారికి స్నానోపయోగములైన సరస్సుల నిర్మించి మృష్టాన్నముల నతిథులకు వడ్డించుటకు నర్హులైన పుణ్యాంగనలఁ బ్రసవించెను.

వసిష్ఠుని శిష్యులచే నాహ్వానింపఁబడి విశ్వామిత్రుఁడు స్త్రీలతోడను, పరివారముతోడను వచ్చి విందారగించి మహాసంతృప్తినిగాంచి వసిష్ఠుని వేనోళ్ళఁ బొగడి తమ యానందమును దెలిపెను.

వసిష్ఠుండు, వారి పొగడ్తల కావంతయు నుప్పొంగక భవాదృశల నాదరించుట నాకు విధ్యుక్తధర్మ మని ప్రత్యుత్తర మొసంగెను. విశ్వామిత్రుఁ డా తపోధనుని యవికత్థనత్వమునకును తమ కొనరించిన యద్భుతమైన విందునకును రిచ్చవడి తనమనంబున నెద్దియో యోజించి, మహాత్మా! తమ కే కామగవివలన మాకు విందొనరించితిరో ఆ శబలను నేను మిమ్ము యాచించుచున్నాను. బహుజనరక్షణభారము నా తలపై నుండుటచే నా కది ప్రాముఖ్యము. మీకుఁ గావలసి నన్ని గోవుల నొసంగెదను. నా కద్దాని ననుగ్రహింపుఁ డని యడిగెను.

వసిష్ఠుండు, వత్సా! విశ్వామిత్రా! నీవు నీ తండ్రి గాధిరాజు ననంతరమున రాజ్యమునకుం గ్రొత్తగ నభిషిక్తుండ వైతివి. ఊనుండవు; క్షత్రియధర్మంబుల నెఱుంగజాలవు. మహీవల్లభులు తమరాజ్యమున నెవ్వరికి నీతిబాధలు బొఱయ కుండం గాపాడుచు మాబోటి మహర్షుల తపంబుల కంతరాయములం గల్గించు దుష్టుల సంహరించుచు, భూమికి భారవాహకులైన క్రూరుల రూపుమాపుచుం బ్రశాంతిని ధర్మమును బ్రతిష్ఠించుట రాజుల కుచితధర్మము. అట్లు మాబోంట్లకు హవ్యకవ్యాదులకు నీవు సహాయపడక బ్రాహ్మణధనము నభిలషించుట మహాపాతకము. నీవు తెలియక యిట్లు కోరరాని కోరికను గోరితివి. మఱియు నృపాలురు దానపరులు కావలయు గాని దానగృహీతలు కాంగూడదు. అంతియెకాక మా కీ సురభివలన హవ్యకవ్యాదు లవిచ్ఛిన్నంబుగ జరుగుచుండును. అట్టిదానిని నీ వభిలషించుట బ్రాహ్మణకర్మల కంతరాయములం గలిగించిన దోషమునకు నంజలి ఘటించుట యగును. కావున నీ విట్టి కోరికను మాని పురంబున కరుగు మని శాంతవచనంబుల బోధించెను.

విశ్వామిత్రుండు డా యనఘుని వాక్యముల లక్ష్యము సేయక శబల నొసంగెదవా, లేదా? బలిమిని గొంపొమ్మని యెదవా? యని కోపంబుతోం బ్రశ్నించెను.

వసిష్ఠుండు శాంతమూర్తియై వెఱ్ఱివాండా! బ్రాహ్మణవిత్తాపహార మెట్టిదో యెఱుంగక యిట్లు పౌరుషవాక్యము లాడుచున్నావు వినుము.

చ. బలము హరించు ధైర్యమును
భగ్నముసేయును సర్వరాజ్యమున్
గులమును రూపుమాపు నృప
కుంజర! దుర్భర పాపభీషణా
నలమయమైన బ్రాహ్మణ
ధనంబున కాసవహింపనేల ది
గ్వలభుల దుర్యశోమలిన
వర్ణము వ్రాయఁగనేల మానుమీ.

అని మఱల హితవుఁ జెప్పెను.

మంచిది. నా యభిమతమును దీర్పనట్టి నీవు పరాక్రమాగ్నిచే నిస్తేజుఁడవు కాఁగల వని విశ్వామిత్రుఁడు కన్నులెఱ్ఱఁజేసెను. నీ బెదరింపులకు జడియువాఁడను కా నని వసిష్ఠుఁడు తన యాశ్రమములోని కరిగి తపోనిష్ఠ నవలంబించెను.

కొంతసేపటికి శబల యను వేల్పుసురభి కన్నులనీరుఁ గార్చుచు వసిష్ఠునిచెంత కరుదెంచి మునీంద్రా! నే నేమి యపకృతిని గావించితి నని యీ క్రూరాత్ముని వశము జేసితివి? విశ్వామిత్రునిపై నికు లరుదెంచి నన్ను బలాత్కారముగ నీడ్చి కొనిపోవఁ బ్రయత్నించుచున్నారు. నీ వాజ్ఞ యొసఁగితివా? లేక వారు మదోన్మత్తులై నన్ను హరించుచున్నారా? యని యడిగెను.

వసిష్ఠుఁడును బిడ్డా! ఆతఁడు దాక్షిణ్యముచే నిన్ను గొంపోవఁ బ్రయత్నించుచున్నాఁడు. కాని, నా ప్రాణపదంబ

నైన నిన్ను వారికి సమర్పించియుండలేదు. కావున నీ యంగములనుండి మహాశూరులఁ బ్రభవించి యీ ఖలుల నుక్కడంగించుము. నేను శరాసనశరంబుల ధరించి క్షాత్రమున విజృంభింప వీలులేదు. నా శాంతమునకు భంగముకలిగిన నా తపము భంగమగు నని సురభికి నాజ్ఞ యొసంగెను.

వసిష్ఠాజ్ఞ ననుసరించి శబల తన యవయవములనుండి యనేకశూరుల నుత్పన్నులఁజేయ, నా శూరులు విశ్వామిత్రుని సేనల రూపుమాపి యాతని నొప్పించిరి.

అంతట నా క్రోధదేవత ([redacted] విశ్వామిత్రుఁడు) సమ్ముఖమునుండి యనేకదివ్యాస్త్రములు వచ్చి వసిష్ఠుని ముట్టడించెను. వసిష్ఠునకు వాని దౌర్జన్యమున కాగ్రహము వచ్చినది కాని, అట్టి సమయమున శాంతమును కొంతవఱ కుపయోగించి చూచెను. కొంత శత్రుసంహారమైనది. ఆ యాగ్రహదేవతబలమే అతిశయించి తన్ను బాధించుచుండుటచే వసిష్ఠుండును సహజగుణమైన శాంతమును విడువలేక యెట్లో బలవంతముమీఁద విడిచి కోపఘూర్ణితవదనమండలుండై దుర్వారవీక్షణములఁ బ్రసరింపఁజేసెను.

వసిష్ఠుని క్రోధనిరీక్షణానలకీలలచే నా సమయంబున విశ్వామిత్రపుత్రసంతతి యంతయు భస్మీభూతం బయ్యెను. గాధేయుండును తేజంబును దక్కి వ్యర్థదివ్యాస్త్రసంచయుండై భగ్నదంష్ట్రికంబైన పన్నగంబుపగిది చేయునదిలేక తపంబునఁ గాని యాతని జయింప నలవికాదని యెంచి వెడలిపోయెను.

చ. ఒరులధనంబు గోరుటె
యయుక్తము కోరిన వారులేదనన్
మరణమె శ్రేయమా దురభి
మానముతో నెదిరించి యోడ ద
త్పరిభవ వహ్నికాయమునఁ
బ్రాణము వోయెడుదాఁక గాల్చు ను
ర్వరఁ బరవస్తువాంఛ యెటు
వంటి సమర్థులకైన ద్యాజ్యమా.

వసిష్ఠుండు మఱికొన్ని సంవత్సరములు తపోనిష్ఠలోనుండ నొక్కనాఁడు మఱల విశ్వామిత్రుఁడు దురాగ్రహగ్రస్తుండై, సమరమునకు సంసిద్ధుండై దివ్యాస్త్రములఁ బ్రయోగింప నారంభించెను.

అప్పుడు వసిష్ఠుండు, తిరిగి గాధేయుండు తన క్రౌర్యమును జూపించుచున్నాఁడు. ఇదివఱకే ప్రశాంతమై, నిర్మలమైన నా హృదయము పద్మరాగమణినికటస్థమైన వజ్రంబు పగిది క్రోధారుణితమై గాధేయపుత్రుల దగ్ధంబుఁజేసినది. ఎట్టివాని కెట్టి విపత్సమయమునను దురాగ్రహ మవలంబించుటుచితముకాదు. కావున నిప్పుడు నా దండముపై నా రక్షణ భారమునునిచి నేను ప్రశాంతుఁడనై యుండెద నని తలంచి బ్రహ్మ దండమును దనపురోభాగంబునఁ బ్రతిష్ఠించి,

చం. ఎఱుఁగకయో యెఱింగియొ
వహించితిఁ దొల్త దురాగ్రహంబు నో
గుఱువగు బ్రహ్మదండమ!
ప్రకోపనుఁడై యదె గాధిసూతి క్ర
మ్మఱఁ జనుదెంచె శాంతమును
మాత్రము మానను శత్రుగర్వసం
హారణముఁ జేసి కావుము
దయామతి నీకు నమస్కరించెదన్

అని తన రక్షణభారమంతయు బ్రహ్మదండముపై నునిచి బ్రహ్మదండస్తవము నొనరించుచు దానివెనుకఁ గూరుచుండెను. క్రోధదేవతయైన విశ్వామిత్రుఁ డనేకదివ్యాస్త్రముల బ్రయోగించెను. వాటి నన్నింటిని బ్రహ్మదండమే ప్రత్యక్షరూపములఁ దాల్చి మఱలించుచుండెను. నారాయణాస్త్రము బగబగ మండుచు నరుదెంచెను. పదంపడి బ్రహ్మశిరోనామకాస్త్రము ప్రయోగింపఁబడెను. బ్రహ్మదండమును దాను నారాయణాస్త్రమై బ్రహ్మశిరోనామకమై వాటిని జల్లార్చెను. తరువాత మహాపాశుపతాస్త్రము కాలప్రళయంబును గల్పించుచు నరుదెంచెను. దానినిఁగూడఁ దాను బ్రహ్మశిరోనామకాస్త్రమై వారించెను.

అప్పుడు విశ్వామిత్రుండు వ్రేటుపడిన మొగంబుతో నేలఁ గూలఁబడియెను. నిస్తరంగసముద్రమువలె గాంభీర్యముడిగెను. బ్రహ్మబలమే బలముకాని ఛీ! క్షత్రియబలము బలమా? యని నిస్పృహతో వెడలిపోయెను.

అప్పుడు శాంతరౌద్రరసములకు జరిగిన మహాసంగ్రామమున రౌద్రదేవతయే యోడిపోయెను. శాంతదేవత విజయమును గాంచెను. సమస్తమహర్షులును పురందరాదిబృందారకసందోహంబును వియత్తలమున నధివసించి, ఓవసిష్ఠ బ్రహ్మర్షివర్య! "విజయతామ్ విజయతామ్" అని కొనియాడి.

శ్లో. అమేయం తే బలం బ్రహ్మన్ తేజో ధారయ తేజసా
నిగృహీత స్త్వయా బ్రహ్మన్ విశ్వామిత్రో మహాతపాః
ప్రసీద జపతాం శ్రేష్ఠ లోకా స్సంతు గతవ్యథాః.

ఆంధ్రీకరణము.

గీ. అచ్యుతము నీ బలంబు బ్ర ♦ హ్మమునివర్య!
నీ తపస్తేజమున గాధి ♦ సూతి తేజ
మడఁగె నీ వింక సుప్రస ♦ న్నుఁడవు కమ్ము
వ్యథ దొఱఁగి లోకములు శాంతి ♦ నందునట్లు.

అని సంస్తుతించి మింటినుండి పుష్పవర్షమును గురిపించిరి.

వసిష్ఠుండు మఱలఁ దపోనిష్ఠకుఁ బ్రారంభించె. ఒక్కనాఁ డయోధ్యాపురాధీశ్వరుండైన త్రిశంకుమహారాజరుదెంచి స్వామీ! శరీరముతో స్వర్గపదంబున నివసించునట్లు నాచేత నొకజన్నముఁ జేయింపుఁడని ప్రార్థింప, మహారాజా! పరమపవిత్రస్థానమైన స్వర్గపదంబును సమస్తపుణ్యకర్మాధి

హీనమైన నీ జాతికి దేహంబుతో ననుభవించెద ననుట మిక్కిలి యప్రశస్తము. అపవిత్రవస్త్రములతో భుజించుటయు నశుచియై సవనపురోడాశభక్షణము చేయుటయు ననుచితములు. కావున నసహ్యకార్యములకుఁ బ్రయత్నింపవల దని వారించెను.

ఆ మరునటిదినముననే మహోదయప్రముఖులైన తన కుమాళ్ళను నూర్వురను ఘోరశాపోపహతులఁ జేసి విశ్వామిత్రుండు సంహరించె నని విని యరుంధతియు వసిష్ఠుండును మితిలేని దుఃఖసాగరమున మునింగిరి. ఆ దంపతుల శోక మనివార్య మయ్యెను. పుత్రశోకసంతప్తుఁడైన వసిష్ఠుండు దుఃఖము భరింపలేక రాళ్ళు గట్టుకొని సముద్రమున కుఱికెను. పర్వతశిఖరంబు నధిష్ఠించి క్రిందికి దుమికెను. సముద్రము మోకాలిబంటి యయ్యె. మహీధరమూలప్రదేశము పుష్పశయ్య యయ్యెను. దావాగ్నుల నుఱికిన నవియుఁ జల్లారెను. కాని వసిష్ఠుండు చావఁ డయ్యెను.

గీ. నలువ యాయు వొసంగిన ♦ బలిమిచేతఁ
జావవలెనన్నఁ జచ్చునే ♦ జీవకోటి ?
మరణ మాసన్నమైయుండ ♦ మందిరమునఁ
బేటి నడఁగిన మృత్యువు ♦ నోటఁ బడదె ?

సర్వసాధారణముగ నొక పెంపుడుబిడ్డ కాపద సంభవించినంతనే యజమాని హృదయ మంతయు శోక సందగ్ధ మగుట స్వభావము. నూర్వురు మహాతపోధనులు కుమాళ్ళు

తేజోసమానము లోకా కౌశికశాపాగ్నిచేఁ బగులువడి యప్పుడు వసిష్ఠారుంధతుల హృదయము లెట్లుండెనని నుడువుట కెవ్వరికిని శక్యము కాదు. ఆ దంపతులకే యనుభవము.

మఱియుఁ దా నా కౌశికునిఁ బ్రతిశాపోపహతునిఁ జేయుటకు సమర్థుఁ డయ్యును, తనతపమునకు శాంతిదోషము సంభవించు నని యూరకుండెను. తనకు మరణ మింక సంభవింప దని నిస్పృహఁ జెందియుండెను.

చ. సుతశతమున్ దహించి తను♦శోకమహాబ్ధిని ముంచినట్టి దు
ర్మతి హరియింపఁగల్గిన దు♦రాసదశాపశరంబుఁ గల్గియున్
వ్రతనియమంబు వోవు నని♦క్రౌర్యముఁ బూననియట్టి నిర్మల
స్థితుని మహానుభావుని వ♦సిష్ఠుప్రశాంతము నెన్న శక్యమే ?

అప్పుడు కొంతసేపటికి వసిష్ఠుఁడు సంసారమోహపటలమును బటాపంచలు చేసి, శోకమూర్ఛితయైన అరుంధతి నాశ్వాసించి ప్రియురాల! అల్పాయుష్కులైన సుతులకొఱకు వగవకుము. పుత్రులకును మనకును సంబంధము లేదు. భగవదనుగ్రహము గలిగిన మఱల బుత్రవతివి కాఁగల వని యోదార్చి తా నెప్పటియట్లు తపంబున కుపక్రమించెను.

ఇట్లుండ నొకనాఁడు బ్రహ్మాదిదేవతలచే నాహ్వానింపఁబడి విశ్వామిత్రుఁడు తపంబుఁ జేసిన ప్రదేశమున కరిగి దివ్యులందఱు నా గాధేయుని బ్రహ్మర్షివైతి వని వరంబిచ్చుచుండఁ,

బ్రహ్మాయాజ్ఞచే నాతనిని బ్రహ్మర్షివై తివి. విశ్వామిత్రా! నీ తపం బనవద్యమై జగంబున సంస్తవనీయ మైన దని ప్రశంసించెను.

అదిమొదలు విశ్వామిత్రవసిష్ఠులకు మైత్యముతోడనే యుండిరి. తరువాత వసిష్ఠునకు శక్తిప్రభృతులు కుమారులనేకు లుదయించిరి.

ఇట్లుండ నొకనాఁ డింద్రసభలో భూలోకమున సత్యసంధుఁడెవఁడని శక్రుండు ప్రశ్నింపఁగా వసిష్ఠుండు హరిశ్చంద్రుఁడాడితప్పని సత్యసంధుఁ డని వక్కాణించెను.

విశ్వామిత్రుండు మఱల నసూయాగ్రస్తుండై బ్రహ్మర్షివరదానగర్వంబునంజేసి వసిష్ఠుని వాక్యము విశ్వాసపాత్రంబుకాదు. హరిశ్చంద్రునిచేత నే నసత్య మాడించెద నని ప్రతిజ్ఞఁబట్టెను. హరిశ్చంద్రుఁడే యనృతమాడినచో సూర్యచంద్రాదులు తాఱుమాఱగుదు రని వసిష్ఠుండు వాదించెను.

ఇరువురును ప్రతిజ్ఞలఁబట్టి యెక్కడివా రక్కడకు వెడలిపోయిరి.

వసిష్ఠుం డరుంధతీసహితుఁడై గంగాతీరమున కేఁగి తపముసేయుచుండెను.

కొంతకాలమున కొక్కనాఁడు శిష్యులవలన గాధేయుండు హరిశ్చంద్రుని బెట్టిన బాధలును నా సత్యవ్రతుండు

దివంబుఁ జేరుటయు, విని దుర్వారకోపభూయిష్ఠుండై జలంబుల నంజలిచే గ్రహించి-

చ. నను నలయించినన్ సయిచి♦నాను కుమారశతంబు మంటఁ గ
ల్పిన శమియించితిన్ నృపకు ♦ లీనుని సత్యరతున్ త్రిశంకునూ
నుని వెతఁద్రోసినట్టి కఠి♦నున్ సహియింపను గాధిసూతి మ
ద్ఘనతరశాపవాగ్విధి బ♦కంబయి పుర్వుల మెక్కుఁగావుతన్.

అని శపించి జలవిసర్జనముఁ జేసెను.

ఈ వసిష్ఠుని నిష్ఠురశాపంబు విని విశ్వామిత్రుండును చుళుకమున సలిలము గ్రహించి వసిష్ఠుండు నా శాపహతిచే దివాంధమై కాకభక్షణమున జీవించుఁగాక! యని వానిని విడిచిపెట్టెను.

అప్పుడు విశ్వామిత్రుండు మూఁడువేల తొంబదియాఱు యోజనములపొడవుగలిగిన బకంబును వసిష్ఠుండు ద్విసహస్ర యోజనోత్సేధంబైన యాడేలును నై పూర్వకృతవైరంబునం జేసి పక్షప్రోద్భూతమహావాయుతరంగసంఘట్టనంబుల మహీధర బృందంబులు పెల్లగిల్లి పఱువువెట్టఁ గ్రోధారుణితనేత్రంబుల విస్ఫులింగములు గురిసి ప్రపంచము దగులఁబెట్ట నొండొంటిం దాకి మహాసంరంభంబున సంగ్రామంబు సేయుచుండ నాయు త్పాతములకు దిశలు తల్లడిల్లి నూర్ధ్వలోకంబులు కంపింప నట్టియెడ నకాలప్రళయంబు సంభూతం బయ్యెను.

బ్రహ్మాదిదేవత లడలి యచ్చోటి కరుదెంచి వారి శాపాలాపములఁ దొలఁగించి విశ్వామిత్రవసిష్ఠులఁజేసి మహా మునులారా! విజ్ఞానులైన మీ కిట్టి మచ్చరములు తగునా? శాంతింపుఁడు. మీ వైరమూలమున లోకముల కారాట మొదవుచున్నది. మీ రిదిమొదలు స్నేహభావమున నుండుఁడని వారించెను.

అప్పుడు వసిష్ఠవిశ్వామిత్రులు మచ్చరము లుడిగి యన్యోన్యాన్వేషణములఁ గావించుకొని యదిమొదలు స్నేహ భావముతో మెలంగుచుండిరి.

సీ. కోప మెట్టువంటి వానికిన్ ♦ గూడని పని
కాలగతిచేతఁ గ్రోధంబుఁ ♦ గాంచుగాక
క్షణములో శాంతిఁ జెందుట ♦ సాధుమతము
దీర్ఘకోపున కాపదల్ ♦ స్థిరము లగును.

కావున మహానుభావు లగుటచే నంతలో శాంతివహించి స్నేహంబున వసిష్ఠగాధేయులు సంచరించుచుండిరి.

తరువాత నొకనాఁడు శతవర్షక్షామబాధ మాన్పుటకును నిజపాపశాంతికొఱకును, గౌతమమహర్షి గంగాదేవిని ధరిత్రికిఁ దెచ్చుచున్నాఁడని విని వసిష్ఠుండు తక్కిన ఋషులతోఁ గలిసి రాజమహేంద్రవరమున కరుదెంచి అత్ర్యాదులతోఁ బాటు గంగాశాఖ నొకదానిని దెచ్చి యంతర్వేదిచెంత సముద్ర గామినిగాఁ జేసి తాఁ దెచ్చిన వసిష్ఠానది ప్రవహించు తీరముల

ఉనవారసింహ దేవప్రతిష్ఠలఁ గావించి యంతర్వేదియే యాశ్ర మముగ నివసించి తపోనిష్ఠాగరిష్ఠుఁడై యుండెను.

ఇంతలో నయోధ్యాపురాధీశ్వరుఁడైన దశరథమహా రాజునకు నారాయణుం డుదయించు నని నారదువలన నెఱింగి పుత్రకామేష్టియాగమును జేయించి శ్రీహరి యావిర్భావమునకై యెదురుసూచుచుండ నా దశరథపత్ను లైన కౌసల్యాసుమిత్రాకైకలకు నల్వురు బాలు రుదయించిరి.

వసిష్ఠుండు దివ్యజ్ఞానసంపన్నుఁ డగుటచే విష్ణువుయొక్క యే కళతో నెవ్వ రుద్భవించిరో యెఱింగినవాఁడై హరిప్రధా నాంశచే జనించిన కౌసల్యాతనయునకు రాముఁడనియు, సుమిత్రా పుత్రు లిద్దఱికిని లక్ష్మణ శత్రుఘ్నులనియు, కైకి పుత్రునకు భరతుఁ డనియు నామకరణములఁ జేసెను. అరుంధతియుఁ బురాణపురుషుని యావిర్భావమును కలపుచు నయోధ్య యందే నివసించెను.

తరువాత నష్టమవర్షము రాగానే పరాత్పరుఁడైన శ్రీరామచంద్రునకును దక్కినవారికి నుపనయనముల నేర్పఱిచి తానే బ్రహ్మోపదేశముం జేసి కృతార్థుఁడనైతి నని సంతసించు చుండెను.

పిమ్మట రామాదులకు విద్యాభ్యాసముఁగూడఁ దానే చేసి సంపూర్ణవిద్యావంతులఁ జేసెను.

గీ. పూర్ణవిద్యాంసుఁడైన గు ♦ ర్వు లభియింప
శేముషియు శ్రద్ధయును గల్గు ♦ శిష్యు లుండ

విద్యకుఁ గొఱంత యుండునే ♦ పృథ్విలోన
మంచి రైతులు పొలముఁ బం ♦ డించునటులు.

తరువాత నొకనాఁడు వసిష్ఠుండు దశరథమహీపాలునితో సభలో ముచ్చటించు నవసరమున విశ్వామిత్రుఁ డరుదెంచి, యాగసంరక్షణార్థము రామలక్ష్మణుల నర్పించు మని యడుగఁ బుత్రప్రేమచే దశరథుండు వెనుదీయుచుండు సమయంబున విశ్వామిత్రుండు మహానుభావుఁడు, అతనికి నీ కుమారుల నర్పించిన దివ్యాస్త్రసంపన్నులఁగాఁ జేయు నని బోధించి యాతనివెంట రామలక్ష్మణులఁ బంపించెను.

పిమ్మట రామాదుల వివాహానంతరమున రామునకు యౌవరాజ్యపట్టాభిషేకము సేయుటకై సుముహూర్త మేర్పఱుపవలసిన దని దశరథుండు కోరుటచే వసిష్ఠుండు దివ్యదృష్టితో బరిశీలించి భవితవ్యము నంతయుఁ దెలిసికొని యట్టి భవిష్యద్దుఃఖవ్యాపారమును వెలిబుచ్చుట భావ్యముకాక సుముహూర్త మేర్పఱచెను.

ఆ మఱుచటి దినంబున కైకేయివలన రామలక్ష్మణులరణ్యావాసమునకై చనుటచేఁ గొందఱు పౌరులు వసిష్ఠుండు రామపట్టాభిషేకమునకై యుంచిన ముహూర్తము రామాదుల యరణ్యావాసమునకై వినియోగింపఁబడినదని హేళనముం జేయఁ జిఱునగవునగుచు నిరుత్తరుఁడై యుండి యెఱుఁగని వానివలె భరతుని ప్రార్థనముచే రామునిచే వనవాసము

మాన్పింపఁ బ్రయత్నించెను. కాని రాముని యోగ్యతవలన భరతుని యభిమతమును దీర్ప లేకపోయెను.

శ్రీరాముఁ డడవి కేఁగుటయు దశరథుం డస్తమించుటచేతను వసిష్ఠున కయోధ్యావాసత్వము దూరమై తిరిగి తన యాశ్రమమునకుఁ బోయెను.

రాముండు రావణాది సంహారముఁ గావించి బ్రహ్మహత్యాదోషనివారణమునకై కోటిలింగప్రతిష్ఠ సేయుచు వచ్చి యంతర్వేదికి సమీపమున నున్న శివకోడను పురమున కరుదెంచినాఁ డని విని వసిష్ఠుఁ డచ్చటికి రాఁ బ్రయాణ మగుచుండెను.

అరుంధతి భర్తను జూచి నాథా! రాముని మన యాశ్రమమునకుఁదీసికొని వచ్చినచో మన బిడ్డలను మ్రింగివేయుచున్న శంబరభండాసురాదులు సంహరింపఁబడఁగలరు. ఇది మొదలు మన బిడ్డలు బ్రతుకఁగలరు. కావునఁ దోడితెండని ప్రార్థించెను.

దేవి! ఈ తుచ్ఛ సంసారరక్షణమునకై భగవంతు నిటకు రమ్మనుట శ్రేయముకాదు. రాముఁడు మన యాశ్రమమునకు వచ్చెదనన్న వలదన నని చెప్పి శివకోడున కరుదెంచెను.

రాముఁ డా పురమున లింగముం బ్రతిష్ఠించి కోటిలింగములును బూర్తియైనను తాను కృతకృత్యుఁడఁ గాలే దే మని శంకించుతఱి గర్గుఁడు రామేశ్వరమునందలి సికతాలింగముతోఁ

గోటిక్షేత్రమైనదనియు మఱొక లింగముం బ్రతిష్ఠింపవలెననియు చెప్పుచుండెను. అందువలన నా యూరికి శివకోటి యని నామ మయ్యెను. ఇంతలో వసిష్ఠుండు చని వారిని దోడ్కొనివచ్చి రామేశ్వరమున లింగమును బ్రతిష్ఠింపఁజేయ నందువలన రామునిచేతి తోరము విడిపోయెను. అందువలననే యీ గ్రామ మునకుఁ గృత్యకృత్యరామేశ్వర మని పేరు వచ్చినది.

మఱియొక లింగము మిగుల లక్ష్మణునిచే లక్ష్మణేశ్వర మున దానినిఁ బ్రతిష్ఠింపఁజేసి రాముఁడు సమీప మని వసిష్ఠా శ్రమమైన యంతర్వేదికిఁ జని యా నాఁ డరుంధతీదేవి యాతిథ్య మును స్వీకరించెను.

అరుంధతీదేవి రామాదులకు భోజ్యముల వడ్డించుచు కన్నుల నీరుగార్పఁ దల్లీ ! నీ విచారకారణ మేమని రాముఁ డడిగెను.

అరుంధతియు, రామభద్రా! కనిన బిడ్డలనెల్ల నీ ప్రాంత మందలి శంబరభండాసురాదులు తినిపోవు చుందు రనెను.

తల్లీ ! విచారింపకు మని చెప్పి యందున్న రక్తబీజుని రక్తమువలన మఱల నాతఁ డుదయింపకుండ వానిరక్తము భూపతితము కాకుండ నాలుకపఱచి త్రాగుటకు సీత యశ్వా రూఢాంబయై రక్తపానము సేయునటులు నియోగించి, వానికి భండనసమయమునఁ భండశంబరాసురులు సహాయులుకాకుండ హనుమంతుని లక్ష్మణుని రెండువైపులను గాపుంచి రాముఁడా రక్తబీజుని సంహరించి యనంతరమున భండశంబరుల వధించి

వసిష్ఠాశ్రమమును నిరపాయము గలదానినిఁగాఁ జేసెను. అంతర్వేదిలో నిప్పటికిని నరసింహస్వామియొక్కయు లక్ష్మణాంజనేయులయొక్కయు దేవళము లిప్పటికి నున్నవి. ఆ స్థల మాహాత్మ్యమున నట్లున్నదని పెద్దలు చెప్పుదురు.

తరువాత వసిష్ఠారుంధతులు బయలుదేఱి రామునితో నయోధ్యకేఁగి శ్రీరామపట్టాభిషేకమును గావించి ఆంజనేయునకు శ్రీరామమూర్తిచే భవిష్యద్బ్రహ్మపదంబునకుఁ బట్టాభిషేకముఁ జేయించి తరువాత అంతర్వేదిపుణ్యక్షేత్రమున కరుదెంచి వాసిష్ఠరామాయణచరిత్రమును వ్రాసి జ్ఞానవాసిష్ఠ మను వేదాంతగ్రంథమును మఱికొన్ని స్మృతులను వ్రాసి ప్రపంచమునకు విద్యాభిక్షఁబు వెట్టి యద్భుత తేజుండై తమదంపతులను వివాహసమయమున దర్శించిన దంపతులకు సౌభాగ్యాయురారోగ్యము లొసంగుచు బ్రహ్మ యనుజ్ఞచే సప్తర్షి మండలమున వసించి యుండిరి.

స్వస్తి.

శ్రీ చక్రావధానుల మాణిక్యశర్మ విరచితమైన

సప్తర్షుల చరిత్రము సర్వము సంపూర్ణము.

శ్రీ. శ్రీ. శ్రీ.

---